సంపూర్ణ
పుష్టికరం-
అపరిమిత
ఆహ్లాదం!

సరికొత్త

# ఐస్‌క్రీం రుచి గల కాంప్లాన్®

తల్లులారా! పెదవులతో చప్పరించే ఐస్‌క్రీం వలె మీ పిల్లలకు చవులూరించే రుచిగల పోషక పానీయం, ఇదిగో! వేడికి పిల్లలు సరిగా తిండి తినరు. అలాంటప్పుడు ఐస్‌క్రీం రుచిగల, జిల్లుమనే కాంప్లాన్‌తో వాళ్లకు అవసరమైన పోషక ఆహారమివ్వండి!

ప్రోటీన్లు పెరుగుదలకు నేరుగా తోడ్పడే పోషక పదార్థాలు. కాంప్లాన్‌లో అత్యుత్తమమైన ప్రోటీన్లు—అనగా పాల ప్రోటీన్లు, ఎదిగే పిల్లలకు ప్రతిరోజూ అవసరమయ్యే మరో 22 ఇతర కీలక ఆహార పదార్థాలూ వున్నవి. మీ పిల్లలకి ఇవ్వడం మొదలెట్టండి కాంప్లాన్-రోజుకు రెండుసార్లు.

కాంప్లాన్ రుచికరమైన చాక్లేట్, స్ట్రాబెరీ, ఏలక్కాయ-కుంకుమ పువ్వు సువాసనలలో దొరుకుతోంది. సాదా రకంలో కూడా.

పాలతో కలప నవసరం లేదు.

Glaxo
Complan®
COMPLETE PLANNED FOOD
'ICE-CREAM' FLAVOUR

**కాంప్లాన్®** – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

GK&E.B84.GLC.2317.12.Tel.

## ముఖ చిత్రం

నా అభిమాన నటీ నటులు చిరంజీవి-మాధవిల ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాల ఆకర్షణీయంగా వున్నది

జి రమణిమోహన్, కడప

• • •

నూతన సంవత్సర ఆరంభంలో భారత చలన చిత్ర అందాల తార జయప్రద ముఖచిత్రం వేసి మా మనస్సులను దో చేశారు

బి వి కృష్ణ, చీరాల

## ఆకర్షణీయం

మాధవి, చిరంజీవి ముఖ చిత్రంతో వెలువడిన 4-1-85 పత్రిక అత్యంత ఆకర్షణీయంగా వుంది కథల్లో 'ఇది ప్రశ్న'-ఏది జవాబు' అధిక సంతానం కోరుకొనేవారికి కనువిప్పు కాగలదు సీరియల్స్ నాలుగు రసమయంగా,సాగుతున్నాయి ప్రింటింగ్ సంతృప్తికరంగా వుంది

సి వి నరసింహదాసు, విజయనగరం

## కథలు

4-10 జనవరి 85న మాధవి, చిరంజీవి ముఖ చిత్రముతో వెలువడిన ఆంధ్ర సచిత్రవారపత్రిక చాలా బాగుంది మద్దాలి నిర్మలగారి "ఇది ప్రశ్న-ఏది జవాబు' కథ చాలా బాగుంది రచయిత్రికి అభినందనలు

షేక్ షాజహాన్, పాత గుంటూరు

## న్యూఢిల్లీ లేఖ

28-12-84 సంచిక, జయప్రద ముఖచిత్రము చాలా బాగుంది డా జయదుబాషీగారి, "వ్యాపా




రంగా మారిన రాజకీయాలు" న్యూఢిల్లీలేఖ వ్యాసం చాలా బాగుంది

ఎస్ ఎం గౌరీశంకర్, ఎస్ సన్యాసిరావు, కోరుకొండ

## సీరియల్స్

ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురిస్తున్న "కాగితపు పడవలు" సీరియల్ చాలా బాగుంది ఈమధ్య కాలంలో 'సెక్సు' లేకుండా ఇంత రక్తి కట్టించిన సీరియల్స్ చదవలేదు రచయిత్రి వరలక్ష్మీదేవిగార్కి అభినందనలు దేదీప్య సీరియల్ ముగింపు చాలా బాగుంది

దామోదర వెంకటేశ్వరరావు, విజయనగరం

• • •

28-12-84 నాటి ఆంధ్రసచిత్రవారపత్రిక ముఖ చిత్రం అందాల నటి జయప్రద చాలా బాగుంది ఎదవీణ మ్రోగిన వేళ సీరియల్ చాలా ఆసక్తికరంగా సాగుతోంది

బొగ్గరపు మల్లికార్జున, బరంపురం

## బాగుంది

ఆంధ్రసచిత్రవారపత్రిక (28 12 84)లో ప్రచురించిన హీరో కృష్ణంరాజుతో ఇంటర్వ్యూ బాగుంది

-జె శ్రీరమణ, ఖమ్మం □




# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938 - 1972)

శుక్రవారం 1-7 ఫిబ్రవరి, '85

శ్రీ రక్తాక్షినామ సం మాఘ శు ఏకాదశి

సంపుటము 77 : సంచిక 22

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడిప్రతి వెల | రు | 2-00 |
| ఆరు మాసాల చందా | రు | 55-90 |
| పోస్ట్‌లో ఏడాది చందా | రు | 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# భారతదేశానికి ఏది మంచిది?

పైకి కనిపించే విధంగా పరిస్థితులు ఉండటం అన్నది చాలా అరుదైన విషయం ఎన్నికలకి ముందు పంజాబ్, శ్రీమతి గాంధీ హత్య గురించే కాక మరేవో విషయాలు వోటరు మనసుపై పని చేస్తున్నాయని కొందరు సూచించినా అసలు అతని మనసులో ఏముందో మనలో చాలా మందికి తెలియదు ఏ పార్టీ గెలిస్తే తన భవిష్యత్తు ఎలా ఉంటుందన్న ఆలోచనతో వోటరు ముందుకి చూస్తుంటే ఎన్నో పార్టీలు వెనక్కి చూశాయి ఆఖరికి అధికార పక్షంలోని పెద్దలు కూడా తమకి ఆశ్చర్యం కలిగించే ఫలితాలు ముందు ఉన్నాయన్న సంగతి తెలుసుకోలేక వాళ్ళు కూడా వెనక్కే చూశారు ఇప్పుడు వాళ్ళు ఎన్నైనా చెప్పవచ్చు శ్రీ రాజీవ్‌గాంధీ ప్రకటనలు తాను ఎటు వెళ్తున్నాడో తెలియక నిస్పృహ చెందిన వ్యక్తి మాటల్లా ఉన్నాయి అప్పుడు ఆయనకి తన విషయంలో ఏమి జరగ బోతున్నదో కూడా తెలియదు నేనే రాజీవ్‌గాంధీ స్థానంలో ఉంటే ఈ ఎన్నికల ఫలితాలని సరైనవిగా భావించను ఆయనకి అనుకూలంగా వోట్లు వేసిన వారికన్నా ప్రతికూలంగా వోటు చేసినవారే ఎక్కువమంది ఉన్నారు ఏ మాత్రం అటూ ఇటూ అయినా, 1971లో ఆయన తల్లిగారికి అయినట్లు, చాలా ఇబ్బందిలో పడేవాడాయన

భద్రత కోసమే భారతీయులంతా భయవిహ్వలులైన వారిలా స్థిరత్వం కోసం వోట్లు వేశారనుకుంటే అది పొరపాటే అవుతుంది స్థిరత్వం కోసమే కాకుండా మార్పు కోసం కూడా మనం వోట్లు వేశాము దేశానికి సంబంధించినంత వరకూ స్థిరత్వం కోసం, సమాజానికి సంబంధించినంత వరకూ మార్పుకోసం మనం వోటు వేశాము. పంజాబ్ సమస్య, ఆ తర్వాత శ్రీమతి గాంధీ హత్య స్థిరత్వం చాలా అవసరమని నిరూపించాయి కానీ అంతటితో సరిపోదు ఆర్థికంగా, అలాగే మరి కొన్ని విషయాలలో అంతగా కనిపించక పోయినా దాదాపు నాలుగు దశాబ్దాల నిరంతర అభివృద్ధి అనంతరం ప్రస్తుతం భారతీయ సమాజం 20 ఏళ్ల కిందట ఉన్నట్లు లేదు ఆ మార్పులు దేశ పరిపాలనలో కూడా తగినంతగా ప్రతిఫలించాలని వోటరు కోరిక ఈ దేశంలో వచ్చిన పెద్ద మార్పు గురించి ప్రతిపక్ష నాయకులకి చాలా మందికి నిజంగా తెలియదు చరణ్‌సింగ్ లాంటివారు భారత దేశంలో రైతుకి, వ్యవసాయానికీ వ్యతిరేకంగా బస్తీలలో ఉన్న నాగరికులు కుట్ర పన్ను తున్నారనుకుంటూ ఉంటారు వాళ్ళేమి చెబుతున్నారో వారికే తెలియదు వ్యవసాయదారులంతా వారి తాహతుకి తగినట్లు వారు బాగానే ఉన్నారు బహుశ విదేశాలలో వారితో పోల్చి చూసుకుంటే కొంత తక్కువగా ఉండవచ్చు అలా అనుకుంటే ఈ దేశంలోని ఏ వర్గం వారూ విదేశాలలోని తమ వర్గం వారంత బాగాలేరు మనదేశంలోని వ్యాపారస్తులు హాంగ్‌కాంగ్, సింగపూర్‌లలో వ్యాపారస్తులంత మెరుగ్గా లేరు గల్ఫ్ దేశాల సంగతి వదలివేయండి అక్కడివారు డాలర్లలో సంపాదించినంత మనవాళ్ళు రూపాయలలో కూడా సంపాదించలేరు ఏదిఏమైనా భారత ఆర్థిక, సామాజిక రంగాలలో పెద్ద మార్పు వచ్చింది ఇరవై సంవత్సరాలకి ముందు మనం బ్రతకటం ఎలా అన్న ఆలోచనతో సతమత మవుతూ ఉండే వాళ్ళం ఇవాళ మన సమాజంలో చాలా మంది ఈ బ్రతుకు భయాన్ని వెనక్కి నెట్టి ఇంకా ముందుకి చూస్తున్నారు దాదాపు మూడు నాలుగు శతాబ్దాలుగా బ్రతకడం ఎలా అన్న దానికి మించి ఆలోచించని మన సమాజానికి నిజంగా ఇది చాలా పెద్ద విప్లవాత్మకమైన మార్పు మన నాయకులు, అందులోనూ చరణ్‌సింగ్ లాంటి మరో యుగానికి చెందినట్లుండేవారు మాత్రమే ఈ బ్రతుకు భయం నించి బయట పడలేకుండా ఉన్నారు




మన దేశంలోని జనాభాలో సొంతం సగం మంది దారిద్ర్య రేఖకి దిగువన, మిగతా సగం బాగా పైనా ఉన్నారు పైన ఉన్నవారు తమ విషయం తాము బాగానే చూసుకుంటున్నారు అయితే ఏ సగం నిండిన పాత్రని చూస్తున్నారన్న దానిపైనే అది ఆధారపడి ఉంటుంది అంతే కాక దారిద్ర్య రేఖకి దిగువన ఉన్నవారు మిగతా సగం మంది పేదరికపు ఉచ్చులలో నుంచి బయట పడటాన్ని తమ కళ్ళారా చూసారు అలా తాము ఎందుకు బయట పడలేక పోతున్నామా అని వారు విస్తు పోతున్నారు బడిలో పలి భాగం ఎలా ఉంటుందో కూడా తెలియని నిరక్షర కుక్షి అయిన మా పనివాడు, ఎంతో గర్వంగా, తన కొడుకు ఇంగ్లీషు బడికి వెళ్తున్నాడని ఎప్పుడూ నాతో అంటూ ఉంటాడు ఆ పిల్లవాడు తన తండ్రిని డాడీ అని, తల్లిని మమ్మీ అని పిలుస్తాడు ఆ భార్యాభర్తలిరువురూ కలిసి నెలకి రు 600 లోపే సంపాదిస్తారు అయినా భవిష్యత్తు మీద ఎంతో నమ్మకం ఉన్న కుటుంబం తమదన్న అభిప్రాయం మనకి కలిగిస్తారు వారు దాదాపు భిక్షాటన చేసుకొనే స్థితిలో ఉన్న ఆ కుటుంబం రెండు తరాలలోపే నెల జీతం తెచ్చుకొనే మధ్య తరగతి స్థాయికి ఎదిగింది బహుశః బాగ్‌పట్‌లో జరగక పోవచ్చేమోకానీ భారతదేశం అంతటా ఇదే జరుగుతూంది. బాగ్‌పట్‌లో జరగక పోవడానికి కారణం అక్కడి గూండాలు ఆ కుటుంబాలని ఎదగకుండా చేస్తున్నారు అలాంటి కుటుంబాలే అధికార పార్టీకి వోట్లు వేశాయంటే ఆశ్చర్యంలేదు

వారు వోట్లు వేస్తున్నది సరైన పార్టీకి కాక పోవచ్చు కాని ఆ తప్పు వారిది మాత్రం కాదు అందరికీ అన్నీ సమకూరుస్తామన్న భ్రమని కల్పించడంలో అధికార పార్టీది అందెవేసిన చెయ్యి అలాగే అది శ్రీపాద్ అమృత్ డాంగే దగ్గర్నించి అబ్దుల్ రెహమాన్ అంతూలే దాకా అన్ని రకాల వ్యక్తులనీ ఆకట్టుకో గలదు తాము చూడాలనుకున్న వాటినన్నీ ఆ పార్టీలో వాళ్ళు చూడగలుగుతున్నారు శ్రీ డాంగే మాత్రం తమ సోవియట్ యజమానులు చెప్పిన దాన్నే ఆ పార్టీలో చూడగలుగుతున్నారను-

# కార్టూనిస్టులకు సూచనలు!

- కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితం మీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.
- ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!
- వ్యాఖ్య చిన్నదిగా, క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.
- ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీ గాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.
- పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సంచిక సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
- రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితం మీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
- మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జత చేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

సం॥

## ...

కుంటాను కానీ అంతూలే సంగతి వేరు పరిపాలన చేసే కుటుంబం కోసం కొన్ని చెయ్యరాని పనులు చేసి ఇప్పుడాయన బయటికి వచ్చి ఉండవచ్చు కానీ పార్టీలోనే ఉన్న ఇంకా కొన్ని వేలమంది దాని నుంచి ఏదో లాభం పొందాలని ఉద్దేశ్యంతో ఉన్నారు కానీ తాము దానికి ఏదో చెయ్యాలన్న మంచి భావంతో మాత్రం కాదు స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచీ కాంగ్రెసు సంస్కృతి ఇలాగే ఉంది ఎక్కువ కాలం ఆ పార్టీ అధికారంలో ఉండటం వల్ల అది తన మిత్రులకి సహాయ పడ గలుగుతున్నది

రాజీవ్‌గాంధీ కానీ, మరొకరుగానీ ఈ పోకడని మార్చ గలరన్న నమ్మకం నాకులేదు ఆయన చాలా హడావుడి మనిషిలా కనిపిస్తారు అలాంటి భావాన్నే ఆయన తాతగారు కూడా ప్రధాన మంత్రి కాక ముందు కూడా ప్రదర్శించేవారు ఈయన సాంకేతిక నిపుణుల్ని, మేనేజర్లని ఒక బృందంగా తయారు చేశాడు అందులో పెయింట్లు, బూట్ పాలిష్‌లు అమ్మే మానేజర్లు కూడా ఉన్నారు అయితే ఎవరైనా చూడాల్సింది ఏమిటంటే జాన్‌సన్ అండ్ నికోల్ సన్‌కి ఏది మంచిదో అదే భారత దేశానికి కూడా మంచిదా అన్న విషయాన్ని ఈ శాఖని మరో మంత్రిత్వ శాఖకీ, ఆ శాఖని మరో దానికీ కలిపి కొత్త శాఖలని కొన్ని సృష్టించవచ్చు కానీ ఇలాంటివి పై మెరుగుల్లా ఆకర్షించి కొంత కాలంపాటు పత్రికలలో పతాక శీర్షికలు రాసే వారికి పని కల్పించవచ్చు కానీ దేశం సక్రమమైన పద్ధతిలో ముందుకి సాగటానికి ఇంతకు మించిన కృషి కావాలి అత్యంత కీలకమైన నిర్ణయాలు తీసుకోవాలి బొగ్గుని ఉక్కు మంత్రిత్వ శాఖకి జత చేయాలా లేక ఇంధన శాఖకి కలపాలా లేదా గ్రామీణాభివృద్ధిని వ్యవసాయానికి తోడుగా ఉంచాలా లేక ప్రణాళికా శాఖకి కలపాలా అన్నది ముఖ్యం కాదు ప్రస్తుతం కేంద్రంలో ఏ కొద్ది మంది చేతుల్లోనో కేంద్రీకృతమై ఉన్న రాజకీయ అధికార వ్యవస్థలో క్రమబద్ధమైన రీతిలో సమూలంగా సరైన మార్పు తీసుకురావాలి ఈ దేశాన్ని ఎవరు పరిపాలిస్తారు? ఎవరో కొంతమంది రాజకీయ నాయకులా లేక కేంద్రంలో ఉన్న వారి బాబుగార్లా? లేదా అధికారాన్ని జిల్లా, తాలూకా స్థాయిదాకా వికేంద్రీకరణ చెయ్యడం ద్వారా పరిపాలనని నిర్వహించడమా అన్నది అసలైన ప్రశ్న శాసన సభ ఎన్నికల విషయంలో కూడా ఇదే వర్తిస్తుంది ఎన్నికలు ఏవైనా అవి అధికారం కోసమే కానీ రాజకీయ పార్టీలు మాత్రం అధికారం అన్నది తమకి అంత ముఖ్యమైన విషయం కాదన్నట్లుగా, తమ మనసులో దానికి, చాలా తక్కువ ప్రాధాన్యత ఉందన్న భావాన్ని ప్రదర్శిస్తూ ఉంటాయి □



గాయం ఎంత చిన్నదైనా దానిపైన మట్టి పడచ్చు
దాంతో ఆ గాయంపైన సూక్ష్మజీవులు చేరచ్చు, బాధ ఎక్కువ కావచ్చు.

# వెంటనే బ్యాండ్-ఎయిడ్ వెయ్యండి

ప్రపంచమంతటా, తల్లులకు బ్యాండ్-ఎయిడ్ పట్టీలపైన పూర్తిగా నమ్మకం. మరి బ్యాండ్-ఎయిడ్ పట్టీ వెయ్యడం వలన గాయాలపై యిక మట్టి పడదు, సూక్ష్మజీవులు చేరవు. బాధ ఎక్కువవడం జరగదు

అదెందుకంటే, బ్యాండ్-ఎయిడ్ అంటేనే పూర్తి రక్షణ అన్నమాట. బ్యాండ్-ఎయిడ్‌లో, పూర్తిగా నమ్మదగ్గ ఏంటీసెప్టిక్ పదార్థం ఉంది—అది గాట్లూ, పగుళ్ళు గల గాయాలను నయం చేయడానికి తోడ్పడుతుంది—చిన్న చిన్న రంధ్రాలలోకి గాలి వెడుతుంది, యిక దాంతో గాయం ఎంతో త్వరగా నయం కావడానికి అది సహాయపడుతుంది. మరి అద్వితీయమైన, అంటుకోని ప్యాడ్‌తో మీకు మరింత ఉపశమనం కలుగుతుంది.

బ్యాండ్-ఎయిడ్ పట్టీలు వేర్వేరు ఆకారాల్లో, సైజుల్లో వస్తాయి—పెద్ద గాయాలకీ, చిన్న గాయాలకీ లేదా గాట్లూ పగుళ్ళకోసమూ, అంటే పట్టీ వేయడానికి వీలుకాని చోట్ల వేయడానికీను. బ్యాండ్-ఎయిడ్ ఎప్పుడూ యింట్లోనూ, మీ దగ్గరా ఉంచుకోండి—ఎప్పుడూ




**బ్యాండ్-ఎయిడ్ ఎప్పుడూ మీ దగ్గర ఉంచుకోండి మరి—**
**దెబ్బ అనేది ఎక్కడైనా, ఎక్కడైనా తగలచ్చుగదా మరి.**

Johnson & Johnson

సీరియల్

# రాగసంధ్య

కాశీనాథుని సువర్చలా దేవి

(గత సంచిక తరువాయి)

మధు వెళ్ళి వారం రోజులయింది వెళ్ళిన మూడో రోజున ఉత్తరం వచ్చింది, కులాసాగా ఉన్నట్టు హోటల్ భోజనం బాగానే ఉందని వ్రాశాడు బాగానే ఎందుకుండదు? మధులాంటి వాళ్ళకి అన్నీ బాగానే ఉంటాయి ఉన్నదాంట్లోనుంచి సుఖాన్ని పిండుకోగలరు ఆ రోజు ఆదివారం 'సీతా కల్యాణం' మార్నింగ్ షోకి సుందరమ్మని తీసుకుని గీత వెళ్ళింది సంధ్య వంటిల్లు సర్ది ముందు గదిలోకి వచ్చింది గోడవారగా కట్టిన తాడుమీద చీరలు అడ్డదిడ్డంగా వేళ్ళాడుతున్నయి గోడకి కొట్టిన కొంకికి సుందరమ్మ పట్టుబట్ట మడతలు జారి జీరాడుతున్నది సగం మూసిన పెట్టె మూతలోంచి బట్టలు బయటకు వెళ్ళుకొస్తున్నయి పొద్దున కాఫీ తాగిన గ్లాసులు నేలమీద దొర్లుతున్నయి కింద ఒలికిన కాఫీకి ఈగలు బొంయిమని ముసురుతున్నయి ఒక పక్క ఉల్లిపాయలపొట్టు, ఇంకోపక్క కూరగాయలు తరిగిన కత్తిపీట, మురికి దుప్పట్లు, జిడ్డు పట్టిన దిండ్లు – నాలుగు వైపుల పరికించి చూచిన సంధ్యకు మతిపోయింది ఇద్దరి కిద్దరే'ఇల్లు సర్దుకోవాలన్న ధ్యాస ఎవరికీలేదు ఆవిడకు పురాణ పఠనం ఈవిడొక చదువుల సరస్వతి సంధ్యకు ఎక్కడలేని చిరాకు ముంచుకొచ్చింది ఆదివారమైనా ఇంటి పట్టున ఉండి నాలుగూ సర్దుకుంటే బాగుంటుంది తనకష్టం ఆలోచించే వాళ్ళేలేరు బద్ధకంగా ఉన్నా తప్పదు గ్లాసులు తీసికెళ్ళి దొడ్లో పడేసింది దుప్పట్లు తీసి ప్యాకెట్‌లో అడుగున మిగిలిన సర్ఫ్‌పొడి వేడి నీళ్ళల్లో కలిపి దుప్పట్లు, గలీబులు నాన బెట్టింది తాడు బిగించి కట్టి ఉతికిన చీరలన్నీ మడతలుపెట్టి వరసగా వేసింది బాగా నలిగి మాసిపోయినవి తీసి మాసిన బట్టల పెట్టెలో వేసి వచ్చింది విసుగ్గా పెట్టె ముందు కూర్చుని బట్టలన్నీ ఇవతలకు తీసింది అన్నీ మడతలు లేనివే నలిగి వాసన కొడుతున్నయి ఇదికాదు పనని పెట్టె ఎత్తి బోర్లించింది అడుగున వేసిన కాగితం సగం ఊడి అందులోనుంచి పదిరూపాయల కాగితాలు వరసగా కిందపడినయి ఆరుపదులు అరవై రూపాయలు ఎక్కడివబ్బా, తనకు తెలియకుండా ఈ ఇంట్లో అరవై రూపాయలు ఉండటం ఆశ్చర్యం అది కూడా అన్నీ పదిరూపాయల నోట్లే అవి తీసి పర్సులో పెట్టింది పెట్టెంతా సర్ది దుప్పట్లు ఉతికి ఆరవేసింది వేడినీళ్ళుపోసి ఇల్లంతా శుభ్రంగా కడిగి తెమిలేసరికల్లా సుందరమ్మ, గీత సినిమానుంచి వచ్చారు

'ఇల్లంతా నువ్వే శుభ్రం చేశావా! సాయంత్రం సర్దుదామని అను-

> **జరిగిన కథ – 2 :** సంధ్య మధుతో జీవితం పంచుకోడానికి ఆమోదించింది మధు, రమణి – శ్రీనివాసరావుగారి మొదటి భార్య సంతానం రెండో భార్య సీతాలక్ష్మి మధు స్నేహితుడు శ్రీకాంత్ అంటె సంధ్యకు తగని చిరాకు, అసహ్యం సంధ్య పిన్ని కూతురు గీత గీతను శ్రీకాంత్ కిచ్చి పెళ్ళి చేస్తే బాగుంటుందని పిన్ని సుందరమ్మ ఆలోచన మూర్తికి పెళ్ళి అయిందని తెలుసుకొన్న గీత బాధపడుతుంది మధుకి నాగపూర్‌లో ఉద్యోగం వచ్చింది

కుంటున్నాను' దొడ్లో ఆరిన దుప్పట్లు లోపలకు తెస్తూ అంది గీత

'సంధ్య మాట్లాడలేదు సుందరమ్మ తన మామూలు ధోరణిలో సినిమా విశేషాలన్నీ ఏకరువు పెట్టసాగింది సీతా, రాముల ఆదర్శ దాంపత్యం ఏమిటేమిటో – నటీ నటుల సామర్థ్యం, దర్శకుడి నేర్పు–ఆవిడకు తెలియని విషయాలు -లేవు అందులో పౌరాణికమేమో! ఆ వరసన నాలుగు రోజులు చెప్పగలదు–వినేవాళ్ళుండాలే గాని–సాయంత్రమైంది రాత్రయింది భోజనాలయినా సుందరమ్మ వాగుతూనే ఉంది

'ఈమె నోరు మూసుకోదు' మనసులోనే విసుక్కుంది సంధ్య తరువాత తన విసుగుకి తనే ఆశ్చర్యపోయింది ఎందుకో తనకీమధ్య విసుగెక్కువయి-పోతున్నది అర్థంలేని కసి! సంధ్య కోపం, విసుగు చూచిన గీతకి భయంతో నోట మాట రాలేదు సుందరమ్మ కూడా కొంత సేపటికి తన వాగ్ధోరణి కట్టిపెట్టి నిద్ర కుపక్రమించింది పడుకోబోతున్నదల్లా లేచి–

'ఒసేవ్, సంధ్యా! రేపు నా కొక పది కావాలే! పక్కింటి గోపమ్మకి కిందటి నెలలో తీసుకున్న నాలుగు రూపాయ లివ్వాలి భాగవత సప్తాహానికి ఐదన్నా కావాలి రూపాయి నాపై ఖర్చు' సుందరమ్మ తన పనయిపోయినట్టు పడుకోబోయింది

'మీకు నేనివ్వాలా! ఈ ఇంట్లో నాకు తెలియకుండా అందరూ వేనకేసు-కుంటూనే ఉన్నారు–' విసురుగా అంది సంధ్య

'ఓసి, నీ కడుపుడకా! నీకు తెలియకుండా డబ్బులు వేనకేసుకుంటున్నామా! నీకు మతుందా! అవునులే! అంటావంటావు, అనవూ నీ దయా ధర్మంమీద బతుకుతున్నామాయె–ఇంత బతుకూ బతికి ' సుందరమ్మ దీర్ఘాలు మొదలు పెట్టింది

సంధ్యకు నిజంగానే మతిపోయినట్టయింది విసురుగా లేచి బ్యాగ్ తెరిచి ఆరు పది రూపాయల కాగితాలు విసిరి నేలకేసి కొట్టింది

'ఏన్నీ, నేను అబద్ధం చెప్పానంటావా! గీత పెట్టె అడుగున దొరికినయి ఇల్లు సర్దుతుంటే బయట పడినయి దీనికేమంటావు!'

తారస్థాయిలో అంటున్న సంధ్యను నిలువు గ్రుడ్లేసుకొని చూసింది సుందరమ్మ తరువాత కిందపడ్డ డబ్బుని, గీతను మార్చి మార్చి చూసింది సుందరమ్మ కళ్ళలో కంపరం లాంటిది కలిగింది సుందరమ్మ స్వభావసిద్ధంగా గయ్యాళి కావచ్చు కాని దొంగ బుద్ధి లేనిది తన కడుపున పుట్టిన కూతురు ఈరోజు నేరస్తురాలిగా నిలబడింది తనేం చెయ్యాలి! గీతకీ డబ్బెక్కడిది సుందరమ్మ మనసులో రక రకాల ఆలోచనలు తెరలు తెరలుగా రాసాగినయి గీత చర్రున లేచి బాంక్ పాస్ బుక్ తెచ్చి పడేసింది

'చూసుకోండి–మూడు నెలలుగా నేను బాంక్‌లో డబ్బు కట్టటం లేదు–' అప్రయత్నంగానే దుఃఖం వెల్లువలా పొంగింది రెండు చేతులూ ముఖాన పెట్టుకొని వెక్కి వెక్కి ఏడవ సాగింది సుందరమ్మ, సంధ్య దిమ్మెరపోయి చూడసాగారు

'దినికింత గొడవెందుకు? నాకేం తెలుసు నువ్వు డబ్బు కట్టలేదని ప్రతినెలా నాలుగో తారీఖునే పరుగులు పెట్టేదానివి – అయినా ఇంత ఏడుపెందుకు' కొంత నిష్ఠూరం, కొంత కోపం, కొంత అసహనం నిండిన గొంతుతో అంది సంధ్య

సుందరమ్మకి స్తంభించిన ప్రకృతికి చైతన్యం వచ్చినట్టు ఒక్కసారిగా తెరిపిగా హాయిగా అనిపించింది

'అదికాదే, ఈమాత్రానికి ఏడుస్తావెందుకు? అయినా, ఒకరి మీద ఆధార-పడినప్పుడు ఎవరు ఏమన్నా పడాలి తల్లీ – కాలం – కాల మహిమ్మ – ఇదివరకు ఎరుగుదుమా! ఈ అపవాదులు, ఇంకా ముందేం రాసి పెట్టాడో ఆ మాయదారి దేవుడు, సందరమ్మ విరుపుకి సంధ్య మనసు చివుక్కుమంది తనకీమధ్య విసుగు ఎక్కువైన మాట వాస్తవమే! తన స్థితిలో ఎవరున్నా ఇంతకన్నా ఏం ఊహించగలరు అందులోనూ అస్తవ్యస్తంగా ఉన్న తన

మనసు ఏ విషయాన్నీ సరిగా అర్థం చేసుకోలేక పోతున్నది అదెవరర్థం చేసుకుంటారు! అసలు తన బాధేమిటో తనకే సరిగా బోధపడటం లేదు వశం తప్పిపోతున్న మనసుని స్వాధీనంలోకి తెచ్చుకుంటూ అంది సంధ్య

'పిన్నీ, పొరపాటయిపోయింది మరీ అంత నిష్ఠూరంగా మాట్లాడకు నాకు మనసు బాగాలేదు – గీతా! ఏమనుకోకు, ప్లీజ్ – నువ్వన్నా అర్థం చేసుకో' గొంతునిండా జాలినింపుకొని అంటున్న సంధ్యను చూచి మారు మాట్లాడకుండా పడుకుంది గీత సుందరమ్మకూడా ఏమీ మాట్లాడలేక పోయింది ఆ రాత్రంతా గీత కలల్లో మూర్తి, సంధ్య కలల్లో మధు, శ్రీకాంత్ రకరకాలుగా కనుపించారు. మర్నాడు తొమ్మిదిన్నర ప్రాంతంలో ఆఫీసుకి బయలు దేరబోతున్న సంధ్యకు శ్రీకాంత్ ఎదురు వచ్చాడు. సంధ్య తిరస్కారంగా చూస్తూ అతని ముందునుంచే బయటకు వెళ్ళిపోయింది సుందరమ్మ స్వాగత వచనాలు వెనకనుంచి వినిపిస్తుంటే సంధ్యకు ఒళ్ళంతా కారం రాచుకున్నట్టుగా అయింది.

★ ★ ★ ★ ★ ★

అరవై రూపాయలకు తోడు ఇంకో పది – ఫైను మొత్తం తీసుకుని సంధ్య బలవంతంమీద బయలుదేరింది గీత ఇంటి ఆవరణ దాటినప్పటి-నుంచి కౌంటరు దగ్గరకు వచ్చేవరకు గీత మనసు మనసులో లేదు ఒళ్ళంతా ఆవిర్లు తేలుతున్నట్టు – ఏమిటోగా ఉంది తీరా కౌంటరు దగ్గర కొచ్చిం తర్వాత మూర్తి స్థానంలో ఎవరో కొత్త వ్యక్తి ఉన్నాడు యాంత్రికంగా డబ్బుకట్టింది రసీదు తీసుకుంది మూర్తి ఏమయినట్టు? ఎవరినైనా అడుగుదా-మంటే జంకు ఏం గొడవవుతుందో నాలుగు వైపులా పరికించి చూసింది అందరూ ఎవరి పనుల్లో వాళ్ళున్నారు మూర్తి పక్క సీట్లో అతను వెంకట్రావు అడుగుదామనుకుంది, కాని అడగలేకపోయింది నెమ్మదిగా బయటకు వస్తుండగా ఎదురుగా హడావుడిగా వస్తున్న మూర్తి కనిపించాడు గీత ముఖంలో అప్రయత్నంగా వెలుగు వచ్చింది తనకు తెలియకుండానే పెదవుల మీద చిరునవ్వు వచ్చింది ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్న వసంతం ఒక్క-సారిగా గుబాళించినట్లయింది మనసు పరవళ్ళు తొక్కింది తన ఈ స్థితిని తెలుసుకున్న గీత ఎంతో నిగ్రహంగా ముందుకు వెళ్ళబోయింది

'హలో, బాగున్నారా!' మూర్తే పలకరించాడు

గీత తలెత్తి చూసింది

'డబ్బు కట్టటానికి వచ్చారా!'

తలూపింది గీత

'ఒక్క నిముషం ఆగుతారా! ఇప్పుడే వస్తాను గీత సమాధానం కోసం చూడకుండా లోపలికి వెళ్ళాడు మూర్తి

దాదాపు పది నిముషాల తర్వాత పదండి అంటూ వచ్చాడు మూర్తి వెనకాలే బయటకు నడిచింది గీత

'కాస్త కాఫీ తాగుదాం, అభ్యంతరమా!' మూర్తి అభ్యర్థన కాదనలేక-పోయింది గీత ఇద్దరూ హోటల్‌లో కెళ్ళి ఒక వారగా కూర్చున్నారు మూర్తి రెండు దోసెలకు ఆర్డరిచ్చాడు గీత వద్దనలేదు దాదాపు మౌనంగానే టిఫెను, కాఫీ ముగించారు మూర్తి కొంతసేపు గీత వైపు చూచి చెప్పసాగాడు గీతకి వెళ్ళిపోతే బాగుండుననిపించింది, ఎవరైనా చూస్తారేమోనని

'మీ దగ్గర నుంచి ఆ రోజు ఇంటి కెళ్ళేసరికి బాగా రాత్రయింది ఇల్లంతా గోలగా ఉంది అమ్మ ఏడుస్తున్నది ఆవిడ బుగ్గలనుంచి రక్తం-కారుతున్నది అన్నట్టు, మీకు తెలియదు కదూ! మా ఆవిడ '

క్షణం ఆగాడు మూర్తి

'మా ఆవిడ పేరు రాధ చాలా అందమైనది కాని, కాని ఆవిడకు మనసు స్థిరంగా ఉండదు పెళ్ళికి ముందు' తెలియదు మా అమ్మకు దూరంనుంచి చూపించారు ఒంటినిండా నగలతో మెరిసిపోతున్న అందంతో ఉన్న పెళ్ళికూతుర్ని చూసి మురిసిపోయింది. పిల్లను చూడవలసిన అవసరం లేకుండానే చాలా తక్కువ వ్యవధానంలో ముహూర్తం పెట్టారు. పెళ్ళిరోజు అనారోగ్యంగా ఉందన్నారు. దాదాపు మైకంలో ఉన్న రాధను నలుగురు ముత్తయిదువుల సహాయంతో చాలా కొద్దిమంది సమక్షంలో రాధను నా భార్యగా స్వీకరించాను. అప్పగింతలు లేవు. మూడు నిద్రలు లేవు. అనారోగ్య కారణంగా వాళ్ళే వేడుకలు చెయ్యలేక పోయామన్నారు. వాళ్ళిచ్చిన ఇరవైవేలు తీసుకొని మేం వచ్చేశాం. రాధను కాపరానికి తీసుకురావాలని తహ తహలాడ సాగింది మనసు. ఎలాగైతేనేం నాలుగు నెలల తర్వాత వాళ్ళ నాన్న వచ్చి దించి వెళ్ళాడు. వెళ్ళేముందు ఎన్నో చెప్పాడు. రాధ ఆరోగ్యం మంచిదికాదని, జాగ్రత్తగా చూసుకోమని చెప్పాడు. పొద్దున పదకొండు గంటలకు పడుకున్న రాధ సాయంత్రం వరకూ లేవలేదు. కొత్తకోడలు. అమ్మ ఊరుకుంది. మీకు విసుగ్గా ఉందా!'

మూర్తి అనుమానంగా అడిగాడు.

'లేదు, చెప్పండి –' మూర్తిని కూడా లేవమన్నట్టు తనూ లేచింది. ఇద్దరూ నడక సాగించారు. కాసేపు ఎటైనా వెళ్దామని, తన మనసులో ఆవేదన చెప్పుకోవాలనీ కోరాడు మూర్తి. గీత అతన్ని అనుసరించింది. ఇద్దరూ ఒక గార్డెన్‌లో ఒక పక్కగా కూర్చున్నారు. చెప్పండి అన్నట్టు చూసింది గీత.

'సాయంత్రం ఆరుగంటలు కావస్తున్నది. నాకు బాగా గుర్తు. ఆ సాయంత్రం ఎంతో హాయిగా ఉంది వాతావరణం. వరండాలో పడక కుర్చీలో పడుకుని ఆలోచిస్తున్నాను. రాధ తనతో తెచ్చిన లడ్లు, అరిసెలు, జంతికలు డబ్బాలలో [illegible]



## మండలాలు

ఉద్యోగాల కోసం
తపస్సు చేసే
నిరుద్యోగులకు
సర్వ సంగ పరిత్యాగి
ఇచ్చిన కమండలాలు!

—టి. పి. రామానుజ

# రాగసంధ్య

ముందే నిద్రపోతున్న రాధను రెండుసార్లు చూశాను మనోహరమైన ఆ రూపం నన్ను పరవశింపజేసింది మళ్ళీ చూడాలని ఓరగా గదిలోకి తొంగి చూచాను, మూర్తి చటుక్కున లేచి ముందున్న చెట్టు పట్టుకొని నిలబడ్డాడు గీత తలెత్తి మూర్తి వంక చూసింది అతనెంతకీ వెనక్కు తిరగలేదు దీక్షగా శూన్యంలోకి చూడసాగాడు నెమ్మదిగా పక్కనే నిల్చుని అతని చేతిమీద చెయ్యివేసింది గీత కళ్లల్లోకి చూశాడు మూర్తి అతని కళ్ళు ఎర్రగా ఉన్నయి

'గీతా! నేను చూసిన ఆ దృశ్యం – భయంకరమైంది ఆమె ఏం చేస్తున్నదో తెలుసా! జుట్టు విరబోసుకొని పమిట కొంగంతా చించుకుంటున్నది ఆమె – నాభార్య – పిచ్చిది – నా భార్య పిచ్చిది –' అతను అసహనంగా నుదురు చెట్టుమానుకి రుద్దుకోసాడు

'అంతే – ఎన్నో ఊహించుకున్న నా మొదటి రాత్రి ఆ విధంగా ముక్కలైంది ఎంతో ఆవేశంతో అప్పటికప్పుడు మా మామగారి దగ్గరకు పరుగులు పెట్టాను చాలా తాపీగా మధ్యవర్తితో మేము అన్ని విషయాలూ చెప్పామన్నాడు అయినా ఆవిడ పిచ్చి సంసారానికి అడ్డురాదుట నిద్ర మాత్రలు వాడితే పడుకుటుందిట నిద్రపోయే పెళ్ళాన్నా నేను కోరుకున్నది నిస్సహాయంగా, చేతకాని వాడిలా యింటికొచ్చాను ఆ పిచ్చిదానికి భగవంతుడు పిచ్చి అందాన్నిచ్చాడు ఆ అందానికి మైమరచి సంసారం చేసే పిచ్చి నాకు లేదు సంసారం పిచ్చి ఆవిడ కెలాగూ లేదు

నాకు చేతనైనంతవరకు వైద్యం చేయిస్తున్నాను ఈ మధ్య మరీ ఎక్కువైంది అమ్మ నరకం అనుభవిస్తున్నది ఆ రోజునుంచీ మొత్తం మూడు నెలలు సెలవపెట్టాను ఇదీ నా కథ – ఇది నీకు చెప్పాలనీ, నా ఆవేదనను చల్లార్చుకోవాలనీ ఎంతో ఆరాటంగా ఉండేది గీతా! నావల్ల ఏదైనా పొరపాటు జరిగితే అన్యధా భావించవద్దు –' మూర్తి గొంతు బాధగా ధ్వనించింది.

గీతకి ఏం మాట్లాడాలో, మూర్తి నెట్లా అనునయించాలో తెలియలేదు ఇద్దరూ దాదాపు మౌనంగానే ఉన్నారు గీత మనసంతా చేదుగా వుంది అంతకు ముందే మూర్తి రూపం మనసులో ముద్ర వేసుకుంది మూర్తి కథ విన్న గీతకు శరీరంలో రక్తమంతా మంచుతో తడిపినట్లయింది అంధకారంలో పరుగులు బెడుతున్నట్లనిపించింది దిగులుగా నీరసంగా ఏదోలా అయిపోయింది మనసు శరీరం కూడా మనసునే అనుసరించింది

'చాలా పొద్దుపోయింది పోదాం పదండి – మీ వాళ్ళు గాభరా పడతారేమో!' మూర్తి బయలుదేరాడు గీత కదలలేదు

'మీరీ విషయాలన్నీ మర్చిపోండి – నాకా నరకంలో ఎలాగూ తప్పదు నా భారాన్ని దించుకోవటానికి మిమ్మల్ని బాధపెట్టాను ప్లీజ్, మీరీ విషయాలన్నీ మర్చిపోవాలి!'

మళ్ళీ హెచ్చరించటంతో మూర్తితో బయలుదేరింది గీత

**(ఇంకా ఉంది)**

చురుకులతో చురకలు వేస్తున్నట్లు ఎవరోతన ప్రతీ అవయవాన్ని తూకంవేసి కొలతలు తీస్తున్నట్లు తట్టుకోలేని అనుభూతి చెప్పుకోలేని అవమాన భావన

ఏదో బాధ ఆమె గుండెలో సుడి తిరిగింది ఇంట్లో మగాడు

అసలేతక్కువ జీతగాడు పైగా జూదగాడు

బిడ్డకి తెగులు పట్టుకుందని కబురంపితే దిగులు పడలేదు సరికదా పట్నం తీసుకు పొమ్మని తన ఖర్మకి తననే బలికమ్మని శపించకుండా ఉంటే? ఏమైతే అదే అవనీ అని ఇంటిపట్టునే ఉంటే? ఆ రౌడీ చూడక ముందే వెళ్ళి ఉంటే?

ఏదీ తను అనుకున్నట్టు జరగని నిర్భాగ్య జీవితం తనది సంసారాన్ని ఈదలేని గంపెడు పిల్లలు తండ్రి ఇంట పుట్టడం ఒకతప్పు పెళ్ళయితే చాలని స్కూలులో పనిచేసే ప్యూన్ని, వ్యసనపరుణ్ణి కట్టుకోవడం మరొక తప్పు

మురిగ్గుంటలోంచి వచ్చి బురద గుంటలోకి దొర్లినట్టయింది

బస్టాండుకి చేరుకుంది

అప్పుడే బస్సు వచ్చి ఆగింది

వెంటనే ఎక్కి ఓ మూల సీటులోకి పోయి ఒదిగి కూర్చుంది

ఓ పావుగంట గడిచేటప్పటికి జనంతో నిండిపోయింది ఆమె ప్రక్కన సీటు ఖాళీగా వున్నా ఎవరూ కూర్చోలేదు

తన వెనుకసీటులోకి వచ్చి కూర్చున్న చెంచు సుబ్బయ్య మాష్టార్ని తనే పలకరించింది ఆయన కుశల ప్రశ్నలువేసి తన ధోరణిలో పడిపోయారు

ఒళ్ళో వున్న పసికందుని జోకొడుతోంది కిటికీలోంచి ఎటో చూస్తుండి పోయింది

తన ప్రక్కన ఎవరో కూర్చున్నారు ఆమె పట్టించుకోలేదు మరి కాస్సేపటికే మరో బస్సు చెడిపోయిందని బిలబిలలాడుతూ ఈ బస్సులోకి ఎక్కేశారు, జనం

వూపిరి పీల్చుకునే ఎడం లేదు

సీత కడుపులో ఏదో ఆరాటం అంతవరకు ఏమి తినకపోవడంచేత విపరీతమైన ఆకలి ఆ బాబుని ఎత్తుకునే ఉండడంచేత ఒళ్ళు నలిగినంత సలుపులు భరించరాని తలపులు

'టిక్కెట్ టిక్కెట్' కండక్టరు జనాన్ని నెట్టుకుంటూ, కసురుకుంటూ అరుస్తుంటే రొంటినున్న డబ్బు తియ్యబోయింది

'వద్దు నేను తీస్తాలే' అన్న మాటలు విని తలతిప్పి చూసింది రాజారాం అదిరిపడింది లేచి మరో చోటికి పోదామనుకొంది ఎక్కడా కదిలే సందు లేదు




లేచే ఓపికగాని, పోయే శక్తిగాని తనకి లేవు.

మూడు రూపాయల టిక్కెట్టు కొనగానే ఆమె మీద ముడుపు చెల్లించి సొంతం చేసుకొన్నట్టు, ఆమె మరల మాటాడక పోవడంచేత తనంటే ఇష్టపడి-నట్టు సంబరపడుతున్నాడు రాజారాం

కుదుపుతో బస్సు కదిలింది

రాజారాం ఆమెకి దగ్గరగా జరిగాడు

అతని మో చెయ్యి ఆమె కడుపు మీది ముడతల్లో గిలిగింతలు పెడుతోంది

అతని బుజం ఆమె బుజాన్ని సుతారంగా రాచు-కొంటోంది అతని చెయ్యి ఆమె ఒడిని తడుము-తోంది అతని తల ఆమె బుజంపై వాలుతోంది

'సీతా, బాబునియ్యి నే ఎత్తుకుంటా' మొగుడిలా చెవిలో గుస గుసలా అంటున్నాడు

ఆమె కళ్ళు మండుతున్న దివిటీల్లా అతని వైపు తిరిగాయి

తనని కానట్టు ఎటో చూస్తున్నాడు

లైట్లు ఆరిపోయాయి

బస్సు వేగం అందుకొంది

రాజారాం ఏదో విధంగా ఆమెని తాకుతూనే వున్నాడు ఏవేవో వూసులు చెబుతూనే వున్నాడు

సీత కిటికీలోంచి వెలుపలికి చూస్తోంది సాధ్య-మైనంత మేర అటువైపుకి తిరిగి కూర్చుంది ఆమె నోట్లో నలిగే పైటకొంగు ఆమె ఆపుకొంటున్న దుఃఖానికి సాక్ష్యంగా వుంది

ఎదుటి సీట్లో జరుగుతున్నదంతా చీకటి కలవాటు పడ్డ చెంచు సుబ్బయ్యగారి కంటబడుతోంది వాడి దౌర్జన్యాన్ని ఆసహ్యించుకుంటున్నారు అసహనంగా ఆవేశంగా భావించుకుంటున్నారు కానీ

మనస్సు వాడు మునసబు తమ్ముడు మోతుబరి తలుచుకుంటే వూరినుంచి తన్ని తరిమేయగలడు నీకు సంసారమే ఓ భారం సొంత కొంప వున్న వూరు అవి వొదులుకొని దూరం పోలేవు నోరు మూసుకు కూర్చో' అని గదిమింది



ఏమీ చేయ్యలేని నిస్సహాయత, అసమర్థత

అయినా ఆ సీత మాత్రం అలావూరుకుంటుందేం దానికి వాడంటే ఇష్టమేమో? ఇంకొకరైతే చెప్పు-తీసుకొట్టరూ? వాళ్ళేలా చస్తే నాకేం! నంగ-నాచిలా మొహం ఇదీని గ్రంథసాంగురాలే. ఈ రోజుల్లో ఎవర్నీ నమ్మకూడదుస్మీ, ఇంకా నయం కలగజేసుకున్నాను గాదు తన మనస్సుని సమాధాన-పరచుకున్నారు

బస్సు ఆగుతోంది

జనం దిగుతున్నారు మళ్ళీ అంతకంటె రెట్టింపు మంది ఎక్కుతున్నారు

లైట్లు వెలిగినప్పుడు జరిగే రాజారాం ఆరిపోగానే ఆమె మీదికి వాలిపోతున్నాడు

మధురోహల్లో తేలిపోతున్నాడు

ఆనందపు లోయల్లోకి తూలిపోతున్నాడు

బస్సు దిగగానే సీతని మామిడి తోపులో అనుభ-వించి గాని వదలకూడదు అనే నిశ్చయం అతని గుండెల్లోంచి ఉరుకుతోంది

తను పడుతున్న దురవస్థ పగవాళ్ళకి గూడ కలగకూడదనుకునే సీత కళ్ళల్లోంచి నీరు ఉబుకు-తోంది.

రాజారాం వూపిరి ఆమె మెడని కాలుస్తోంది సీత గుండె వేదనతో దట్టించిన తుపాకి గుండై ఆమెని పేలుస్తోంది.

అతని మగతనం, అహంభావం అతన్ని వూహా లోకంలో తేలుస్తోంది ఆమె నిస్సహాయత నీరై బిందువుల్ని కళ్ళల్లోంచి రాలుస్తోంది

భారంగా గడిచిన ముప్పావుగంటా మూడు యుగాల్లా అనిపించాయి.

దిగాల్సిన వూరొచ్చింది

మామిడి తోపులో ఎదురు చూస్తుంటా రావాలి సుమా ఎలా తప్పించుకుంటావో చూస్తా ' చెవుల్లో వూదేసి దిగిపోయాడు రాజారావు

సీటులోంచి లేస్తూనే గట్టిగా ఏడ్చేస్తోంది సీత బాబుని బుజాని కెత్తుకుని ఎలాగో కిందికి దిగింది

నిస్సత్తువగా నేలమీదే కూలబడిపోయి పసివాణ్ని కాళ్ల మీదకి పడుకోబెట్టుకుంది

దిగేవాళ్లంతా ఏం జరిగిందీ తెలీక ఆమె చుట్టూ మూగుతున్నారు

బస్సులో జనం తొంగి తొంగి చూస్తున్నారు

'అయ్యో దేవుడోయ్ నాబిడ్డ బదులు నన్నే తీసుకు పోబోయావా నాయనోయ్ ' ఏవేవో అంటోంది

ఆశ్చర్యపోయారు మేష్టారు

'ఏమ్మా సీతా బాబు కేవయింది?'

'బస్సు ఎక్కకముందే చచ్చిపోయాడు బాబు అక్కడే ఏడిస్తే బస్సు ఎక్కించుకోరని గుండెని రాయి చేసుకుని నేను చస్తుంటే ఆ ఎదవ ' చెప్పలేక వెక్కి వెక్కి ఏడుస్తోంది

సీత దొంగ ఎత్తు వేస్తోందనుకుని చూడ్డానికి వచ్చాడు రాజారాం

ఆ అమ్మాయిని చాలా దారుణంగాఅంచనా వేశాననే పశ్చాత్తాపంతో వున్న మేష్టారి చెయ్యి రాజారాం చెంపని చెళ్ళున పేల్చింది

మరో దెబ్బకి దొరక్కుండా తప్పించుకు పోయాడు

పసివాడి శవాన్ని మేష్టారు బుజాని కెత్తుకున్నారు సీత చెయ్యి పట్టుకొని ఎవరో నడిపిస్తున్నారు విధి తీలకి విస్తుబోతున్న మేష్టారు స్మశాన వైరాగ్యాన్ని బోధిస్తున్నారు

'మేస్టారూ బాబుని మట్టిలో కలిపెయ్యక ముందే మనసారా హత్తుకోనివ్వండి' ఆర్తితో అందుకొంది బిడ్డని.

సీత ధుఃఖానికి సాక్షులయిన బాటసారుల కళ్ళు చెమ్మగిల్లాయి

నల్లమబ్బు నెలవంకని మింగేసింది □

భలే
# బేరం!



ఒక ఆకర్షణీయమైన
ప్లాస్టిక్ డబ్బా
కేవలం రూ.1.75 లకే

3
సబ్బులతో




ACIL/0869/84-Tel



సూపర్ పవర్
# రీగల్
మురికిని నిర్మూలిస్తుంది
బట్టలను కాపాడుతుంది




ఈ సదుపాయం ఆంధ్రప్రదేశ్‌కు మాత్రమే పరిమిత

# వ్యక్తిగతం









సంఘ వ్యతిరేక శక్తులుగా రూపొందిన తీవ్రవాదులను స్విట్సర్లాండ్, ఇటలీలకు చెందిన పోలీసు యంత్రాంగం పటిష్టంగా ఏరివేస్తోంది. బీరుట్ నుంచి రోమ్‌కి సమాచారాన్ని చేరవేస్తున్నారన్న అనుమానం కలిగి ఈ ఏడుగురినీ స్విస్ పోలీసులు అదుపులోకి తీసుకొన్నారు. ఈ ఏడుగురూ లెబనాన్‌కి చెందినవారు. పైగా రోమ్ విశ్వ విద్యాలయంలో చదువుకుంటున్న విద్యార్థులు!

ఈ లెబనీస్ యువకులు ఏమీ చెప్పడం లేదు కానీ వీరికి బీరుట్ రాయబార కార్యాలయంపై వేసిన బాంబు సంఘటనతో సంబంధం వున్నట్లు పోలీసులు అనుమానిస్తున్నారు. బీరుట్‌లో ఉన్నయు. ఎస్. మెరైన్ కాంపౌండులో 241 మంది అమెరికన్‌ల దుర్మరణానికి వీళ్లే కారణమని అనుకొంటున్నారు. హుస్సేన్ హనిహ్ అలాత్ (21) అనే యువకుని వద్ద సూట్‌కేస్ నిండా ప్రేలుడు పదార్థాలు, ప్రమాదకరమైన రసాయనాలు దొరకడంతో పోలీసులు గట్టిగా ఆరా తీస్తున్నారు....



# వారఫలం

## 1-2-1985 శుక్రవారం మొదలు 7-2-1985 గురువారం వరకు

★ **మేషం :** మీరు యింకా కఠినంగా మీ వ్యాపార సంస్థయందు అజమాయిషీ చేయాలి అప్పులు రాబట్టుకో యత్నించాలి రచనా విధానాన ఖ్యాతి లభిస్తుంది కొందరకు సన్మానావకాశ మున్నది స్త్రీలకు సుఖం, ఆనందం, మానశిక శాంతి, స్వల్పంగా ఆదాయం సంభవం

★ **వృషభం :** చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకోవటం ఏమంత ప్రయోజనం? శ్రమలో ఎలాంటి లోపం చేయరాదు శుభ ప్రయోజనాల పరిసమాప్తికి బాగా శ్రమించాలి గృహం కొనుగోలు చేసే యత్నం చేయనున్నారు రచనా విధానంగా ధనలబ్ధి గలదని గ్రహింపగలరు స్త్రీలకు అనుకొన్నట్లు ఉద్యోగమందు అభివృద్ధి కనిపిస్తుంది

★ **మిధునం :** రాజకీయవాదులకు మేలైన సమయం. ఆలోచనతో కార్యక్రమాన్ని నిర్వహించండి శుభవార్తా శ్రవణం, కళారంగాన ప్రఖ్యాతి, బంధువర్గీయుల సహకారం లభ్యం కాగలవారం స్త్రీలకు గృహానందం, వ్యవహారం సామరస్యంగా పరిష్కారం కావటం గ్రహిస్తారు

★ **కర్కాటకం :** అధికారుల ప్రీతికి పాత్రులు కాగలరు వృత్తియందభివృద్ధిని సూచించే వారం గృహ నిర్మాణానికి కొందరు 'నాంది' పలుకుతారు సాహిత్యపరంగా చిక్కిన అవకాశాలను జార విడవకండి స్త్రీలకు కళాత్మక జీవితం ప్రకాశిస్తుంది లేనిపోని మాటలు చెప్పే వారిని, రాజకీయంగా ప్రేరణ చేసేవారిని దాపునకు రానీయకండి గ్రహించి మెలగండి

★ **సింహం :** సంతానం అభివృద్ధి కొరకు మీరు గావించే యత్నాలు మంచి ఫలితాన్ని యివ్వగలవు 'ఇకరాదు' అని ఆశ వదలిన డబ్బు అందటం, అవసరాలు తీరటం మీరే గమనిస్తారు స్త్రీలకు కార్యాసక్తి, రచనా వ్యాసంగమందు అనురక్తి, రాజకీయ వ్యవహార ప్రసక్తికి ఆస్కారం గలవారం

★ **కన్య :** వ్యాపారరీత్యా మీతో పోటిపడే వారుంటారు గమనించండి మీరు సేకరించి పెట్టుకొన్న సరుకులకు గిరాకి హెచ్చుతుంది వృత్తియం దభివృద్ధి, ఉత్సాహ జనకమైన ప్రయాణా లుంటాయి స్త్రీలకు సహజమైన చాకచక్యం, ఉద్యోగ రంగాన రాజకీయాన ప్రదర్శించి ఏదో మేలు పొందనున్నారు కొందరకు విదేశ ప్రయాణం కూడా చెప్పదగిన అంశం

★ **తుల :** పొరుగూరికి ప్రయాణించే అవకాశం, రాజకీయంగా మేలు పొందగల అవకాశం ఏర్పడుతుంది సాటి వారిలో గౌరవం అతిశయిస్తుంది ధనవంతులతోనో, బాగా పేరు ప్రతిష్టలు, అధికారం గలవారితోనో సంబంధం ఏర్పడనున్నది స్త్రీలకు విద్యా, వాహన, ప్రయాణ యోగ్యత సిద్ధించుటకు ఆక్షేపణలేదు

★ **వృశ్చికం :** ఆదాయానికిగాని, కార్యానుకూలతకుగాని లోపంలేని సమయం సాటివారిలో పేరు పెంపొందే అవకాశాలు ఏర్పడుతాయి పోగొట్టుకున్న వస్తువులు సమకూర్చుకొనుటకు యత్నించి, సఫలమవుతారు రాజకీయంగా పైకి రాగల అవకాశాలుంటాయి గ్రహించి, శ్రమించాలి స్త్రీలకు పిత్రార్జితమైన భూమిగాని, గృహంగాని చేజిక్కించుకొనే అవకాశాలుంటాయి, ఉద్యోగం చేసేవారు జాగ్రత్తగా సంచరించాలి

★ **ధనుస్సు :** వ్యర్థంగా కాలం వ్యయిస్తారు అనవసరమైన వ్యవహారాలలో జోక్యం కలుగ జేసుకోవలసివస్తుంది అవసరాలకు తగిన డబ్బు చిక్కకపోదు గాని బాగా శ్రమించాలి వస్తువులో, రికార్డు గాని పోగొట్టు కొంటారేమో! జాగ్రత్త! స్త్రీలకు వ్యర్థ ప్రయాణాలు, 'రోడ్డు' ప్రమాదాలు సంభవం, జాగ్రత్త!

★ **మకరం :** నూతనాంశాలు గ్రహిస్తారు మిత్ర సహాయమో, బంధు సహాయమో చేకూరుతుంది ప్రత్యర్థులను జాగ్రత్తగా గమనించాలి చుట్టు ప్రక్కల వారితో మిక్కిలి జాగ్రత్తగా మెలగాలి అనవసర ఖర్చులకు లోనుకావలసి వస్తుంది, గ్రహించి మెలగండి స్త్రీలకు ఆశించిన విధంగా పనులు సవరించుకో గలుగుతారు

★ **కుంభం :** బుద్ధి సూక్ష్మతతో, సమాజ, రాజకీయ, సాంస్కృతిక వ్యవహారాలయందు ప్రగతి సాధిస్తారు మీ ఆలోచనలు ఫలదాయకం కాగలవు వస్తు సేకరణకు అవకాశమున్నది ఇతరుల చేత జిక్కి మెలిక పడిన ధన విషయం పరిష్కారం కాగలదు స్త్రీలకు 'ప్రమోషన్ లభ్యం కాగల అవకాశాలున్నాయి, శ్రమించండి

★ **మీనం :** వృత్తియందుగాని, ఉద్యోగ వ్యవహారాలందుగాని, రాజకీయ రంగమందుగాని, శుభ కార్య ప్రస్తావన లందుగాని ఎలాంటి ఆటంకములుండవు గ్రహ సంపద అనుకూలం గదా! శ్రమించి యోచించి ముందడుగు పెట్టండి స్త్రీలకు మానశిక శాంతి కొరకై బాగా శ్రమించాలి లేనిపోని వ్యవహారాలు నెత్తిన పెట్టుకోకండి

–విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

ఇప్పుడు లభిస్తున్న

డిలక్స

# నిరోధ్

మరింత నునుపైనది




అయిదింటికి
రూ. 1/-

సున్నిత మనస్కులైన దంపతులకు

★ ఉత్తమ మైన నాణ్యత గలది.

★ ఎలక్ట్రానిక్ సాదనాలతో పరీక్షింపబడినది.

అన్ని పెద్ద పట్టణాలలో
విక్రయింపబడుచున్నది

davp 84/28



(గత సంచిక తరువాయి)

దేవుడ్ని చూసి తిరిగి వస్తూ "విజయ్ మనం ఇక్కడి నుండి నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళి మీ స్నేహితులతో మాట్లాడదాము" అంది అనిత

"వాళ్ళు ఎక్కడికో వెళ్ళారు ఎప్పుడైనా వెళ్ళొచ్చు" కొద్ది మెట్లు దిగి కృష్ణుడి విగ్రహం ముందు కూర్చున్నాడు

"అనితా, ఇక్కడ వాతావరణం బాగుందికదూ!" దూరాన వెళుతున్న జనాన్ని చూస్తూ అన్నాడు

అనిత అదేం పట్టని దానిలా కొంగు చివర నలుపుతూ కూర్చుంది. ఆమెకు తొందరగా డాక్టర్లతో మాట్లాడాలని వుంది

"అనితా,మీతో మన స్నేహం గురించి మాట్లాడా లన్నాను " ఆమెవైపు చూశాడు

"ఔను మరిచే పోయాను " నవ్వింది అనిత

"స్నేహం గురించి మాట్లాడేదేముంది? మనం అనుకోకుండా స్నేహితుల-మయ్యాము "

"ఆ స్నేహాన్ని అందమైన బంధంగా మార్చుకుందాము' అన్నాడు విజయ్

"విజయ్, మీరనేది "

"నేను మిమ్మల్ని పెండ్లి చేసుకోవాలనుకున్నాను "

"విజయ్... " దిమ్మెర పోయింది అనిత

"నా గురించి తెలిసీ మీరిలా

"అడగరానిది అడిగానా?"

"కాదంటారా?"

ఆశ్చర్యంగా చూశాడు విజయ్

"మీరేనా ఆ మాట అంటున్నది మీరు భర్త వున్న అమ్మాయికే పెండ్లి చేశారు."

"అది వేరు.. "

"ఏం, ఆదర్శాలు చెప్పేందుకు తప్ప ఆచరించేందుకు పనికిరావా? మీ మాటలు నమ్మి ధైర్యం చేసిన వాళ్ళు హేళన పాలైతే వినోదంలా చూస్తుంటారే-మో. అనితాదేవీ, అది క్షమించరాని నేరం

"నే నెవ్వరి బ్రతుకును నవ్వుపాలు చెయ్యలేదు "

"మీరు చేశారనడం లేదు మీ వ్రాతలు మాటలు మనుషులను ఆలోచింప చేస్తాయి మీరు చెప్పేది ఎందుకు చెయ్యలేరు?"

"ఎవరి బ్రతుకులు వారి ఇష్టమైన విధంగా నడుపుకోవాలి

**జరిగిన కథ – 3 :** అనితకు ఆ రోజు శుభప్రదమైన రోజు భర్త విజయ్ రాకకై ఎదురు చూస్తున్న అనితకు రమేష్ రాక నిరాశ కలిగించింది "ప్రముఖ రచయిత్రి అనితాదేవి అసలు రూపం అంటూ ఎవరో పేపర్లో వేయిస్తే ఆ పని విజయే చేసి ఉంటాడని అతడని నిలదీసి అడుగుతుంది అనిత విజయ్‌కు తనకు మొదట పరిచయమైన అనిత గుర్తుకు వస్తుంది అనిత ఆహ్వానంపై ఆమె ఇంటికి వెళ్ళిన విజయ్ ఆమె వితంతువని తెలుసు-కొంటాడు అనిత, విజయ్‌ల స్నేహం బలపడసాగింది

"మీ కిష్టమైన విధంగా మీ జీవితాన్ని మలుచుకున్నారా?"

అనిత క్షణం మాట్లాడలేక పోయింది

"నా ఇష్ట ప్రకారమే చదువుకున్నాను వుద్యోగం చేస్తున్నాను "

"కాదు అంతకుమించి ఏమీ చెయ్యలేక "

"విజయ్ " అతడి వైపు చూసింది

"నాకే ఆశలు లేవు నా ప్రవర్తన మీలో ఆశ లేపిందంటే క్షమించండి అది నాకు తెలియకుండా జరిగిన తప్పు "

"క్షమించానంటూ నా మనసును నేను చంపుకోలేను "

"విజయ్, మన ఆచారాలు అలవాట్లు మీకు తెలియనివి కాదు

"ఆ ఆచారాలు అలవాట్లు మారగూడదనుకుంటే మీ వ్రాతల్లో ఆవేదన ఎందుకు? ఆవేశం ఎందుకు? చక్రపురంలో ఆ అమ్మాయికి పెండ్లెందుకు చేశారు?"

"నేను సంఘంలో మార్పు అవసరం లేదనడం లేదు మార్పు రావాలి నాలాంటి వారెందరి జీవితాలలోనో వసంతం తేవాలి " అనిత గొంతు ఆవేదనగా పలికింది.

"కాని ఆ మార్పుకు ఎవరో నాంది పలకాలి ఔనా?"

"విజయ్, నేనలా అనుకోడం లేదు నావల్ల మీరు అవమానం పొందగూడదు '

"మీకా భయం అక్కర్లేదు నేను మధ్య తరగతి కుటుంబీకుడ్నో పేద-వాడ్నో అయితే మీరన్నట్లుగా జరుగుతుంది ఇంకా చెప్పాలంటే వెలి వేసినట్లు చూస్తారు కాని ఇప్పుడలా కాదు ఆదర్శవంతుడి నంటారు లోకం తీరు ఇంతేనన్నట్లు మాట్లాడుతున్న అతడ్ని అలాగే చూస్తోంది అనిత

"అనితా . " ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు

"మీ మనసును మీరు మభ్యపెట్టుకోకండి మార్పు రావాలనడం కాదు ఆ మార్పును మీరే ఆహ్వానించండి '

"విజయ్ . " అతడి చేతుల్లో చేతిని వెనక్కు తీసుకుంది

"లోకం అనుకుంటున్నట్లుగా స్త్రీ పురుషుల స్నేహం స్నేహంగానే వుండదని ఋజువు చేస్తున్నామేమో '

"అలా అనుకోడం వెర్రితనం చూసిన వాళ్లందరు హృదయాన్ని స్పందింప చెయ్యలేరు. నేను కాలేజిలో అమ్మాయిలతో కలసి చదివాను మా ఆఫీసులో ఎందరో స్త్రీలు ఉన్నారు మా స్నేహితుల చెల్లెళ్లతో మాట్లాడతాను. వాళ్లను చూసినప్పుడు నాకే భావం కలగలేదు మీ విషయం చెప్పండి. మీకు వుద్యోగరీత్యా మగ స్నేహితులు వున్నారు వారెవరైనా మీకు సన్నిహితమయ్యారా?"

అనితకు అతడి మాటలు నిజమేననిపించాయి

"విజయ్‌తో మాట్లాడినట్లుగా తను ఇంకెవ్వరితో మాట్లాడలేదు అతడు దగ్గరి వాడనిపిస్తాడు అతడితో మాట్లాడుతుంటే కాలమే తెలియదు అతడ్ని కలుసుకోడం ఇష్టం లేదన్నట్లుగా మాట్లాడింది కాని అతడ్ని చూడని ఈ అయిదారు రోజులు ఎన్నో రోజులుగా అనిపించాయి అతడ్ని చూడాలనుకో-గానే తన కెంత ఆనందం. '

"ఏమిటి, ఆలోచిస్తున్నారు?" అన్నాడు విజయ్

"మీ గురించే."

"ఏమని?"

"ఇంత మంచితనం వున్న మీతో జీవితం ఎంత మధురంగా వుంటుందో-నని".

"ఊహుఁ..." చిలిపిగా చూశాడు

"మీరు వూహించలేరది"

ఇద్దరు కబుర్లు చెప్పుకుంటూ క్రిందికి వచ్చారు

"నర్సింగ్‌హోమ్‌కు వెళదామా?" క్రిందికి రాగానే అడిగాడు విజయ్.




"ఏం. స్నేహితులకి వార్త చెప్పాలని తొందరగా వుందా?" నవ్వుతూ అంది అనిత

"లేదు. ఇంకా ఆలస్యం చేస్తే తమరికి ఆగ్రహం వస్తుందని".

"మీరు టిఫిన్ కూడా చెయ్యలేదు ముందు మా ఇంటికి వెళదాము టిఫిన్ చేశాక నర్సింగ్‌హోమ్‌కు వెళదాము " అంది అనిత.

అర్థమయింది" నవ్వాడు విజయ్

ఏమిటి?"

"నేను మా స్నేహితులకు చెప్పాలని తొందరపడుతున్నా నన్నారు కాని మీరు మీ నాన్నగారికి చెప్పాలని ఆత్రపడుతున్నారు "

అనిత సిగ్గుపడింది.

"మీ ఇంటి నుండి నర్సింగ్ హోమ్‌కు వెళ్దాం తర్వాత మా ఇంట్లో డిన్నర్ మీరు పెండ్లికి ఒప్పుకుంటారని నాకు తెలుసు అందుకే నాయర్‌కు బ్రహ్మాండంగా భోజనం ఏర్పాటు చెయ్యమని చెప్పాను " అన్నాడు విజయ్

* * * *

అనిత, విజయ్ ఇంటికి రాగానే "విజయ్ గూడా వచ్చాడే " నవ్వుతూ అని "వెళ్ళిన పని అయిందా?" అడిగాడు ప్రసాదరావు విజయ్ వైపు చూస్తూ

## పసిడి బొమ్మ

నేను అనుకున్న పని అయించండి అనితగారి పని ఇంకా కాలేదు మీతో ఏదో విషయం అర్జంట్‌గా చెప్పాలంటే ఇలా వచ్చాము అన్నాడు విజయ్ కుర్చీలో కూర్చొని అనితని చూసి నవ్వుతూ

ఏమిటమ్మా?' కూతురి వైపు చూశాడు ప్రసాదరావు

అనిత ముఖంలో ఎన్నడూ లేనంత ఆనందం ఏదో విశేషం వుందనుకున్నాడు ప్రసాదరావు

"నాన్నా ' మెల్లిగా అంది "విజయ్ నన్ను పెండ్లి చేసుకుంటా-నన్నారు "

అనితా ' కొద్దిసేపు మాట్లాడలేక పోయాడు ప్రసాదరావు

'విజయ్ అనితను పెండ్లి చేసుకుంటానన్నాడా?' నమ్మలేక పోతున్నాడు

విజయ్ నీకీ ఆలోచన ఎందుకు వచ్చింది ?'

'ఏం, నేను పెండ్లి చేసుకో కూడదా?" నవ్వాడు విజయ్

నువ్వు పెండ్లి చేసుకోకూడదని కాదు అనితను " మాట్లాడలేని వాడిలా ఆగిపోయాడు

"అనితను చేసుకో కూడదా?' సూటిగా అతడి ముఖంలోకి చూశాడు విజయ్

'మీరు అనితకు మళ్లీ పెండ్లి చెయ్యాలను కున్నారన్న విషయం మరచినట్లున్నారు

లేదుబాబు ' నిట్టూర్చాడు

ఎలా మరచిపోతాను? అప్పటి అనుభవం నన్ను మళ్లీ ఆలోచింప చేసింది అనిత కారణంగా నువ్వు బాధ పడ గూడదు నీకు సంఘంలో పేరు ప్రఖ్యాతులు వున్నాయి '

కాబట్టే ధైర్యంగా చేసుకోవచ్చు అనిత గూడా మీలాగే అనుమానం వెలిబుచ్చింది కాని ఈ లోకం మమ్మల్నేమీ అనలేదు ఆ మాట నేను గట్టిగా చెప్పగలను '

విజయ్ నీకు తెలియదు

తెలియకున్నా వచ్చే నష్టం ఏమీలేదు నేను లోకానికి భయపడే మనిషిని కాను ఎవరో ఏదో అంటారని నా ఇష్టాన్ని కాదనుకోలేను '

విజయ్ ' చమర్చిన కండ్లతో చూశాడు ప్రసాదరావు

నిలా ఎందరాలోచించగలరు?"

నేను చేస్తున్న గొప్పపనేముంది? అనితను ప్రేమించాను పెండ్లి చేసుకుంటానంటున్నాను అన్నాడు విజయ్

ఆ ప్రేమకు పెండ్లికి ఆమె అర్హురాలిగా భావించడంలోనే నీ ఔన్నత్యం కనిపిస్తోంది

'అది ఔన్నత్యం కాదు అవగాహన మారుతున్న పరిస్థితులను అర్థం చేసుకొని వాటికనువుగా జీవిత విధానాలను ఏర్పరచుకోవాలి ఎప్పుడో ఎవరో ఏవో నిబంధన లేర్పరిస్తే కష్టమైనా వాటినే అమలు పరచాలనుకోడం మూర్ఖత్వం అప్పటి వారి జీవితా పరిస్థితులను బట్టి వారు ఏర్పరచుకున్న ఆచారాలు అలవాట్లు అవి పూర్వం ఉమ్మడి కుటుంబాలలో స్త్రీలకు లోకమంటే ఏమిటో తెలియకుండా గడిచిపోయేది ఈనాడు అలా కాదు ఆర్థికంగా సామాజికంగా వచ్చిన మార్పులు ఆమెను బాగా మార్చాయి తనకంటూ జీవితం వుండాలన్న ఆలోచన కలిగించాయి తను ఒకరికి భారంగా బాధాకరంగా వుండగూడదను కుంటోంది ఆమెకు సమాజం సహకరించక్కర్లేదంటారా? రక్షణ కరువైన ఈ రోజులలో ఆమెను అనాథగా వుంచడం భావ్యమేనా? విజయ్ మాటలు వింటుంటే ప్రసాదరావుకు సంతోషంగా వుంది

నీవింత లోతుగా ఆలోచిస్తావనుకోలేదు అనిత నీకు బాగా ఆలోచన రేపినట్లుంది

"నేను అనిత గురించి అలా ఆలోచించలేదు. ఆమె గురించి అలా ఆలోచించాల్సిన అవసరం గూడా లేదు. అనిత చదువుకున్నది. ఒకరి మీద ఆధార పడే అవసరం లేదు సమాజం గీసిన గీటును ఇదివరకే దాటింది

"సమాజం గీసిన గీటు దాటిందా?' ఏమిటో అది అర్థం కాలేదు ప్రసాదరావుకు

'కట్టు బొట్టు విషయంలో "

అనిత తను కట్టుకున్న చీరవంక చూసుకుంది ఖరీదైన షిఫాన్ చీర జడల్లుకుంటుంది తిలకం దిద్దుకుంటుంది పూలే ఆమె వదులుకుంది

"ఈ మార్పు మీలోనే కాదు ఇప్పుడు ఎందరిలోనో కనిపిస్తోంది కాని మానసికంగా ముందడుగు వెయ్యలేక పోతున్నారు వారందరికీ మీరు ఆదర్శం కావాలి " అనిత ఆలోచన పసిగట్టిన వాడిలా అన్నాడు విజయ్

-'అందరికీ మీలా ఆలోచించ గలిగే వాళ్లు దొరకొద్దూ!" అంది అనిత

"ఇది తప్పన్న భావన పోతే మార్పు అదే వస్తుంది అది చెప్పడంకన్నా చేసి చూపిస్తే తొందరలో మార్పు వచ్చే అవకాశం వుంటుంది

ప్రసాదరావు అతడి మాటలు వినడంలేదు పెండ్లెలా చెయ్యాలన్న ఆలోచనలో పడ్డాడు

"అనిత వివాహిత పదిమందిని పిలిచి ఆర్భాటంగా పెండ్లి చెయ్యాలంటే విమర్శలు ఎదుర్కోవలసి వస్తుందేమో ' మనసులో మాటను పైకే అనేశాడు.

'మీరు తప్పు చేస్తున్నట్లుగా ఆలోచిస్తున్నారు అనితకు పెండ్లయింది నిజమే కాని ఆమెకు భర్త లేడు జీవితమే మారిపోయింది సంఘంలో పనికిమాలిన వస్తువులాంటి దాన్ననుకుంటోంది. ఆ భావన చెరగాలంటే పదిమంది ఎదుటే పెండ్లి జరగాలి " అన్నాడు విజయ్

"ఏం చేసినా గతం మరవడం అసాధ్యం విజయ్ " అన్నాడు ప్రసాదరావు

**"గతం మరవాలని నేననడం లేదు ఆ గతం కలలాగే మిగలాలి పెండ్లనగానే ఆ పెండ్లి గుర్తు రాగూడదు తను జీవితం గడుపుతున్న వ్యక్తితో ముడిపడ్డ రోజు గుర్తు రావాలి నలుగురికి భయపడి ఎక్కడో చప్పుడుగా చేసుకొని వస్తే తనేదో కాని పని చేసినట్లే అనుకుంటుంది మనుషులను చూస్తే కుంచించుకు పోవచ్చు గూడా అలా జరగడం నా కిష్టం లేదు తప్పు చేస్తున్నామన్న భయమే వుంటే పెండ్లి చేసుకోడంలో అర్థం లేదు "**

"విజయ్, నేను నీలా ఆలోచించలేకపోయాను అడుగు ముందుకు వెయ్యాలనుకున్నాను కాని అది ఎలా వేస్తే బాగుంటుందో తెలుసుకోలేక-పోయాను నీవు నాకు దారి చూపించావు అనిత పెండ్లి ఇదివరకు కంటే ఘనంగా జరిపిస్తాను నాకు అనిత కన్నా ప్రపంచంలో ముఖ్యమైన దేదీ లేదు " వాళ్లిద్దరు పెండ్లి గురించి మాట్లాడుకుంటుంటే అనిత టిఫిన్ తెచ్చింది

"నాకీ రోజు ఈ వార్తతోనే కడుపు నిండి పోయిందమ్మా ఇంకేం అక్కర్లేదు " అన్నాడు ప్రసాదరావు

"వార్తలతోనే కడుపు నిండితే వార్తలకు కరువు వస్తుంది " టిఫిన్ ప్లేటు చేతిలోకి తీసుకుంటూ నవ్వుతూ అన్నాడు విజయ్

విజయ్ మొదటిసారి అనితతో వచ్చినప్పుడు 'అనిత ప్రక్కన అతడెంత బాగున్నాడు! అనిపించింది ప్రసాదరావుకు తర్వాత 'ఏమిటీ ఆలోచన' తనను తనే ముందలించుకున్నాడు 'కాని విజయ్ అనితను జీవితంలోకి ఆహ్వానిస్తున్నాడు అనిత ఎంత అదృష్టవంతురాలు ' అనిత విజయ్ నర్సింగ్ హోమ్‌కు వెళ్లాక వాళ్ల గురించే ఆలోచిస్తున్నాడు ప్రసాదరావు

* * * * * *

విజయ్, అనిత నర్సింగ్ హోమ్‌కు వచ్చేసరికి డాక్టర్ భార్గవ, డాక్టర్ సుధాకర్ ఏదో కేసు గురించి చర్చించుకుంటున్నారు

విజయ్‌ను చూడగానే హలో విజయ్ అంటూ లేచి ఇద్దరూ ఎదురెళ్ళారు

విజయ్ లోపలికి వస్తూ అనితా ఇతడు డాక్టర్ భార్గవ ఇతడు డాక్టర్ సుధాకర్ అంటూ వాళ్ళను పరిచయంచేసి ఈమే అనితాదేవి అని వాళ్ళకు చెప్పాడు

"మీరు రైటర్‌గా మాకు తెలుసు విజయ్ స్నేహితురాలిగా మీ గురించి చాలాసార్లు చెప్పాడు అందుకే మిమ్మల్ని చూడక ముందే మీరు మాకు బాగా తెలుసు ' అన్నాడు సుధాకర్

"మిమ్మల్ని చూడడం నాకు చాలా సంతోషంగా వుంది " అన్నాడు భార్గవ

అనిత చిన్నగా నవ్వింది

భార్గవ వాళ్ళను తాము విశ్రాంతి తీసుకొనేందుకు ప్రత్యేకంగా వుంచుకున్న గదిలోకి తీసుకెళ్ళాడు

"అనిత మీతో పనుండి వచ్చింది " విజయ్ గదిలోకి వచ్చి కూర్చోగానే తాము వచ్చిన కారణం వివరించి చెప్పి "మీరు ఒప్పుకుంటారని ఆమెకు నమ్మకంగా చెప్పాను " అన్నాడు

"ఏం ఇప్పుడు ఒప్పుకోమని అనుమానంగా వుందా?' అన్నాడు సుధాకర్

"నిన్ను చూస్తుంటే మాకు ఏదేదో చెయ్యాలనిపిస్తుంది కాని ఏం చెయ్యాలో తోచదు అనితగారికి మంచి ఆలోచన వచ్చింది తప్పకుండా ఆ పని చేస్తాము " అన్నాడు భార్గవ

'మీ కింకో విషయం గూడా చెప్పాలి " అన్నాడు విజయ్

విజయ్ అనిత వైపు చూశాడు అనితకా చూపులే తెలిపాయి అతడేం చెప్పబోతున్నాడో సిగ్గుల మొగ్గ అయిందామె

"అనిత నా కాబోయే భార్య

"ఈమాట ఇంత ఆలస్యంగానా చెప్పడం?, సుధాకర్ కోపం నటించాడు

"అనిత తను వచ్చిన పని ముందుగా చెప్పకపోతే కోప్పడుతుందని ముందు ఆ విషయం చెప్పాను ' అనితవైపు చిలిపిగా చూస్తూ అన్నాడు విజయ్

'విజయ్, నీవు మా మధ్యనుండి అమాంతంగా ఆకసానికి ఎగబ్రాకినట్లుగా అనిపిస్తోంది నీ వ్యక్తిత్వం ముందు మేము చిరు దీపాల్లా గూడా నిలవలేమేమో నీవు మా స్నేహితుడివని అనుకుంటే నాకు గర్వంగా వుంది ' భార్గవ అతడి చేతులు పట్టి వూపి అభినందించాడు

"విజయ్ అన్న పేరుకే వన్నె తెచ్చావు ఆదర్శానికి అభిమానానికి ప్రతిరూపానివి నువ్వు ' సుధాకర్ ప్రశంసా పూర్వకంగా అన్నాడు

"ఏం అతడు నన్ను చేసుకుంటాననడం అంత గొప్పగా అనిపిస్తోందా?" భార్గవ సుధాకర్‌ల వైపు చూసి అంది అనిత

వాళ్ళిద్దరు తప్పుచేసిన వారిలా ముఖాలు చూసుకున్నారు

మేము అలా అనుకోడం లేదు విజయ్ మాకు సన్నిహితుడు అతడేదైనా మంచి పని చేశాడంటే మాకు సంతోషంగా వుంటుంది ఆ సంతోషంతో మిమ్మల్ని బాధ పెట్టినట్టున్నాము " నొచ్చుకుంటూ అన్నాడు భార్గవ

"నేను మీ మాటలకు బాధ పడడం లేదు మీ అభిప్రాయం తెలుసుకుందామని అడిగాను అనిత అనగానే బాబోయ్, మా గురించి పత్రికలకు వ్రాస్తారా?" అన్నాడు సుధాకర్ భయం నటిస్తూ

"అలాంటిదేం లేదు భయపడకండి " అంది అనిత నవ్వుతూ

'మీ మాటల్లో మీకు స్నేహితుడి మీద వున్న అభిమానం తెలుస్తోంది అలాగే స్త్రీల పునర్వివాహం మీద మీ అభిప్రాయం తెలుసుకోవాలనుకున్నాను "

'నేను అందుకు వ్యతిరేకిని కాదండి ' బుద్ధి మంతుడిలా అన్నాడు సుధాకర్

"కాకపోతే ఆచరించలేదు అంతే " నవ్వాడు విజయ్

'అతడికి చదువుకొనేటప్పుడే పెండ్లయింది ఒక కూతురు గూడా భార్గవకు మేనమామ కూతురు వుంది కాని చెల్లెలి పెండ్లైతే కాని అతడు చేసుకోడట "

విజయ్, భార్గవ, సుధాకర్ కలిసి చదువుకున్నది హైస్కూలు వరకే అయినా చిన్నప్పటినుండి ఒకేచోట చదువుకోడం వల్లేమో, చదువులు వేరైనా వాళ్ళ స్నేహం చెదరలేదు

విజయ్ స్నేహితులముందు తన ఘనతను చాటుకోవాలనుకోడెప్పుడూ అదే స్నేహితులకు అతడంటే అభిమానం కలిగేట్లు చేసింది

అతడు నర్సింగ్ హోమ్ పెట్టుకొనేందుకు సహాయ పడడంతో భార్గవ సుధాకర్‌లకు అతడి మీద అభిమానం రెట్టింపు అయింది నోటితో కృతజ్ఞతలు చెప్పుకుంటే సరిపోదని అతడి పేరే నర్సింగ్ హోమ్‌కు పెట్టాలనుకున్నారు

ఆ విషయం నర్సింగ్ హోమ్ ప్రారంభోత్సవంనాటి వరకు అతడికి తెలియదు తెలిశాక "ఏమిట్రా ఇది?" అంటే మా స్నేహితుడి మనసును అందరు ఇందులో చూడాలని పెట్టుకున్నాము " అన్నాడు భార్గవ

వాళ్ళ అభిమానానికి విజయ్ కండ్లలో నీళ్ళు చిందాయి

వాళ్ళలో ఆ అభిమానం తరగలేదు

విజయ్ పెండ్లికి వాళ్ళే పెద్దలయ్యారు

భార్గవ చెల్లెలు భారతి, తల్లి యశోదమ్మ పెండ్లి కూతుర్ని అలంకరించడం, ఆమెకు కావల్సినవి అమర్చడం చేశారు

ఆ వేడుక వాళ్ళింట్లోనే జరుగుతున్నంత హడావుడి పడ్డారు

విజయ్ అన్నట్టుగా పెండ్లి గురించి ఎవరూ విమర్శించలేదు






# ప్రస్తుతం!

ఇంట్లో అణగి మణిగి వుండే
యువతి వంటింట్లో కుందేలు
ఆఫీసుల్లో ఉద్యోగం చేసే
పడతి అంటే ఎన్నెన్నో సందేహాలు
ప్రస్తుతం ఆడదాని బ్రతుకు
ముందు నుయ్యి వెనుక గొయ్యి!

—ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

# పసిడిబొమ్మ

**అదో** గొప్ప పనిగా శ్లాఘించారు

**అనిత అభిమానులు** సరేసరి చెప్పడమే కాదు చేసి చూపించారంటూ సంతోషాన్ని వ్యక్తం చేశారు

"విజయ్. చాలా మంచి పని చేశావు" అంటూ విజయ్ స్నేహితులు పరిచయస్తులు విజయ్‌ను అభినందించారు

కొందరు బంధువులు మాత్రం తమ పిల్లల్ని కాదన్నందుకు కోపంగా వున్నా, వాళ్ల పిల్లల్ని చేసుకొనే అదృష్టం అతడికే లేదన్నట్లు చాటుగా మాట్లాడుకుంటున్నారు 'ఇలాంటి పిల్ల రాసిపెట్టివుంది వాడికి." అంటూ జాలిపడ్డారు.

ప్రసాదరావు అన్నట్లుగానే పెండ్లి ఘనంగా జరిపించాడు

పెండ్లి ఖర్చంతా విజయే భరిస్తానంటే "నేను ఆ ఖర్చు భరించలేని స్థితిలో లేను. నాకాతృప్తి మిగల నివ్వు బాబూ ' అన్నాడు ప్రసాదరావు

**తన కూతురి జీవితంలో** మళ్లీ వసంతం వస్తుందని తను అనుకోలేదు పట్టుచీర, ఒంటినిండా నగలతో ముస్తాబై అత్తగారింటికి వెళుతున్న కూతుర్ని చూసేందుకు రెండు కళ్ళు చాలవని పించింది అతడికి

* * * * * *

**కూతురు అల్లుడు** రావడం పోవడం తను వాళ్లను చూసేందుకు వెళ్లడం.... ప్రసాదరావుకు సంతోషంగా గడుస్తోంది కాలం

"మీరొక్కరే ఎందుకిక్కడ? మా ఇంటికి రండి" అని విజయ్, అనిత చాలాసార్లు చెప్పారు కాని ప్రసాదరావు అంగీకరించలేదు

"నేను మీ ఇంటవున్నా మీరు నా దగ్గరున్నా ఈ ఆనందం వుండదు **అన్నాడు**

**అతనికి** అనిత విజయ్‌లను చూస్తుంటే తన చెల్లెలు, మేనల్లుడు పెండ్లికి ఒప్పుకోక పోవడమే మంచిదయిందనిపిస్తోంది

"మనుషులను అర్థం చేసుకోలేని మనుషులు వాళ్ళు తను నేరం చేస్తున్నట్లుగా మాట్లాడారు ' వాళ్ల మాటలు గుర్తొచ్చినప్పుడల్లా అనుకుంటుంటాడు

* * * * * *

విజయ్ అనిత వాళ్ల మ్యారేజ్‌డే పార్టీకి స్నేహితుల్ని ఆహ్వానించేందుకు వెళుతుండగా భార్గవ కనిపిస్తే కారు ఆపి మాట్లాడుతున్నారు

**అతడు** బంధువులింట్లో ఏదో ఫంక్షన్ వుందట వెళుతున్నాడు

విజయ్ అనితలను చూస్తుంటే అతడికి వాళ్ళిద్దరు ఒకరికోసం ఒకరు పుట్టినట్లుగా అనిపిస్తోంది

'జీవితం అంటే వాళ్లదే, అన్నంత ఆనందంగా వున్నారు వాళ్ళు వాళ్ల జంటను చూస్తే జంటలకే అసూయ కలుగుతుందేమో

విజయ్ వున్నతభావాలు గల వ్యక్తి అనిత జీవితంలో దెబ్బతిన్నది ఇద్దరి బ్రతుకులు ఒకటయ్యాయి ఇకవారు మళ్లీల దారి నెందుకేర్పరచుకోరు?' భార్గవ మాట్లాడుతూనే వాళ్ల గురించి ఆలో చిస్తున్నాడు

"నిన్న మొన్న జరిగినట్లుంది అప్పుడే పెండ్లై సంవత్సరం అయిందా? విజయ్ ఎల్లుండి మ్యారేజ్‌డే పార్టీకి రమ్మనగానే ఆశ్చర్యంగా అన్నాడు

"నిజమే భార్గవా కాలం వేగంగా పరుగెత్తుతోంది అనిత జీవితంలోకి వచ్చినప్పటి నుండి మరీను " విజయ్ దిగులుగా ముఖం పెట్టి అంటుంటే భార్గవ, అనిత నవ్వారు

"నీ కెప్పుడూ ఇలాగే కాలం వేగంగా పరుగెత్తుతోందనిపించేలా వుండాలని కోరుకుంటున్నాను ' అన్నాడు భార్గవ

"**అంతే** కాని నీవు తొందరగా పెండ్లి చేసుకొని అలా అనిపించేలా వుండాలనుకోడంలేదు "పెదవి విరిచాడు విజయ్

"**ఆ అనిపించడానికి** నాకు మధ్య భారతి పెండ్లి అనే కారణం అడ్డు వుందని నీకు తెలుసు,బై. " అంటూ స్కూటర్ ఎక్కాడు భార్గవ

**విజయ్** నవ్వుతూ చెయ్యి వూపి కారెక్క బోతుండగా "అనూ " అన్న పిలుపు వినిపించింది

విజయ్, అనిత ఆగి చూశారు.

**(ఇంకా ఉంది)**














### కె. ఎ.–మచిలీపట్నం

నేను భరతనాట్యం నేర్చుకుంటున్నాను కొద్దిసేపు నాట్యం చేయగానే విపరీతంగా చెమట పడుతోంది చెమట తగ్గాలంటే ఏం చేయాలి?

★ శరీర వ్యాయామం చేసేటప్పుడు చెమట పట్టటం చాలా సహజమే కాబట్టి దీనికి ప్రత్యేకంగా చికిత్స చేసుకోవాలనుకోవటం హాస్యాస్పదం

### వి. సి. ఆర్.–బొబ్బిలి

నాకు చదివినప్పుడు తలనెప్పి వస్తుంది తలపై భాగాన లాగుతున్నట్లనిపిస్తుంది తలలో భాగాలు కదులుతున్నట్లు ఉంటుంది మెదడు మొద్దుబారుతుంది అర గంట చదువుతే ఆ రోజంతా తలనెప్పి ఉంటుంది కొన్ని రోజులు చదవటం మానేస్తే తగ్గుతుంది చదవగానే మళ్ళా వస్తుంది ఎంత ప్రయత్నించినా చదువలేక పోతున్నాను

★ ఇది మానసిక దౌర్బల్యం సైకియాట్రిస్టులని కలిసి పరీక్ష చేయించుకోవటం మంచిది కళ్ళు పరీక్ష చేయించుకోవటం కూడా చాలా అవసరం

### సి. ఎస్. ఎం.–చోడవరం

నాకు రెండు కాళ్ళమీద నల్లటి తామరలా ఉంటుంది ఇది చాలా కాలం నుండి ఉంది తగ్గుతుందని చాలా ఆయింట్‌మెంట్లు వాడాను, కాని తగ్గలేదు

★ లోనికి ఫల్విన్ ఎం, గ్రైసోవిన్ వంటి మాత్రలు పూటకి 2 వంతున రోజుకి 3 పూటల వంతున వరుసగా పది రోజులపాటు వాడండి

పై పూతగా డిప్రోసాలిక్ ఆయింట్‌మెంట్ వాడండి

### టి. కె. కె.–విశాఖపట్నం

నాకు కొన్నాళ్ళుగా లైంగికోత్సాహము కలిగినప్పుడు స్తనముల నుండి పాలవంటి ద్రవం కారుచున్నది అలా గర్భము తర్వాత కదా వచ్చేది దీనికి ఏమి చేయాలి?

★ ఇలా జరగటం ప్రకృతి సిద్ధమైన హార్మోనుల ప్రభావమే ఇది రోగం కానే కాదు

లైంగికోత్సాహం ఏర్పడినప్పుడు పిట్యూటరీ గ్రంధి ప్రేరేపింపబడి ఆక్సిటోసిన్ అనే హార్మోను విడుదల అవుతుంది దానికి చనులలోని చిన్న కండరాలను ముకిళింపచేసే శక్తి ఉంటుంది ఇలా జరగటంవల్ల పాలను బయటికి తీసుకువెళ్ళే గొట్టాలు నొక్కబడి అందులోని పాలు బయటికి విసర్జింపబడుతుంది అధికోద్రేకమే దీనికి కారణం

### సి. జె. ఆర్. ఎస్. ఆర్ – ఖుర్దారోడ్.

పెరుగు అన్నం మజ్జిగ అన్నం చద్దన్నం, నచు పదార్థాలు (చేప, కోడిగ్రుడ్డు, మాంసము) తింటే లెప్రొసీ (కుష్టు రోగం) వ్యాపిస్తుందని నా స్నేహితుడు వాదిస్తాడు అది నిజమేనంటారా?

★ అలా వాదించటం శుద్ధ తెలివి తక్కువ తనాన్ని, మూఢత్వాన్ని తెలియజేస్తుంది □

# మరుభూమిలో మరబొమ్మ

జి. సాయిరమేష్ (రాధ)

అతి శీతల పానీయం అత్యంత హుందాగా సేవిస్తూ కూర్చున్నారు నాగభూషణంగారు ఎయిర్ కండిషన్డ్ అద్దాలగదిలో తనకి అత్యంత ప్రీతికరమైన వూగుడు కుర్చీలో వుల్లాసంగా వూగుతూ

"ఏమోయ్, సత్యం యింకా రాలేదేమిటి" అన్నారు ఆతృతగా చేతి గడియారం చూసుకుంటూ

"ఈసరికి వచ్చివుండాలి సార్ మరి ఏమయ్యిందో ఏమిటో" అన్నాడు సెక్రటరీ చంద్రశేఖరం చేతులు కట్టుకుని నిలబడి

"విషయం ఏమిటో వివరంగా చెప్పావా?

"మీరు చెప్పమన్నట్లే చెప్పాను సార్!'

"అయితే వస్తాడంటావా" అన్నారు అనుమానంగా సెక్రటరీని పైనుంచి క్రిందవరకూ పరీక్షగా చూస్తూ

నాగభూషణం పేరు ప్రతిష్ఠలున్న సమితి ప్రెసిడెంటు తాత ముత్తాతలు తేలికగా గడించి పెట్టిన ఆస్తి పాస్తులతో రాణిస్తోన్న పెద్ద మనిషి

తనకోసం కష్టపడి పని చేసే వాళ్ళు ఎందరో వున్నారని తెలిస్తే మానవుడు శరీరాన్ని భారీగా పెంచుకోగలడు వళ్ళు అలవకుండా వుయ్యాల బల్లమీద హాయిగా శయనించి సేద తీర్చుకుంటూ పంటిని విపరీతంగా పెంచుకున్నాడు నాగభూషణంగారు కూడా డబ్బు, పలుకుబడి వుపయోగించి ముఖ్యమంత్రి దగ్గరనుంచి మున్సిపల్ ఆఫీసు గుమస్తా వరకూ అందరినీ చేతిలో పెట్టుకున్నాడు ఆయన అవసరానికి పనికి వస్తుందని చచ్చిన పాముని కూడా పెరటి కుప్పమిద పదిలంగా భద్రపరచటం, ఆయన చిన్నప్పుడే నేర్చుకున్నాడు మరి తాతగారి దగ్గర!

అలా అని నాగభూషణంగారు దుర్మార్గుడు, దుశ్శాసనుడు అనుకోటం పెద్ద పొరపాటు ఆయన చూస్తూ చూస్తూ చీమకి కూడా హాని కలిగించడు ఎంతో అవసరమైతేనే కాని యింకొకరి ఎదుట కుట్టి బాధిస్తున్న దోమని కూడా చంపడు తన చేతితో అందుకే పది సంవత్సరాలుగా సమితి ప్రెసిడెంటుగా చలామణి అవుతూ, యిటు పేద ప్రజల గుండెల్లో అటు ప్రభుత్వం వెదడులో దేదీప్యమానంగా ప్రకాశించిపోతున్నాడు ఆయన ధర్మాత్ముడు, దయామయుడు అన్న పేర్ను సార్థకం చేసుకుంటూ

ఇంటిముందు జీప్ ఆగిన చప్పుడు వినిపించి అద్దాల కిటికీలోంచి తొంగి చూస్తూ" సత్యం వచ్చాడు సార్– లోపలికి పంపించమంటారా" అని అడిగాడు చంద్రశేఖరం హడావుడి పడుతూ .

"ఆ పంపించు అలస్యం దేనికి" అన్నారు నాగభూషణంగారు పరాకుగా ఏదో ఆలోచిస్తూ

"రావోయ్ సత్యం రా . ఏమిటి యింత ఆలస్యమయ్యింది కొంపతీసి మిట్ట మధ్యాహ్నం డ్రిల్ క్లాసేమీ పెట్టటం లేదు కదా మీ హెడ్‌మాష్టరు " అన్నారు నాగభూషణంగారు నవ్వుతూ ఆహ్వానిస్తూ

"అబ్బే అదేమీ లేదుసార్ మన వూరి కంకర రోడ్ల సంగతి మీకు తెలియందేముంది జీప్‌లో వచ్చినా నడిచి వచ్చినా ఒకే టైము పడుతుంది మరి ." అన్నాడు సత్యం చురుకుగా చూస్తూ

"బాగా చెప్పావు ఏం చేస్తాం మన మున్సిపల్ ఛైర్మన్ మల్లికార్జునరావు అలాంటివాడు మరి వాడికి చేవలేదు చాతుర్యం అంతకంటే లేదు మళ్ళీ ఎలక్షన్లు రావాలి ప్రభుత్వం మారాలి అంతవరకూ ఎవరు చేయగలిగిందీ ఏమీ లేదోయ్ అన్నారు నాగభూషణంగారు తన బాధ్యత భుజం మీద నుంచి తేలికగా దించేసుకుంటూ

'ఏమిటి అలానిలబడి పోయావ్ కూర్చో' అంటూ సోఫా చూపించి ఏం తీసుకుంటావు స్కాచ్ విస్కీ వుంది కావాలంటే" అన్నాడు ఆయన

చానాళ్ళయ్యింది ఓ పెగ్ పుచ్చుకుంటాను మీరేమీ అనుకోకపోతే' అన్నాడు సత్యం ముఖమాటపడుతూ

'నాకు తెలుసాయ్ మీ మిలటరీ మనుషులికి ఏది రుచిస్తుందో అంటూ లేచి వెళ్ళి తాళం భిగించి పదిలంగా దాచుకున్న టీచర్స్ విస్కీ సీసాని బీరువాలోంచి బయటకు తీశారు నాగభూషణంగారు

రెండు గ్లాసుల్లో తూచి తూచి చుక్కలు లెక్క పెడూతూ పోసి'–సోడా కొట్టించమంటావా ఐసు ముక్కలు వేసుకుంటావా" అని అడిగాడు ఆయన

"గ్లాసులో వున్నది కల్తీ లేని సరుకు అయితే ఏది కలుపుకుని పుచ్చుకున్నా రుచి ఎక్కడికీ పోదు సార్"

నీకాభయం అక్కర్లేదోయ్ సత్యం యిది నాణ్యమైన సరుకులే. వైజాగ్ నుంచి తెప్పించాను మొన్నామధ్య ఎవడో దొర డబ్బులకోసం దొంగ చాటుగా అమ్ముతుంటే చంద్రశేఖరం `చూశాడట. మనవాడి సంగతి నీకు తెలీదేమో కాని చూసిందేదీ చేయి జారనివ్వడు మరి అఖండు డనుకో అంటూ గ్లాసుల్లో ఐసు ముక్కలు వేసి తెచ్చి అందించారు నాగభూషణంగారు

చానాళ్ళకి స్కాచ్ విస్కీ సేవిస్తున్నాడేమో సత్యం జిహ్వ జివ్వుమంది

వుల్లాసంతో వుప్పొంగిపోతూ మెత్తని దిండులో మత్తుగా కుదించుకుపోయాడు

'వెంకట్రావ్ నీకు తెలుసనుకుంటాను" అని అడిగాడు నాగభూషణంగారు నెమ్మదిగా, నిదానంగా

ఏ వెంకట్రావ్ సార్"

ఇంకెవరోయ్ పాకిస్తాన్ వార్‌లో నీతో పని చేశాడుకదా . ప్రభుత్వం ఏదో పతకమో ప్రశంసా పత్రమో కూడా యిచ్చిందనుకుంటాను గుర్తు రాలేదా అదేనోయ్ . సుబేదార్ వెంకట్రావ్" అన్నారు నాగభూషణంగారు ఆత్రంగా

ఓ సుబేదార్ వెంకట్రావా . వాడు గుర్తు లేకపోవటం ఏమిటి సార్ వాడు నన్ను మర్చిపోయినా నేను మాత్రం వాడ్ని జన్మలో మర్చిపోలేను యిప్పుడు ఎక్కడ వున్నాడో ఏమిటో నాకు తేలీదు కాని–చాలా పెద్ద పొజిషన్‌లో వున్నాడని మాత్రం విన్నాను గత అయిదారు సంవత్సరాల్లో వాడి పేరు, ఫోటో పేపరులో కనీసం రెండు మూడు సార్లయినా పడి వుంటుంది మీరు కూడా చూసే వుంటారు సార్" అన్నాడు సత్యం సంభాషణ తేల్చేస్తూ

బహుశా నీకు యింకా తెలిసి వుండకపోవచ్చు అయిదారు రోజుల్లో మన వూరు వస్తున్నాడోయ్ ఆ వెంకట్రావ్ అన్నారు నాగభూషణంగారు కళ్ళు మిటకరిస్తూ

"ఏమిటి వెంకట్రావే చిత్రంగా వుందే. విశేషం ఏమిటట ' అని అడిగాడు ఆశ్చర్యంగా చూస్తూ

"పడి పోయిన పాత బిల్డింగు పగల గొట్టించి కొత్త స్కూలు కట్టించమని అయిదు లక్షలు చందాగా యిచ్చాడంట మర్యాదగా వుండదని ఎమ్ ఎల్ ఏ రామారావు శంఖుస్థాపన చేయటానికి రమ్మని ఆహ్వానించాడంట "

"ఎవర్ని వెంకట్రావ్‌నే ఆహా అయితే చాలా పెద్దవాడయ్యాడన్నమాట మా సుబేదార్ వెంకట్రావ్' అన్నాడు సత్యం మురిసిపోతూ

'నీకు తెలీదేమో కాని మన రాష్ట్రంలో డబ్బు దండిగా వున్న పెద్ద మనిషి ఎవరంటే వెంకట్రావే

మరి అవునాయ్...నిజం చెప్తున్నాను . హైదరాబాదు, బొంబాయిలోనే కాదు అతగాడికి ప్రపంచంలో చాలా చోట్ల పెద్ద పెద్ద వ్యాపారాలు వున్నాయి పై దేశాలకి ఎన్నెన్నో ఎగుమతులు చేస్తున్నాడు. కోట్లకి కోట్లు లాభాలు కొట్టేస్తున్నాడు. ఈమధ్యే బంజారాహిల్స్‌లో ఫైవ్ స్టార్ హోటల్ ఒకటి కట్టిస్తున్నాడని విన్నాను మరి. ఎంతవరకూ వచ్చిందో ఏమిటో తెలీదు కాని మాట్లాడితే స్విట్జర్లెండు, యింగ్లాండు అంటాడంట. అదృష్టం అంటే అదోయ్ . మీ వాడు కాలు కదిపితే కనకవర్షం కురుస్తుందనుకో మామూలు మనిషి కాదోయ్ మీ సుబేదార్ వెంకట్రావ్. .. అబ్బో పెరిగి పెరిగి చాలా పెద్దవాడయిపోయాడు మరి."

శ్రద్ధ వహించాడు సత్యం.

"వెంకట్రావ్ అంత కోటీశ్వరుడివి కాకపోయినా ... కనీసం మన మున్సిపల్ స్కూల్‌కి హెడ్‌మాష్టర్ అవ్వగలవు . నువ్వు కాస్త తలుచుకుంటే "

సత్యం నివ్వెరపోయాడు. పట్టలేని ఆనందంలో నోట మాట పెగలలేదు అతగాడికి.

"అవునాయ్ ... యిందులో వింతేమీలేదు డ్రిల్ మాష్టారు, హెడ్ మాష్టారు కాకూడదన్న రూలు ఏమీ లేదు కదా... అవునా . నీకేమోయ్ . ఎక్స్ యిండియన్ ఆర్మీ సుబేదార్ మేజరువి పాకిస్తాన్ వార్‌లో విశిష్ట సేవాపతకం పొందిన వీర సైనికుడివి... ప్రస్తుతం మా స్కూల్‌లోకి పెద్ద

ముందా గ్లాసు యిలాయివ్వు. . ఈ సంతోష సమయంలో మరో పెగ్ వేసుకుందాం" అంటూ లేచి వచ్చి సత్యం చేతులోంచి గ్లాసు లాక్కుని వెళ్ళారు నాగభూషణంగారు

"ప్రతిఫలంగా నాకో చిన్న పని చేసి పెడితే చాలు" అన్నారు గ్లాసు నింపి తెచ్చి అందిస్తూ.

"ఏమిటిసార్ అది"

"చెప్తాను కాని ముంద డ్రింకు తీసుకో...." అంటూ స్వింగ్ డోరు తెరిచి చంద్రశేఖరాన్ని పిలిచి చెవిలో ఏదో చెప్పి పంపించారు

మరో రెండు నిముషాలకి చిన్న సీసా లాంటిది తెచ్చి యిచ్చాడు చంద్రశేఖరం.

"నువ్వు వెళ్ళి పని చూసుకో" అన్నారు నాగభూషణంగారు పదిలంగా పేకెట్ అందుకుంటూ.




గంభీరంగా తలవిచ్చి గాఢంగా నిట్టూర్చారు నాగభూషణంగారు.

అంతేసార్ కొందరు పుట్టగానే పెద్దవాళ్ళు అవుతుంటారు మరికొందరు పెరిగి పెరిగి వృద్ధిలోకి వస్తారు వెంకట్రావ్ ఎప్పుడూ రెండో రకం మనిషే, నాకు బాగా తెలుసుగా వాడి సంగతి" అన్నాడు సత్యం గతాన్ని తలుచుకుంటూ.

"ఎవరి అదృష్టాన్నో చూసి మనం ముచ్చట పడితే లాభం లేదోయ్"

వులిక్కిపడ్డాడు సత్యం

"చేతనైతే చేసి చూపించాలి కాని . "

"ఏమిటిసార్ మీరంటుంది"

"నీకు అన్నీ వున్నాయికదా . కాస్త నేర్పు నైపుణ్యం చూపించి పైకి ఎందుకు రాకూడదు చెప్పు . నిన్ను చూస్తుంటే నాకు చాలా జాలి వేస్తుందోయ్ సత్యం యవ్వనమంతా వృధా చేసుకుంటావా ఆలోచించు " అన్నారు నాగభూషణంగారు వుసికొల్పుతూ

"యింతకీ మీ సలహా ఏమిటి" చురుకుగా చూశాడు సత్యం

"ఆ కంగారే పనికిరాదు పైకి వచ్చే మనిషి చాలా నెమ్మదిగా వుంటాడు. . ముందు వెనుక ఏముందో చూసుకుంటాడు అర్థమయ్యిందా" అవకాశాన్ని సద్వినియోగం చేసుకున్నారు సమితి ప్రెసిడెంటుగారు, శాంతగా తలవిస్తూ.

డ్రిల్లు మాష్టారివి పెద్ద, పులిని చూసైనా భయపడరేమో కాని, నీ పేరు చెప్తే చాలు హడలి ఛస్తారు కదటోయ్ మన స్కూలు పిల్లలు హెడ్ మాష్టారు అన్న వాడికి కావలసింది ఆ పలుకుబడి పెత్తందారు తనమేనయ్యా నువ్వు ఏమంటే అనుగాని నువ్వు మాత్రం మన హైస్కూలుకి హెడ్‌మాష్టారువి అవ్వగలవన్న నమ్మకం నాకుందోయ్. . నువ్వు 'ఉ' అను వెంటనే కమిటీ మీటింగ్ పెట్టించి డి యి ఒ తో మాట్లాడ్తాను" అన్నారు నాగభూషణంగారు గంభీరంగా చూస్తూ.

"అది సరే అనుకోండి" నమ్మలేక నసిగాడు సత్యం

"ఏమిటోయ్ యింకా సందేహిస్తావు. ఏది

చంద్రశేఖరం బయటకు వెళ్ళాక మళ్ళీ మొదలు పెట్టారు.

"ఏమీ లేదోయ్ . . నువ్వు వెంకట్రావ్‌ని ఒకసారి కలుసుకోవాలి"

"అంత గొప్పవాడు నన్ను గుర్తుపట్టాడంటారా"

"ఎందుకు గుర్తుపట్టడు.... నువ్వు సుబేదార్ మేజరువి అతడు సాదా సుబేదారా... మిలటరీ పదవుల్లో వచ్చిన వ్యత్యాసం ఎప్పుడూ వృధా పోదు సుమా ... మనం సరిగ్గా వుపయోగించుకోవాలే కాని ."

"అలాగే మీరు చెప్పినట్లే కలుసుకుని నేను ఫలానా అని పరిచయం చేసుకున్నానే అనుకోండి. ఏమవుతుంది? వెంకట్రావ్ నన్ను వాటేసుకుని బావురుమంటాడు అనుకుంటున్నారా.... లేదా ఆహ్వానించి

అతిధి సత్కారాలు చేయిస్తాడనుకున్నారా.... మీ పిచ్చి కాని వాడు నన్ను ఎప్పుడో మర్చిపోయి వుంటాడు సార్... పై అంతస్తు ఎక్కిన వాడికి నేలమీద నిలబడ్డవాడు ఎవడైనా పూచిక పుల్లలాగే ఆనతాడు కంటికి.. మీకు తెలియందేముంది " అన్నాడు సత్యం చిన్నబుచ్చుకుంటూ.

"నాకు తెలుసునోయ్ నీ బాధేమిటో . ఏం చేస్తాం మరి ప్రపంచం తీరే అంత... ఎక్కడికక్కడ సర్దుకు పోటం నేర్చుకోవాలి... నువ్వు ఏమీ చేయనక్కరలేదు వెంకట్రావ్‌ని కలుసుకుని నాల్గు కబుర్లాడితే చాలు . మిగతా పనంతా యిదే చూసుకుంటుంది." అంటూ చిన్న గొట్టంలాంటి సీసా చూపించాడు నాగభూషణంగారు

"అదేమిటి సార్" అన్నాడు సత్యం తడబడి గొంతు సవరించుకుంటూ

"యిదేనోయ్ అసలైన మందు. ఒక్క చుక్కతో ఎలాంటి వాడినోరు అయినా మూయించవచ్చు. ఎంత గొప్పవాడి ఆటలైనా క్షణంలో కట్టించవచ్చు మనిషన్నవాడికి ఆరడుగుల చోటు చూపించి సజీవ సమాధి కట్టే అత్యంత అమూల్యమైన ఔషదమోయ్ యిది. .." అన్నారు. ఒక విషపూరితమైన నవ్వు గాలిలోకి విసురుతూ.

"ఏమిటో సార్ మీరు చెప్పేది.. విషం పెట్టి వెంకట్రావ్‌ని చంపిస్తానంటారు అంతేనా"

నెత్తి మీద పిడుగు పడ్డట్టు నిలువెల్లా కంపించి పోయాడు సత్యం.

"ఎంత మందినో పిట్టల్లా పేల్చి చంపేశావు పాకిస్తాన్ యుద్ధంలో.. మర్చిపోయావా.. వాటి ముందు యిదెంతోయ్ నీకు..." అన్నారు నాగభూషణంగారు లాలిస్తూ.

"అదీ యిదీ ఒకటే అంటారా. వెంకట్రావ్‌కి నాకూ మధ్య ఏర్పడ్డ అభిమానమూ స్నేహమూ మీకు చెప్తే అర్థంకావుసార్.. ఒకసారి ఏమయ్యిందో తెలుసా. లాహోరు రంగంలో మేమున్న బంకర్‌లో బాంబుపడి పేలితే వాడికి విపరీతమైన దెబ్బలు తగిలితే.. నా ప్రాణాలకు తెగించి.. ఒంటి కాలిమీద నిలబడి చుట్టూ ముట్టిన తొమ్మండుగురు తురక సైనికుల్ని తుదముట్టించి, చావు బ్రతుకుల్లో వున్నవాడ్ని భుజం మీద వేసుకుని, ఆరుమైళ్ళు రాళ్లల్లో తుప్పల్లో వళ్లంతా చీల్చుకుంటూ నడిచి వెళ్ళి అతికష్టం మీద కాపాడానుసార్ ఆ వెంకట్రావుని.. యిప్పుడు ఆ చేత్తోనే వాడ్ని హత్య చేయమంటున్నారా.. పైగా దానికి ప్రతిఫలంగా నన్ను హెడ్‌మాష్టారుని చేస్తానంటారా.. యిదేనాసార్ మీరు చేసే ఉపకారం.. మీకు మీ మంచితనానికి వెయ్యికోటి నమస్కారాలు కాని యింకెప్పుడూ యిలాంటి ప్రస్తావన తీసుకు రాకండి.."

వుగ్రరూపందాల్చి విసురుగా సోఫాలోంచి లేచాడు సత్యం, విస్కీ ఒలిగేటంత బలంగా గ్లాసు బల్లమీద గట్టిగాపెడుతూ.

"ఆగు సత్యం. . ఆవేశ పడకు. నేను చెప్పేది కాస్త




## మరుభూమిలో మరబొమ్మ

జాగ్రత్తగా విను అన్నారు నాగభూషణంగారు ఆప్యాయంగా.

"యింకేమీ చెప్పక్కర్లేదు. మీ అసలు రూపం ఏమిటో నాకు యిప్పుడు బాగా అర్థమయింది ఏదో పెద్ద మనుష్యు లనుకున్నాను కాని యింతకు తెగిస్తారని ఎప్పుడూ వూహించలేదు ." సత్యం ఈసడించుకునాడు

"ఆగ్రహంలో వున్న మనిషికి ఏం చెప్పినా అర్థం కాదోయ్ కాని ఒక్క విషయం గుర్తుంచుకో. వెంకట్రావ్ నువ్వు వూహించుకుంటున్నంత వుత్తముడు కాదు. నేను నువ్వనుకున్నంత దుర్మార్గుడ్ని అంతకంటే కాదు." అన్నారు కలవరపాటు కప్పి పుచ్చుకోటానికి ప్రయత్నిస్తూ.

"అదంతా నాకు అనవసరం... మీరు యిప్పించే పదవి కోసం మరోమనిషిని హత్య చేసేటంత అప్రాచ్యుడ్నికాదు. నేను. నాకూ నీతీ నిజాయితీ వుందిసార్" అన్నాడు సత్యం దెప్పి పొడస్తూ.

"అది కాదోయ్ నేను చెప్పేది కాస్త విను." బ్రతిమాలారు నాగభూషణంగారు.

"చూడండి మీకు వాడికీ మధ్య పగ వుంటే అదేదో మీరే ఎందుకు చూసుకోకూడదు. మధ్యలో నన్ను యిరికించటం దేనికి.. మీకూ డబ్బుంది, హోదా వుంది. వాడ్నే యింటికి ఆహ్వానించి మీస్కాచ్ విస్కీలో ఓ చుక్క వేసి యివ్వండి.. మీ సంబరం తీరుతుంది. అన్నాడు సత్యం అవహేళనగా

నిజం తెలిస్తే నువ్వు యింత నిష్ఠూరంగా మాట్లాడవోయ్ సత్యం సగం సగం చెప్పి లేనిపోని అపోహలు సృష్టించటంకంటే విషయం ఏమిటో వివరంగా చెప్పటమే మంచిది కాని ముందు నువ్వు అలా కూర్చో చెప్తాను యిందులో బలవంతం ఏమిలేదు నేను చెప్పింది విని . ఆ తరువాత నీకు ఎలానచ్చితే అలా చెయ్యి. " అన్నారు నాగభూషణంగారు జాలిగాచూస్తూ

కళ్లల్లో అగ్ని గోళాలు దొర్లుతున్నా పెద్దమనిషిని ఎదిరించి వెళ్లలేక, గుమ్మం దగ్గరే నిలబడి పోయాడు సత్యం చీత్కరించుకుని చూపులు త్రిప్పుకుంటూ

"దయచేసి నా మాట కాస్త వింటావా" గాద్గదిక మయ్యింది ఆయన గొంతుక

నెమ్మదిగా వెనక్కువచ్చి కూర్చున్నాడు

"యిదంతా జరిగి అయిదారు సంవత్సరాలవుతోందోయ్ ఒకసారి నేను హైదరాబాద్ వెళ్ళినప్పుడు నన్ను రాణీని భోజనానికి ఆహ్వానించాడు ఆదిశేషయ్య .. అప్పటిలో అతడు ఆర్థిక మంత్రిగా వుండేవాడు అనుకో ఆ రాత్రే మొదటిసారిగా వెంకట్రావుని కలుసుకోవటం జరిగింది . అప్పటికే వెంకట్రావ్ బాగా పైకి వచ్చాడు కళాకారుల మధ్య కాంట్రాక్టరుల మధ్య మంచి పలుకుబడి కూడా సంపాదించుకున్నాడు. జర్కనీ కారేదో వేసుకుని చాలా జల్సాగా తిరుగుతుండేవాడు మంచివాడు కదా అని, రాణీ పలుకరించి మాట్లాడుతుంటే చూస్తూ వూరుకున్నాను, పిచ్చివాడ్ని. అన్నట్టు రాణీ ఎవరో నీకు తెలీదుకదూ పేరుకి నా రెండో భార్యే అయినా. నా జీవితంలో మాత్రం అసలైన వెలుగులు చూపించి పోయిన అపురూపసుందరి ఆ యిల్లాలు అలాంటి వుత్తమురాల్ని కన్నుగప్పి కాజేశాడు ఆ వెంకట్రావ్ మందేపెట్టాడో మంత్రమే గాని మొత్తానికి వలలో వేసుకున్నాడు, నా రాణిని అంతటితో వూరుకున్నాడనుకున్నావా . విడాకులు ఇచ్చి నన్ను వదిలించుకోమని చెప్పాడు వద్దని నచ్చ చెప్పటానికి ప్రయత్నిస్తే కన్నుగప్పి లేవదీసుకు పోయాడోయ్ నా రాణిని " చిన్న పిల్లవాడిలా విలపించారు నాగభూషణంగారు

"నా దనుకున్న నా రాణిని నాకు దక్కకుండా చేశాడోయ్ ఆ వెంకట్రావ్ మగాడు ఏదైనా భరించగలడు గాని కట్టుకున్న ఆడది అడవి చేసిపోతే మాత్రం హరించలేడోయ్ . అందుకే ఈ అవకాశాన్ని వృధా పోనిచ్చుకో కూడదు అనుకున్నాను యిది పగ ప్రతీకారం తీర్చుకోడం కోసం కాదోయ్.. కేవలం నా రాణీ ఆత్మశాంతికోసం .. నామాట నమ్ము "

అన్నారు నాగభూషణంగారు కళ్ళు తుడుకుంటూ.

సత్యం సందిగ్ధావస్థలో పడ్డాడు. సంభ్రమాశ్చర్యాల్లోంచి తేరుకుని

* * *

ఎం.ఎల్.ఎ. రామారావు, మున్సిపల్ చైర్మన్ మళ్ళి-

కార్మునరావు, యింకా పలుకుబడి వున్న పెద్ద మనుషులు, చుట్టుప్రక్కల గ్రామాల నుంచి పంచాయితీ ప్రెసిడెంటులు, పెట్టుబడిదారులు, పెత్తందారులు యిలా ఎందరో పేరు ప్రఖ్యాతులున్న సంఘ సేవకులంతా సమావేశ-మయ్యారు ఆ అయిదారు లక్షలు ఖరీదు చేసే అత్యంత ఆధునికమైన హైస్కూలు కొత్త కట్టడాలకి శంఖు స్థాపన చేయటానికి వచ్చిన వెంకట్రావుని గౌరవ పూర్వకంగా సన్మానించటానికి

కావాలనే నాగభూషణంగారు ఆ సభకు హాజరు కాలేదు. అతిముఖ్యమైన పని కల్పించుకుని ముఖ్య మంత్రిగారిని కలుసుకోటానికి హైదరాబాద్ ప్రయాణం పెట్టుకున్నారు ఆ రోజే. నాటకం నడిపించే బాధ్యత నమ్మకస్తుడికి వదిలిపెట్టి

తతంగమంతా పూర్తయ్యే వరకూ వెంకట్రావ్ కంట పడకుండా తగు జాగ్రత్త తీసుకున్నాడు. సత్యం

సభా వేదికదిగి పెద్దలందరితో కలిసి హెడ్‌మాష్టారి గది వైపు వస్తుంటే ఒకరి కొకరు ఎదురయ్యారు ఆఖరికి.

"సత్యం.. నువ్వా... చిత్రంగా వుందే. యిక్కడేం చేస్తున్నావ్ " హటాత్తుగా ఆగిపోయి ఆప్యాయంగా పలకరించాడు వెంకట్రావ్

"ఏమిటి మా సత్యం మీకు తెలుసునా" హెడ్-మాష్టారు శేషాద్రిగారు తెల్ల ముఖం వేశారు వెంకట్రావ్ తనని గుర్తు పట్టి పలకరిస్తాడని వూహించలేదేమో సత్యం కూడా తెల్లపోయాడు నోట మాట రాక నీళ్ళు నములుతూ నిలబడి

"తెలియటం ఏమిటండి.. పది సంవత్సరాల క్రిందట యిండో పాకిస్తాన్ వారులో యిద్దరం కలిసి ఒకే ట్రెంచ్‌లో వారాల తరబడి కలిసి వున్నాం .. ఈరోజు మీ ముందు యిలా నిలబడగలిగానంటే కారణం ఎవరనుకున్నారు.. సత్యమేనండీ .. ఏమిటి సత్యం . అలా నిలబడి పోయావేంటి.. . నన్ను యింకా గుర్తు పట్టలేదా... సుబేదారు వెంకట్రావ్‌ని.. " అంటూ దగ్గరకు వచ్చి సత్యం భుజం తట్టాడు వెంకట్రావ్.

"అబ్బెబ్బె.. నిన్ను ఎలా మర్చిపోతాను" అన్నాడు సత్యం గాభరా పడుతూ.

"గుర్తుంటే మరి యింతవరకూ కలుసుకోలేదేంటి సత్యం . ఎంత పెద్ద వాడ్ని అయినా నీ దగ్గర సాదా సుబేదారునే" అన్నాడు వెంకట్రావ్. సత్యం చెవిలో మెల్లగా వంగి

సత్యం మనసు పరిపరి విధాల పోతోంది అప్పటికే. పైకి అంత మంచిగా వుంటూ, అంత దారుణమైన పని ఎలా చెయ్యగలిగాడో అర్థం కాలేదు అతగాడికి.

"ఓ పని చేస్తాను. సాయంత్రం ట్రావెలర్సు బంగ్లాలో మనిద్దరికీ డిన్నరు ఏర్పాటు చేయిస్తాను. తప్పకుండా రా .. ప్లీజ్ నీతో చాలా మాట్లాడాలి సత్యం .. "

అప్పటికే చాలామంది పెద్ద మనుషులు, పత్రికా విలేఖరులు గుమిగూడి గమ్మత్తుగా చూస్తుంటే ముందుకు వెళ్ళక తప్పలేదు వెంకట్రావ్‌కి.

"నీ కోసం ఎదురు చూస్తుంటాను మరి మర్చిపోకో" అన్నాడు వెంకట్రావ్ మరో సారి మృదువుగా హెచ్చరించి అక్కడనుంచి కదులుతూ

ఎవరో మంత్రించినట్టు చెక్కిన శిల్పంలా నిలబడిపోయాడు సత్యం విశాలమైన జీవిత వేదిక-మీద తనకి తెలియని పాత్ర పోషించలేక తికమక-పడుతూ?

* * *

నాగభూషణంగారి ప్రతీకారం తీర్చడం కోసం తనెందుకు అంత దుర్మార్గానికి తలపెట్టాలి? కేవలం హెడ్‌మాష్టారు పదవికి కక్కుర్తిపడి, ఒకనాడు తనే ప్రాణదానం చేసిన మనిషికి యిప్పుడు మిత్రద్రోహం ఎలా చేయగలడు తను?

వెంకట్రావ్ స్నేహితుడని ఎందుకు అనుకోవాలి? నాగభూషణంగారి కథ వింటుంటే మనసు నీరు అయిపోయింది ఒకరు కట్టుకున్న యిల్లాల్ని కాజేసి, యింకెన్నో మోసాలుచేసి ఎంత గొప్పవాడయినా అతడు మంచివాడు ఎలా అవుతాడు, మిత్రుడు ఎందుకవుతాడు?

కాని తనకీ వెంకట్రావ్‌కీ మధ్య ఎలాంటి శత్రుత్వం-లేదే, ఆప్యాయంగా పలకరించాడు. ప్రేమగా పిలిచాడు .. అంతకంటే ఎక్కువ తను మాత్రం ఎందుకు ఆశించాలి?

చక్కని అవకాశం చేజిక్కించుకోకుండా జీవి-తాంతం ఈ డ్రిల్లు మాష్టారి వుద్యోగంలో చాలీ చాలని జీతంతో మ్రగ్గిపోటం కంటే, తెగించి ఒక్క తప్పు చేసి, పైకి రావటం పెద్ద పాపం కాదేమో? వెంకట్రావ్ కోట్లకి కోట్లు గడించి వుంటాడు. చేయి చాచి ఉడిగితే తెలిసిన వాడుకదా అని ఏదైనా దానం చేయగలడేమో? కాని ఒకడి ధర్మంతో బ్రతికే దౌర్భాగ్య స్థితిక మాత్రం తను చచ్చినా దిగజారలేడు! అలా అని వెంకట్రావ్‌కి వెన్నుపోటూ పొడవలేడు. పదవి కోసం ప్రాకులాడి దగా పడడం పిచ్చితనం ఏమో? ఎనలేని ఆలోచనలకి, అంతులేని ఆరాటానికి మధ్య ఏర్పడ్డ మనో యుద్ధం ముగియకుండానే సత్యం మనసు శాంతించింది మెదడులో తళుక్కున మెరిసిన ఓ తలపు మనిషిని నిలువెత్తా ముద్రించి కట్టి-పడేయటంతో

"ఏమిటండీ ఈ వేళ అంత నీరసంగా వున్నారు. స్కూల్ ఫంక్షన్ అదీ బాగా జరిగిందా" అని అడిగింది అర్థాంగి రత్నావళి టీ కప్పు తెచ్చి అందించి అనురాగపూర్వకంగా చూస్తూ

"ఆ ఏడిసినట్లే" అన్నాడు సత్యం కప్పు అందుకుని కంగారుగా టీ సేవిస్తూ

పెళ్ళయి పదిహేను సంవత్సరాలు దాటుతోంది కాని అంతవరకూ శ్రీవారిలో అంత చిరాకు ఎప్పుడూ చూడలేదు మరి ఆ యిల్లాలు.

"ఎందుకండీ అంత కోపం ఏమయింది " అంది రత్నావళి దగ్గరకువచ్చి ఆప్యాయంగా తల నిమురుతూ

"కాస్సేపు నన్ను ప్రశాంతంగా కూర్చోనిస్తావా" చీదరించుకుని చేతులు దూరంగా త్రోశాడు సత్యం.

భర్త ప్రవర్తనకి కారణం ఏమిటో తెలిక కొయ్య-బారిపోయింది ఆ కోమలి

సాయంత్రం ఆరింటికి ముస్తాబై బయలుదేరాడు సత్యం

"పని మీద బయటకు వెళ్తున్నాను వచ్చేసరికి చాలా ఆలస్యం అవుతుంది నాకోసం చూస్తూ కూర్చోక మీరు భోజనం చేయండి" అని ఆదేశించాడు అర్థాంగిని. ట్రావ్‌లర్స్ బంగ్లాకి వెళ్ళే ముందు.

* * *



నీకు నూరేళ్ల ఆయుషు సత్యం. యిప్పుడే అంటున్నాను రాజాతో నీగురించే రా నా గదిలోకి వెళ్దాం అంటూ ఆప్యాయంగా భుజం మీద చేయి-వేసి అభిమానపూర్వకంగా ఆహ్వానించి తీసుకు వెళ్లాడు వెంకట్రావ్. సెక్రటరీ రాజుకి విందు భోజనాలు ఏర్పాటు చేయించే పని అప్పగిస్తూ

నువ్వు బాగా చిక్కినట్లున్నావు సత్యం. బహుశా ఆ డ్రిల్లు మాష్టారి వుద్యోగం నీకు బాగా అలసట కలిగిస్తుందేమో" అన్నాడు చమత్కరించి సంభాషణ ప్రారంభిస్తూ

సత్యం చిన్నగా నవ్వి వూరుకున్నాడు

నన్ను మిలటరీ హాస్పిటల్‌లోంచి డిశ్చార్జ్ చేసే-సరికే నువ్వు యింటికి వెళ్లి పోయినట్లున్నావు నేను చేసిన పెద్ద పొరపాటు ఏమిటో తెలుసా సత్యం నీ వూరు వునికి తెలుసుకోక పోవటమే. పది సంవత్స-రాలుబట్టి నీ కోసం చూస్తున్నాను మరి పోన్లే యిన్నాళ్లకి మళ్లీ కలుసుకో గలిగినందుకు చాలా ఆనందంగా వుందిసుమా. అవును యింతకీ ఈ వూళ్లో. ఆ ఉద్యోగం ఎలా చిక్కుకున్నావో సత్యం " అని ఉడిగాడు వెంకట్రావ్

"ఎలా చిక్కుకున్నావు అంటే ఏం చెప్పమంటావు.. అదృష్టం కొంతవరకే కలిసివస్తుంది విధిమాత్రం ఎవరి దారిని వాళ్లని వదిలిపెడుతుంది" అన్నాడు సత్యం అన్య మనస్కంగా

"నిజమే అనుకో. అయినా గూడెంవచ్చి స్థిరపడ్డా-వంటే ఏదో కారణం వుండాలిగా"

"నీకు తెలిదేమో కాని నేను పుట్టింది పెరిగింది అంతా గూడెంలో నే" అన్నాడు సత్యం విరిచి నవ్వుతూ.

'చిత్రంగా వుందికదూ .. అన్నాళ్ళు కలిసి మెలిసి వున్నాం అయినా ఒకరి వూరు ఒకరు తెలుసుకోలేక పోయాం"

'ఒకోసారి మన జీవితమే మనకి చిత్రంగా వుంటుంది మరి ఎవరో వచ్చి చెప్పే వరకూ ఏమి అర్థంకాదు ' అన్నాడు సత్యం ఎత్తి పొడుపుగా

"బాగా చెప్పావు ఎవరి సంగతో ఎందుకు. నా సంగతే చూడు నేను యింత గొప్పవాణ్ని అవుతానని కలలో కూడా అనుకోలేదు. ఢిల్లీ నుంచి యింటికి వస్తుంటే రైలులో కలిసాడు జహీనా. ఎప్పుడో పోగొట్టుకున్న తన కొడుకుని నాలో చూశాడు అదృష్టమంతా నాకు అప్పగించి పోయాడు. నిజం సత్యం జహీనాయే నన్ను చేరదీసి తన ఆస్తికి వారసుణ్ని చేయకపోతే నేను యింత భాగ్యవంతుణ్ని అయి వుండేవాణ్నికాదు అదంతా ఓ పెద్ద విచిత్ర గాథే. సినిమాల్లో, కథల్లో చూస్తాం యిలాంటి విచిత్ర సంఘటనలు. " అన్నాడు వెంకట్రావ్ గతాన్ని తలచుకుని గంభీరంగా న

సత్యం శాంతం వహించాడు ఆసక్తిగా వింటూ

"ఏం తీసుకుంటావ్ " అడిగాడు వెంకట్రావ్– "నాకు తెలుసు నీకు స్పిరిట్స్ అంటే ఎంత యిష్టమో.. గుర్తుందా. మనిద్దరం మెస్ పార్టీలో ఎలా త్రాగే-వాళ్లమో. ఆ రోజులే రోజులు. మళ్లీ తిరిగి రావనుకో అన్నట్టు నా దగ్గర కోనియాక్ వుంది మరి తీసుకుంటావా.. నెపోలియన్ బ్రాందీ ఏదైనా తెప్పించమంటావా" అన్నాడు సత్యాన్ని మాట్లాడనీయకుండా చేస్తూ.

"ఏదయినా ఫర్వాలేదు "

"ఏమిటి సత్యం అంత నీరసంగా వున్నావు. కమాన్ వుయ్ మస్ట్ ఎంజాయ్" అంటూ కోనియన్ పోసి గ్లాసుతెచ్చి అందించాడు వెంకట్రావు. మౌనంగా అందుకున్నాడు సత్యం

"ఇప్పుడు చెప్పు. పెళ్లి చేసుకున్నావా.. ఎంతమంది పిల్లలు. ఏమిటి కథ" అంటూ ఎదురుగా కూర్చుని పెద్ద హేమ్లెట్ సిగార్ తీసి అంటించాడు హుందాగా.

'మనం మిలటరీలో చేరక ముందే నా పెళ్లి అయ్యిందన్న సంగతి నీకు తెలిసే వుండాలే" అన్నాడు సత్యం గుచ్చి చూస్తూ

"నువ్వు చెప్పే వుంటావు.. నేను మర్చి పోయి వుంటాను సారీ సత్యం నా మతిమరుపు సంగతి నీకు తెలుసుగా ఏమీ అనుకోక" అన్నాడు వెంకట్రావ్ చిరునవ్వుతో సర్ది చెప్పుతూ

అదే మాటకారితనం. అదే చలాకీతనం. ఏమీ మార్పులేదు వెంకట్రావులో నివురు కప్పిన నిప్పులా పైకి పెద్ద మనిషిలా ఎంతో హుందాగా కనిపిస్తూ ఎంత గొప్పగా అభినయిస్తున్నాడో చూడు?

అదీ అప్పటికీ సత్యం గుర్తించిన నగ్న సత్యం. ఒకనాటి నేస్తుడు వెంకట్రావు మీద అతడి మనసులో ఏర్పడ్డ అమూల్యమైన దురభిప్రాయం?

"పిల్లలు ఎంతమంది"

"యిద్దరు ఆడ మగ"

"అయితే కుటుంబ నియంత్రణని తు.చ తప్పకుండా పాటిస్తున్నావన్నమాట " చిలిపిగా నవ్వాడు వెంకట్రావ్

కొన్ని క్షణాలు నిశ్శబ్దం సత్యాన్ని తొందర పెట్టింది గుండెల్లో ఏదో తెలియని గుబులు పుట్టిస్తూ

'యింతకీ నీ మాట ఏమిటి" ఆఖరికి అడిగాడు సత్యం

"అడుగు ఏం చెప్పమంటావో" అన్నాడు వెంకట్రావు సోఫాలో వెనక్కువాలి చిన్నగా నిట్టూ-రుస్తూ

"పెళ్లి చేసుకోలేదా"

ఫక్కున నవ్వి– "పెళ్లి నాకా నో బ్రదర్ నాలాంటి వాడికీ పెళ్లికీ పొత్తు కుదరదు " అన్నాడు కొట్టి పారేస్తూ

"తమాషాగా వుందే. ఎందుకట" అన్నాడు సత్యం కోపాన్ని కప్పి పుచ్చుకోటానికి చిరునవ్వు తెచ్చి పెట్టుకుంటూ అవునురా. నీలాంటి వాడు పెళ్లి చేసుకోడు. పెళ్లయిన ఆడవాళ్లతో ఆటలాడుకుని. వాళ్ల జీవితాల్లో నిప్పులు పోసి నవ్వుకుంటాడు– అదీ సత్యం గుండెల్లో ఏర్పడ్డ అలజడి

"వింటానికి వింతగానే వుంటుంది కాని పెళ్లన్న మాట వెనుక నా జీవితంలో ఎంత పెద్ద కథ దాగి-వుందో ఎవరికీ తెలీదు సత్యం " అన్నాడు పరాకుగా

"ఏమిటో ఆ కథ"

"ఇప్పుడెందుకులే అదంతా యిలాంటి సంతోష సమయంలో కష్టాలు కెలుక్కుని కలవర పడటం-కంటే శుభ్రంగా ఎంజాయ్ చేయటం మంచిది కమాన్ హేవ్ అనెదర్ గ్లాస్.. " అంటూ కోనియర్ సీసా తెచ్చి గ్లాసులో పోశాడు

"సత్యం ఈ వూళ్లో నాగభూషణం అన్న పేరుతో ఓ

అబ్బే! నేను ఆ పార్టీలో చేరడానికి కారణం ఆ పార్టీ సిద్ధాంతాలు నచ్చికాదు! నే చేరని పార్టీ అదొక్కటే మిగిలి పోయింది అందుకని!

– శేఖర

"పెద్ద మనిషి వున్నాడన్న సంగతి నీకు తెలుసా"

పులిక్కి పడ్డాడు సత్యం

ఉన్నట్టుండి యిప్పుడు ఆ పెద్దమనిషి ఎందుకు గుర్తుకు వచ్చాడు నీకు అన్నాడు వెటకారంగా నవ్వుతూ

'ఎందుకా యిన్ని వున్నా నా జీవితంలో నాది అనుకున్న ఒక వెలుగుని నాకు దక్కకుండా చేశాడు కాబట్టి' అన్నాడు వెంకట్రావ్ ఆవేశంగా

ఏమిటి వెంకట్రావ్ నువ్వంటోంది

'నిజం సత్యం నాగభూషణం మనిషి కాదు ఒక మృగం నరుడుకాదు నరరూప రాక్షసుడు'

నీలి నీడలు తేలియాడాయి అంతవరకూ నవ్వులతో విరిసి విప్పారిన వెంకట్రావ్ ముఖంలో

"ఏమిటి నువ్వంటుంది".

"అవును సత్యం.... ఎన్నివున్నా నా జీవితంలో నాదిఅనుకునే ఒకతోడు నీడలేక పోవటానికి కారణం ఎవరో తెలుసా.... వాడే నాగభూషణమే"

సత్యంకి సర్వం అయోమయంగా తోచింది

"గతం తవ్వుకుంటే గుండెలకి దిగులే మిగుల్తుంది కాని.. ఆ బాధేదో నన్నే పడనీ .... నీకు యిప్పుడు అదంతా చెప్పి నీ మనసు నొప్పించటం నాకు యిష్టంలేదు"

సత్యం ఏదో అడగబోయాడు. ఇంతలో ఫోను మ్రోగింది

"గ్లాసు ఖాళీ అయినట్లుంది డ్రింకు పోసుకో యిప్పుడే వస్తాను" అంటూ వెంకట్రావ్ హడావిడిగా ప్రక్కగదిలోకి వెళ్లాడు

ఇంతకంటే మంచి అవకాశం దక్కదనిపించింది సత్యానికి అతి పదిలంగా దాచి తెచ్చిన అత్తరు బుడ్డిలాంటి సీసా జేబులోంచితీసి వణుకుతున్న చేతులతో రెండు చుక్కలు వెంకట్రావ్ గ్లాసులో రాల్చాడు. అప్పటికే అతగాడి వంట్లో సత్తువంతా కరిగి స్వేద బిందువులై వర్షించింది! ఒకప్రక్క కిటికీలోంచి శీతల గాలులు రివ్వున వీస్తున్నా. పైన ఫేను గిరగిరా తిరుగుతున్నా చెమటలతో సత్యం వళ్లంతా ముద్ద రుమాలుతీసి ముఖం రుద్దుకున్నాడు. ఊపిరాడక వుక్కిరి బిక్కిరి అయినట్లు అనిపిస్తే కంగారుగా కిటికీ దగ్గరికి పరుగుపెట్టి ఆతృతగా ముఖం బయటకు పెట్టి గాఢంగా వూపిరితీసి వదిలాడు

"ఏమిటి సత్యం అక్కడ నిలబడ్డావు అప్పుడే యింటిమీదకి మనసు పోయిందా ఏమిటి కొంపతీసి..." పరిహసిస్తూ దగ్గరకి వచ్చాడు వెంకట్రావ్

"అబ్బెబ్బె.. అదేమీలేదు" అన్నాడు సత్యం గాభరాపడుతూ.

"ఏం కంగారు పడకు.. పది దాటకుండా నిన్ను మీ ఇంటి దగ్గర దిగబెట్టే బాధ్యత నాది సరేనా" అంటూ నడిపించుకు వచ్చి సోఫాలో కూర్చోపెట్టాడు సత్యాన్ని

తను కూడా కూర్చుని కోనిమాక్ ద్రావకం మెల్లగా

## "నిట్టూర్పు గుండెల్లో...."

తూర్పు ఒక్కటే
ఉదయాలెన్నో
నిట్టూర్పు ఒక్కటే
నిర్భర వేదనలెన్నో
ప్రభవించుట సత్యం
చీకటిని చీల్చే
వేయి రేకుల వేకువ
తూర్పు కొండల్లో-
ప్రవహించుట తథ్యం
అరాచకాన్ని కాల్చే
నిప్పుల వెల్లువ
నిట్టూర్పు గుండెల్లో-

**-వీరపల్లి వీణావాణి**

# మరుభూమిలో మరబొమ్మ

సేవించాడు వెంకట్రావ్.

సత్యం గుండె దడ దడలాడింది

"నాగభూషణం ప్రొద్దుట ఫంక్షన్‌కి ఎందుకు రాలేదో వూహించావా" చెప్పటం మొదలుపెట్టాడు వెంకట్రావ్ సత్యం వికలమైన మనసుతో కూర్చున్నాడు.

"అతగాడికి నామీద పగ... ద్వేషం. చిత్రంగా వుంటుంది సుమా ... మనల్ని మోసంచేసి, మనమీదే ప్రతికారం తీర్చుకోవాలనుకునే మనుషుల్ని ఏమంటే బాగుంటుంది చెప్పు...."

సత్యం వెల వెలబోయాడు విషయం అర్థంగాక.

"రాణి నామేనత్త కూతురు చిన్నప్పుడే మా యిద్దరికీ పెళ్లి చేయాలని అమ్మ మావయ్య ఒకరి కొకరు చేతిలో చేయివేసుకుని మాటయిచ్చుకున్నారు. మాటమాటగానే వుండిపోయింది కాని రాణి మాత్రం నాకు దక్కలేదు.. మావయ్యని మోసంచేసి రాణిని దక్కించుకున్నాడు నాగభూషణం అదంతా ఎలా జరిగిందో, అసలు నిజం ఏమిటో ఆ భగవంతుడికే తెలియాలి. కాని, నాకు తెలిసిందల్లా ఒక్కటే మావయ్య పొలంమీద చాలా అప్పులు తీసుకున్నాడనీ, అవి తీర్చటానికి నాగభూషణాన్ని ఆశ్రయించాడనీ అందుకు వడ్డీగా వాడు రాణిని చేజిక్కించుకున్నాడనీ ... కాని రాణి ఆ పెళ్లికి ఎందుకు వప్పుకుందో అమ్మ ఎందుకు వూరుకుందో ఆ వివరాలేవీ నాకు తెలీదు .. ఆ బాధ భరించలేకే ఆర్మీలో చేరాను .. నా ఎడబాటు భరించలేక అమ్మ మంచం పట్టి మనోవేదనతో మరణించింది ఆ విషయం తెలిసి కూడా ఆఖరిసారిగా అమ్మని చూడటానికి వెళ్లలేకపోయాను మనసుకి పట్టిన వైరాగ్యం అలాంటిది.. . నేను మాత్రం ఏం చేయగలను...."

సత్యం అచేతనంగా చూస్తూ వుండిపోయాడు. ఆవేదన అణగార్చుకోటానికి మరో గ్రుక్కెడు మత్తుపానీయాన్ని ఆస్వాదించి మళ్లీ మొదలుపెట్టాడు వెంకట్రావ్.

"అదృష్టం నావెన్ను తట్టి పేదగొప్పల పాచికలాటలో నన్ను గెలిపించింది కాబట్టే యింత పెద్దవాడ్ని అయ్యాను.... నీకు తెలుసుగా డబ్బున్న మనిషి చుట్టూ క్రిమికీటకాదులు ఎలా చేర్తాయో..... నా విషయంలో కూడా అది అక్షరాలా నిజమయ్యింది.... పోతే ఒకరకం దెబ్బతిని వున్నాను కాబట్టి మరో రకం దెబ్బతినకుండా జాగ్రత్త పడగలిగానే కాని.... మానుకున్న మొదటి గాయంమీద మళ్లీ దెబ్బతగలకుండా కాపాడుకో లేకపోయాను. . ఒకసారి అనుకోకుండా రాణిని మళ్లీ కలిశాను... నాగభూషణం నాగుపామని తెలిసి వుండికూడా పిలిచి పలకరించాను.... ప్రేమ చంపుకోలేక యింటికి ఆహ్వానించాను.... అది సత్యం నేను చేసిన మహాపాపం... దానికి ఫలితం ఏమిటో తెలుసా.... ఆ అమాయకురాలికి మరణదండన ... అవును సత్యం.... ఆ నాగభూషణం హంతకుడు.. కిరాతకుడు.... రాణికీ నాకూ ఏదో సంబంధం వుందని అపోహపడి కట్టుకున్న భార్య ప్రాణాన్నే బలితీసుకున్నాడు దుర్మార్గుడు....- తన తప్పు కప్పి పుచ్చుకోటానికి కాలుజారి టేంక్‌బండ్‌లో పడిందన్న కథ సృష్టించి నమ్మించాడు అందర్నీ . కాని నిజం ఏమిటో నాకు తెలుసు.... వాడే చంపించి టేంక్ బండ్‌లోకి విసిరించాడు నారాణిని . అవును సత్యం....ఆ అఘాయిత్యం జరగటానికి రెండు రోజుల ముందే రాణీ నాకు ఫోను చేసింది.... ఏం చెప్పిందో తెలుసా.... పెళ్లయిన ఆడది ఏదయినా భరిస్తుంది కాని ఎవరైనా శీలాన్ని శంకిస్తే మాత్రం భరించలేదు అంది.... మనం యిద్దరం యిక కలుసుకోకూడదు అని శాసించింది. అప్పటికే నేను గ్రహించలేక పోయాను పిచ్చి ప్రేమ నన్ను గ్రుడ్డివాడ్ని చేసింది సత్యం ... యిప్పుడైనా అర్థమయ్యిందా నాగభూషణం ఎలాంటి మనిషో... పాము ఎవరైనా తనదారికి అడ్డువస్తే నే

కరుస్తుంది.... కాని భూషణం వున్నాడు చూశావూ ఆష్టదారులు తొక్కి ఎవరినైనా కరుస్తాడు "

సత్యం పిచ్చిగా కళ్ళు తేలవేసి చూశాడు

పోనీలే... జరిగిందేదో జరిగిపోయింది ఎవరి-కర్మకి ఎవరు కర్తలు. ఏదేదో వాగి నీకు తలనొప్పి తెప్పిస్తున్నాననుకుంటాను సారీ సత్యం నా బాధలు చెప్పుకోటానికి యింతవరకూ నీలాంటి ఆత్మీయులు ఎవరూ దొరకలేదు మరి ఏం చేయమంటావు... నీకు బోల్డంత డబ్బువుంది చెప్పుకుని ఏడ్వటానికి ఎవరూ దొరకపోవటం ఏమిటి.... చిత్రంగా వుందే అంటావేమో. అందు-లోనే వుంది మర్మమంతా. " ఓ జీవంలేని నవ్వు నవ్వి చెప్పటం కొనసాగించాడు వెంకట్రావు "డబ్బుతో ఎన్నో కొనవచ్చు... యింకెన్నో సృష్టించుకోవచ్చు కాని పోయిన మనిషిని మనసునీ మాత్రం వెనక్కి తెచ్చుకోలేము....అభిమానాన్ని, ఆత్మీయతని కొని-పెట్టేలేం... అవి మాత్రం సహజ సిద్ధంగా పుట్టాల్సిందే మరి. "

మత్తెక్కిన మనిషిలా మాటలు తడబడ్డాడు వెంకట్రావ్.

"చూడు సత్యం నాకో మంచి ఐడియా వచ్చింది నాతో హైదరాబాద్ ఎందుకు రాకూడదు నువ్వు - అవును సత్యం నువ్వు వచ్చి తీరాలి ."

"నేనా" సత్యం గుండెల్లో రాయి పడింది

"అవును సత్యం...నీకంటే ఆత్మీయులు నాకు ఎవరున్నారు చెప్పు. .. అంతకంటే ఎక్కువే నువ్వు ఒకనాడు నాకు ప్రాణదానం చేశావు మరి ఆ ఋణం ఏ ఇచ్చి తీర్చుకున్నా తీరదు సత్యం కనీసం యిలాగైనా కొంచం తీర్చుకోనీ .. నా కంపెనీలు అన్నింటిలో నిన్ను షేర్‌హోల్డర్‌ని చేస్తున్నాను ఈ రోజునుంచి ..." వెంకట్రావ్ మాటలు ముద్దపోతున్నాయి సత్యానికి ముచ్చెమటలు పోస్తున్నాయి

"అయిదారు లక్షలుపెట్టి నీకు మంచి బిల్డింగు కట్టిస్తాను...నీకు ఎక్కడ కావాలంటే అక్కడ - ఎంత డబ్బు అయినా ఫర్వాలేదు నీ పిల్లలికి మాత్రం మంచి చదువులు చెప్పించాలి. .. నీ కుటుంబ-మంతా సుఖసంతోషాలతో కలకాలం వుండాలి సత్యం....నా చుట్టూ క్రిమి కీటకాదులు ఎన్నో పొంచి వున్నాయని నువ్వే గుర్తిస్తావు. చూస్తుండు తీపి వస్తువు ఏదైనా మనుషుల్ని ఎలా ఆకర్షిస్తుందో నీకే తెలుస్తుంది.. .సినిమాల్లో చూడటంలేదూ జీవితం కూడా అంతే . నిజానికి జీవితమే ఓ సినిమాయేమో...." నవ్వలేక నవ్వాడు వెంకట్రావ్ నీరసంగా.

అప్పటికే అతడి కళ్ళు మగతగా మూతలు పడుతున్నాయి.

"కొందరు నటించి జీవితాన్ని వెండి తెరమీదకి ఎక్కించుకుంటారు.... కొందరు మనలా తెరమీదకి



# ఇ'వేమన'పద్యాలు







ఎక్కకుండా జీవితాంతం నటిస్తుంటారు హృదయమే ఓ పెద్ద సినిమా తెర సత్యం .. మెదడులో పేరుకుపోయిన స్మృతి చిహ్నాల్ని కరిగించు-కుని హృదయం అనే తెరమీద వేసుకుని చూస్తే తెలుస్తుంది బ్రదర్ జీవితం సినిమాకంటే ఎంత చిత్రంగా వుంటుందో? ఎక్కడ ఎప్పుడు తప్పటడుగు వేశామో... ఎవర్ని మోస పుచ్చామో . ఎవర్ని మురిపించామో.. అంతా స్పష్టంగా కనిపిస్తుంది మరి.. సత్యం. ఏమిటి నువ్వు మసకగా కనిస్తు-న్నావు.. నా గొంతుక పొడారిపోతోందేమిటి? సత్యం .. ప్లీజ్.. ఏం చేస్తున్నావు. స. ..త్యా.. ం" వెంకట్రావు నోరు శాశ్వతంగా మూతపడింది.

సత్యానికి అప్పుడే తెలిసింది తను ఎంత తొందర-పడ్డాడో?

'భగవంతుడా ఏమిటీ దారుణం.. ' అతడి మనసు మౌనంగా రోదించింది వుక్కిరి బిక్కిరి అవుతున్న వెంకట్రావ్‌ని చూసి. మీట విరిగిన మర బొమ్మలా, చేష్టలుడిగాడు సత్యం శాశ్వతంగా! □




"బాబాయ్-అబ్బాయ్"లో అనితారెడ్డి



# సినిమా

## శివకృష్ణ హీరోగా "ఆగ్రహం"

మూడు ఏనుగులు, పులి ఎలుగుబంటి మొసలి కోతి చిలక హీరోకి నేస్తాలుగా పాల్గొనడం ఈ చిత్రంలో అదనపు ఆకర్షణ అన్నారు రోసిరాజు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో ఎన్ ఆర్ భారతి నిర్మించే జయభారతి ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రం తొలి షెడ్యూల్ జనవరి 11 నుంచి 26 వరకు జరిగింది శివకృష్ణ అరుణ, రాజ్యలక్ష్మి నూతన్ ప్రసాద్ రాజేంద్ర ప్రసాద్, రాళ్లపల్లి, సుదాకర్ బాలాజీ, రజనీ,



## కొమ్మినేని దర్శకత్వంలో "గర్జించిన గంగ"గా జయసుధ

చిలిపి పిల్లగా, తల్లిగా భర్తను విడిచిన భార్యగా నేరస్థురాలిగా విభిన్న రసాలను పోషిస్తోంది జయసుద అన్నారు కొమ్మినేని ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి గంగయ్య నిర్మించే జి జి ఆర్ట్ క్రియేషన్స్‌వారి పై చిత్రం తొలి షెడ్యూల్ జనవరి 5 నుంచి 25 వరకు జరిగింది మలి షెడ్యూల్ ఫిబ్రవరి 5 నుంచి 25 వరకు శరత్‌బాబు, గొల్లపూడి కల్పన బాలాజీ, అర్జున్, సుదర్శన్, త్యాగరాజు, సూర్యకాంతం అనూరాధ ప్రభృత తారాగణం మాటలు కాశీ విశ్వనాధ్ సంగీతం ఇళయరాజా ఛాయ కబీర్ లాల్ సహకార దర్శకులు రామకృష్ణ, జయ ప్రసాద్ రెడ్డి, పి వెంకటేశ్వరరావు శిల్పం డి వాసు కూర్పుతో కె సత్య నారాయణ సమర్పిస్తారీ చిత్రాన్ని



## "పారిపోయిన ఖైదీలు"

స్మిత ప్రధాన పాత్రధారిణి జైలు శిక్ష అనుభవించిన నలుగురు ఖైదీలు ఈ చిత్రంలో పాల్గొనడం ఒక ముఖ్యాంశం మంజుల అనే నవ గాయనిని కూడా పరిచయం చేస్తున్నాం మొదటి షెడ్యూల్ జనవరి 20 నుంచి నెలాఖరు వరకు హైదరాబాద్‌లో జరిగింది మలి షెడ్యూల్ ఫిబ్రవరి 24 నుంచి మార్చి 24 వరకు నాగార్జునసాగర్, శ్రీశైలం, దిండి ప్రాంతాలలో జరుగుతుంది" అన్నారు వల్లభనేని జనార్ధన్ ఈయన దర్శకత్వంలో వడ్డమూడి రాజబాబు కొసరాజు రాజేంద్ర బాబు నిర్మించే వీర రాణి ప్రొడక్షన్స్ పారిపోయిన ఖైదీలు చిత్రానికి జనార్ధన్, సాయినాధ్ కథను తయారు చేశారు సాయినాధ్ సంభాషణల కర్త కృష్ణ-చక్ర స్వరకల్పనలో గోపి గీతాలు రాశారు నవకాంత్ ఛాయ తోట శిల్పం శ్రీ రామరెడ్డి సహకార దర్శకత్వం, ఎల్ వెంకటరాజు నిర్వహణ, జ్యోతి రాజు నిర్మాణతలో శ్వేత చిత్ర ఇంటర్నేషనల్ సమర్పించే ఈ చిత్రం ఏప్రిల్‌లో విడుదలవుతుంది.

# విశేషాలు

-జి. వి. జి.

కాంతారావు త్యాగరాజు సి హెచ్ కృష్ణమూర్తి అనిత మమత, జానకి వగైరా నటవర్గం చెరువు, ప్రణవి రాసిన కదకు పైడిపల్లి రవీంద్రబాబు సంబాషణలకర్త సత్యం స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు లక్ష్మణ్ చాయ ప్రకాశరావు శిల్పం ఎం జగన్నాధరావు – మోహన్‌కుమార్ సహకార దర్శకత్వం, ఎన్ ఆర్ హనుమంతరావు నిర్వహణ, సలీం నృత్యాలు వేణుగోపాల్ కూర్పుతో ఎన్ వి రాజకుమార్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్

"లంచావతారం



ఆడవారికి కావలసిన అన్ని ఆకర్షణలతో
అన్ని తరాల వారినీ అలరించే కలువబాల! (ఫోటో :- రవిచందర్)



రెండో షెడ్యూల్ ఫిబ్రవరి 20 నుంచి మార్చి 30 వరకు జరుగుతుంది" అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే సి కె రంజిత్

## శ్రీ ఫిలిమ్స్ తొలి చిత్రం "ఈ తరం ఇల్లాలు"

చెప్పుడు మాటలు శ్రీరాముని చెవిలో పడడంవల్ల, సీతమ్మతల్లి అగ్నిప్రవేశం చేయవలసి వచ్చింది సీత, అరుంధతి అనసూయలవంటి మహా పతివ్రతలను అనుసరించడం ప్రతి గృహిణి దర్మమే అంతమాత్రం చేత తప్పని స్థితిలో ఇల్లాలు గడపదాటినంత మాత్రాన పతిత అని పిలవడం తప్పు- అంటుంది "ఈతరం ఇల్లాలు, తాను శీలవతినని నిరూపించ డానికి అగ్ని ప్రవేశం చేయాలా – అని ప్రశ్నిస్తుంది మామూలు నేత్రాలతో కాక మనో నేత్రాలతో దర్శించదగు రీతిలో ఈ చిత్రానికి సీతాకోక చిలక ఎర్ర గులాబీలు పేమ్ బారతీరాజా మహోత్కృష్టమైన రీతిలో దర్శకత్వం వహించారు ఈతరం ఇల్లాలుగా అసమాన చాతుర్యంతో రేవతి నటించిన ఈ ప్రతిష్టాత్మకమైన చిత్రంలో విజయ్ డాక్టర్ రాజశేఖర్ అనే నవనటులు పరిచయం గావింపబడు-తున్నారు ప్రతాప్ పోతన్ శుభలేఖ సుదాకర్, ఎస్ వి జగ్గారావు ఆర్ శంకర్ కాకినాడ శ్యామల శ్రీలత వగైరా నటవర్గం సెల్వరాజ్ కదకుడు ఆత్రేయ మాటలు, పాటలు రాశారు ఇళయ రాజా సంగీత

దర్శకుడు కణ్ణన్ చాయాగ్రాహకుడు ఊటీ, కొడై-క్కెనాల్ ప్రాంతాల్లో మనోహరమైన పాటల చిత్రీకరణ అదనపు ఆకర్షణ అటు మహిళాలోకానికే కాక ఇటు యువతరానికీ మహత్తరమైన సందేశం ఇచ్చే ఈ చిత్రం నవయుగ ద్వారా అతి త్వరలో విడుదలవుతుంది





"ఈ తరం ఇల్లాలు"లో రేవతి



# సినిమా

## అతి త్వరలో విడుదలయ్యే "సంసారం ఓ సంగీతం"

"స్త్రీ ఎంత గొప్పదైనా మాతృమూర్తి కావాలనే తపన ఉండడం సహజం కాని దురదృష్టవశాత్తు అందుకు నోచుకోకపోతే? జీవితాంతం కుమిలి పోనక్కర్లేదు .. అమ్మదనంలోని కమ్మదనం చుట్టూ అల్లబడిన ఈ విశిష్టమైన ఇతివృత్తాన్ని ఎన్నో ఏళ్ళుగా పలు చేర్పులు మార్పులతో నా మదిలో రూపు దిద్దుకుంటూ వచ్చాను అది ఇంతకాలానికి సెల్యులాయిడ్‌పైకి ఎక్కింది" అన్నారు అత్యుత్తమ చిత్రాలను నిర్మించే నవత కృష్ణంరాజు మళ్ళీ మళ్ళీ వినాలనిపించే సి నారాయణరెడ్డి, వేటూరి నవత రచించిన అతి మధురమైన గీతాలున్నాయి సత్యానంద్ సంభాషణ, వుహాళేంది సంగీతం బి కోటీశ్వర రావు ఛాయ, కళాదర్ శిల్పం, గౌతంరాజు కూర్పు శివ సుబ్రహ్మణ్యం నృత్యాలు టి ఎం సంతానం ప్రొడక్షన్‌తో రేలంగి నరసింహారావు ప్రతిభావంతంగా దర్శకత్వం నెఱపారు నిర్వహణ ఎన్. అచ్యుత రామరాజు

## కె. ఎస్. రెడ్డి దర్శకత్వంలో "కసాయి గుండెలు"

"క్రాంతి మోహన్ హీరో జనవరి 24 న పాటల రికార్డింగ్ ప్రారంభించాం. హైదరాబాద్‌లో ఫిబ్రవరి 3 నుంచి 28 లోపుగా ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు నిర్మాత నరేంద్రబాబు ఈయన ఇంతకుముందు "రాదమ్మ మొగుడు" లాంటి చక్కని చిత్రాన్ని అందించారు ఇప్పుడు శ్రీ నరేంద్ర ఫిలిమ్స్ పతాకంలో నిర్మించే "కసాయి గుండెలు" చిత్రానికి సత్యం సంగీతం దేవీ ప్రసాద్ ఛాయతో కె ఎస్ రెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు

## త్వరలో విడుదలయ్యే "దయ్యాలమేడ"

"సస్పెన్స్ థ్రిల్లర్. నవంబర్ 3 నుంచి డిసెంబర్ 3 వరకు ఒకే షెడ్యూల్‌లో రెండు భాషల్లో పూర్తిగా ఊటీలో తయారైంది చిత్రం ముందుగా విడుదలైన తమిళ వెర్షన్ తమిళనాడులో విజయవంతంగా ప్రదర్శింపబడుతోంది" అన్నారు లోగడ "బావా మరదళ్ళు" వంటి హిట్ చిత్రాన్ని అందించిన ఎం నరసింహారావు. ఈయిన నిర్మాణ సారధ్యంలో కె ఎం సుబ్బారాయుడు సమర్పించే రాశీ ఆర్ట్ ప్రొడక్షన్స్ "దయ్యాల మేడ" చిత్రంలో మురళి అంబిక అనూరాధ బిందూఘోష్ ఆదిగా గల వారు పాల్గొన్నారు రాం నారాయణ దర్శకత్వంలో ఉప్పులూరి కొండల రావు నిర్మాత

## కె. విశ్వనాధ్ కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో "సిరి సిరి మువ్వ" నిర్మాతల తదుపరి చిత్రం

కొందరు కొత్త నటీ నటులు పరిచయం గావింపబడతారు అన్నారు కె విశ్వనాద్ ఈయన కథ స్క్రీన్‌ప్లే మాటలు, దర్శకత్వంలో చింతా రామ కృష్ణారెడ్డి ఎన్ భాస్కరరావు యు చిన వీర్రాజు నిర్మించే చిత్రానికి ఆత్రేయ పాటలు రాశారు

## విజయబాపినీడు సమర్పణలో "విష కన్య"

రవితేజ అనే నవ దర్శకుని అర్చన అనే నూతన నాయికను పరిచయం చేస్తున్నాం" అన్నారు విజయ



'కొత్త పెళ్ళికూతురు" విజయశాంతి

బాపినీడు ఈయన కద సమర్పణలో ప్రముఖ పంపిణీ సంస్థ శ్రీ రమణ మూవీస్ అధినేతలు సుబ్బా

రాయుడు, శ్రీనాద్ నిర్మించే "విష కన్య" చిత్రం తొలి షెడ్యూల్ డిసెంబర్ 15 16 తేదీలలో జరిగింది జనవరి 6 నుంచి మార్చి 10 వరకు ఒకే షెడ్యూల్‌లో మిగతా షూటింగ్ పూర్తవుతుంది శరత్‌బాబు

నరసింహరాజు ఉదయకుమార్ అర్చన స్మిత జయమాలిని అనూరాద పి ఆర్ వరలక్ష్మి పొట్టి చిట్టిబాబు ప్రభృత నటవర్గం కర్పూరపు ఆంజనేయులు సంభాషణలు, విజయ కృష్ణమూర్తి సంగీతం హెచ్ ఎస్ వేణు ఛాయ నాగరాజన్ శిల్పం, జి మదుసూదనరావు నిర్వహణ సతీష్ సహకార దర్శకత్వం కె సత్యం కూర్పుతో రవితేజ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు

న్యాయం నిదురపోతే సత్యానికే శిక్ష!

ఈతరం పిక్చర్స్‌ని రెండవసారి వరించింది విజయలక్ష్మి!

ఈతరం పిక్చర్స్

# దేశంలో దొంగలు పడ్డారు

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: కృష్ణ

నిర్మాత: పోకూరి వెంకటేశ్వరరావు




శ్రీ నాగార్జున ఫిలింస్




(గత సంచిక తరువాయి)

ఆ ఉదయం కృష్ణచైతన్య కాఫీ కోసం డైనింగ్ హాల్లోకి రాలేదు. పనిలో ఉన్న ప్రభావతమ్మకో కప్పు అందించి కృష్ణ చైతన్య కోసం లైబ్రరీ రూమ్‌లోకి కాఫీ తీసికెళ్ళింది అతడేదో వ్రాసుకుంటున్నాడు

'మామయ్యా! కాఫీ" ప్రక్కన నిలబడింది.

'అక్కడ పెట్టి వెళ్ళు' తలెత్తకుండానే అన్నాడు

'ఊహుఁ నువ్వు మర్చిపోతావు తీసుకోవాల్సిందే.'

ఆమె మాటలకు నవ్వుకుంటూ తలెత్తాడు పెన్ పుస్తకం మీద పెడుతూ ఒక్క క్షణం అతని కన్నులు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి. ఆమెలో ప్రత్యేకాకర్షణ ఏమీలేదు. అతిసాధారణంగా ఉంది. క్రొత్త చీరలో అరవిచ్చిన ముద్దమందారంలా ముచ్చట కొల్పుతుంది. మంచులో తడిసిన తెల్లగులాబిలా నిర్మలంగా ఉంది

ఆ పువ్వుకు ఏ అలంకరణతో అంత అందం వచ్చింది?

'లవ్లీ' అన్న పదం అతని నోటి నుండి అప్రయత్నంగా వచ్చింది.

ఆ మాటలకు అర్థం ఆమెకు తెలియలేదు గానీ, అతని కళ్ళలోని మెప్పుదలను స్పష్టంగా చూచింది.

'లవ్లీ' అంటే ఏమిటి మామయ్యా!' అంది కప్పును అతని చేతికిస్తూ

ఆమె ప్రశ్న అతన్ని ఈ లోకంలోనికి తీసుకుని వచ్చింది.

వెంటనే అతనికేదో స్ఫురించింది. సాలోచనగా ఆమెకేసి చూస్తూ కూర్చున్నాడే కాని బదులివ్వలేదు

హఠాత్తుగా అంత ఆలోచన ఏమిటో, ఎందుకో తెలియని ప్రభాత అతని ఆలోచనలకు అతన్ని వదలి వెనుదిరిగింది అయితే అమాయకంగా తనడిగిన ప్రశ్న అతనిలో క్రొత్త ఊహలను, పథకాలను రేకెత్తించిందని ఆమెకు తెలియదు.

ఒక రోజంతా ఆలోచించిన అతడు ఒక స్థిర నిర్ణయానికి వచ్చాడు రాత్రి భోజన సమయంలో అడిగాడు

'ప్రభాతా! ఎంత వరకూ చదువుకున్నావు?'

అనుకోని ఈ ప్రశ్నకు ఆమె తెల్లబోయింది మొదటిసారిగా చదువుకోనందుకు సిగ్గుపడింది.

'ఏడు' అంది బెరుగ్గా

'పాసయ్యావా?'

అయినట్లు తల ఊపింది. ఆమెకు అన్నంలో పలకు వెళ్ళడంలేదు

'మరెందుకు మానేశావు?'

కళ్ళతోనే ప్రశ్నించాడు

అతడలా సూటిగా చూస్తుంటే ప్రభాత ఏదో నేరం చేసినట్లు తలదించుకుంది

'ఎనిమిది తప్పాను.'

"వ్వాట్? సెవెంత్ పాస్ అయి, ఎయిత్ ఫెయిల్ అయావా? ఆశ్చర్యంగా ఉందే. అందరూ సెవెంత్‌లోనే కుర్చుంటారు మీ స్కూల్ వాళ్ళు నిన్ను ప్రమోట్ చేయలేదా?"

తల అడ్డంగా ఊపి గటగట మంచినీళ్ళు తాగింది

'తప్పినంత మాత్రాన ఎందుకు మానేసావు?"

'ఊ?'

'రెం– రెండుసార్లు తప్పాను !'

ఈ సారి ఆమెకు పాలమారింది.

'అక్కయ్య మాన్పించిందా?'

కాదన్నట్లు తల ఊపింది.

"సరే! యిప్పుడు స్కూలుకు వెళతావా?"

'..... .'

ఆ సంభాషణలో యింత వరకూ జోక్యం చేసుకోని వాళ్ళంతా అతని ప్రశ్నకు విస్తుపోయారు

"వాడికెందుకీ ఊహ కలిగింది?' అనుకుంది ప్రభావతమ్మ.

"ఇప్పుడా అమ్మాయి స్కూలుకేమి వెళుతుంది?" అన్నారు రామస్వామిగారు.

ఆయన మాటను పట్టించుకోకుండా "చెప్పు" అన్నాడు

రామస్వామిగారు కలిగించిన ఆసరాతో తలకాయ అడ్డంగా ఊపింది.

రాధ నవ్వేసింది– రామస్వామిగారు భార్యను క్రీగంట గమనించారు. ఆమె మతిపోయినట్లు కూర్చుని ఉంది

ఇంట్లో అందరూ ఆ విషయాన్ని అంత సీరియస్‌గా ఎందుకు తీసుకున్నారో, ఎందుకు మతులు పోగొట్టుకుంటున్నారో ఆలోచించలేదు కృష్ణచైతన్య.

'పోనీ! ట్యుటోరియల్ కాలేజీలో చేరి ప్రైవేటుగా రాయి. అక్కడకు అందరూ పెద్దవాళ్లే వస్తారు" అన్నాడు అనునయిస్తున్నట్లు

'ఊహు!' అంటూ భోజనం ముగించి ప్లేట్ తీసికుని గబగబా కిచెన్‌లోకి వెళ్ళి పోయింది

'నీకేమిటన్నయ్యా! మరీ యింత యింటరెస్ట్?' అంది రాధ. కాజువల్‌గా! అయినా చెల్లెలి కంఠం అదోలా విన్పించింది అతనికి.

'అంత పట్టుదల నీకేమిటోయ్?' అన్నారు రామస్వామిగారు.

ప్రభావతమ్మ ఏమీ అనలేదుగాని అదోలా చూచి ఊరుకుంది

**జరిగిన కథ – 6 :** రామస్వామి, ప్రభావతమ్మల దంపతుల పెద్ద కొడుకు కృష్ణ చైతన్య అక్క కూతురు రాజ్యలక్ష్మికి సీరియస్‌గా ఉందని తెలిసిన ప్రభావతమ్మ ఆమెను చూసిర్తాను వెళ్ళింది. ఆమెకు గతం గుర్తు రాసాగింది ప్రభావతమ్మ వెళ్ళేటప్పటికి రాజ్యం స్థితి చాలా దీనంగా ఉంది. భర్తపోయిన రాజ్యంను ఆ స్థితిలో చూచేటప్పటికి ప్రభావతమ్మకు ఆపుకోలేని దుఃఖం వచ్చింది రాజ్యలక్ష్మి కూతురు ప్రభాత. రాజ్యలక్ష్మి మరణించింది. ప్రభాతను తీసుకొని ప్రభావతమ్మ తన ఇంటికి వచ్చేసింది. రామస్వామిగారు ప్రభాతను తమ ఇట్లో కొన్ని రోజులు ఉంచుకోడానికి అంగీకరిస్తారు ప్రభావతమ్మ రెండవ కూతురు రాధను ప్రభాత తన రూములో ఉండటం ఇబ్బంది పెట్టింది. ప్రభావతమ్మ పెద్ద కూతురు జయశ్రీ పండక్కి వచ్చింది. ఆమె తమ ఇంట్లో ఉన్న ప్రభాతను పనిపిల్ల అనుకోవడం కృష్ణ చైతన్యకు కోపం తెప్పించింది కృష్ణ చైతన్య తన యందు శ్రద్ధ చూపటం ప్రభాతకు ఆనందం కలిగించింది.

కృష్ణచైతన్యకు చిర్రెత్తుకొచ్చింది ఎవర్నీ ఏమీ అనలేకపోయాడు తన యింట్రస్ట్ యిదీ అని జవాబు యివ్వలేక పోయినందుకు తన మీద తనకే చిరాకేసింది

ఆ కోపాన్ని మరోలా ప్రదర్శించాడు "మనమేదో అందలం ఎక్కిద్దాం అనుకున్నంత మాత్రాన అవతలివారికి ఆ అర్హత ఉండొద్దూ!" అన్నాడు చికాకుగా

అప్పుడే వాష్ బేసిన్ వద్ద చెయ్యి కడుక్కుని తడిచేతులు నాప్‌కిన్‌తో తుడుచుకుంటూ వస్తున్న ప్రభాత ఒక్క క్షణం అలాగే నిలబడి పోయింది వేటగాడి బాణం తగిలిన లేడిలా ఆమె మనసు గిలగిల కొట్టుకుంది. బాధను దాచుకోలేని కన్నులు రెపరెప లాడాయి మరుక్షణం నేప్‌కిన్ హోల్డర్‌లో పెట్టి గబగబా తన గదిలోకి వెళ్ళి పోయింది వెళ్ళిపోతున్న ఆమెను కన్నార్పకుండా చూసాడు కృష్ణచైతన్య

వెనక్కు పిలవాలన్న కోరికను కష్టం మీద నిగ్రహించుకున్నాడు

కొడుకు కోపతాపాలను కనిపెడ్తూనే ఏమి ఎరుగనట్లు టాపిక్‌ను మరోదారి పట్టించారు రామస్వామిగారు ఆ రోజు బాగా ప్రొద్దు పోయే వరకూ కబుర్లు చెప్పుకున్నారు ముందు రాధ లేచింది ఆవులిస్తూ

రామస్వామిగారు లేచి పడుకోడానికి వెళ్ళిన అర్ధగంటకుగానీ ప్రభావతమ్మ కదలలేదు అప్పటికి ఆయన నిద్రపోయి ఉండాలని ఆమెకు నమ్మకము ఆమె కోరికాను ఆపూట ఆయనతో ప్రైవేట్‌గా మాట్లాడటానికి ఆమె భయపడటానికి తగినంత కారణం ఉంది.

తల్లికూడా పడుకున్నాక నిద్రపట్టని కృష్ణచైతన్యకు ఏమి చేయాలో తోచలేదు. ఎప్పటిలా ఆ రోజు చదువుకునే మూడ్‌లో లేదు. పైగా సగం రాత్రి గడిచి పోయింది. పైకి మామూలుగా ఉన్న అతని మనో చక్షువులకు ప్రభాత దెబ్బతిన్న చూపులే వెంటాడి వేధిస్తున్నాయి అప్రయత్నంగానే అతని కాళ్ళు లైబ్రరీ రూమ్‌లోకి దారితీసాయి

గదిలో లైట్ వెలుగుతూ ఉంది అతను వచ్చి చదువుకుంటాడనుకున్న ప్రభాత లైట్ తీయలేదు ఆమె నిద్ర పోయేప్పుడు అతనా గదిలో ఉన్న మైన్‌లైట్ తీసి టేబిల్‌లైట్ వేసికుంటాడు వేళ్ళబోయే ముందు టేబిల్‌లైట్ ఆఫ్‌చేసి బెడ్‌లైట్ వేస్తాడు అమాయకంగా నిద్రిస్తున్న ఆమెను తలుపువద్ద నుండ ఒక్కసారి చూచి వెళ్ళడం అతని అలవాటు



# మౌన విపంచి

ఈసారి దూరం నించి కాకుండా ఆమెకు దగ్గరగా వెళ్ళాడు. ఆమె వదనం ఎప్పటిలా నిర్మలంగా నిశ్చింతగాలేదు. నిద్రిస్తున్న ఆమెలో కలిగిన బాధా చ్ఛాయలు ఆ మోములో స్పష్టంగా అగుపిస్తున్నాయి. కలత నిద్రలో ఉన్న ఆమె కన్నులు వాచిఉన్నాయి. నున్నగా ఉన్న గుండ్రని బుగ్గల మీద కన్నీటి చారికలు అతన్ని హేళనగా పలుకరించాయి.

ఆమెనులేపి, హృదయానికి హత్తుకుని లాలించాలన్న కాంక్ష అతనిలో బలీయంగా పెరిగి పోతోంది. చెయ్యి చాచి ఆమె తల నిమిరాడు. నిద్రావస్థలో ఉన్నప్పటికీ ఆమె హృదయం అతని లాలనను గ్రహించింది. నిశ్చింతగా గాఢ నిద్రలోకి ఒరిగి పోయింది.

అయిష్టంగా, నెమ్మదిగా అక్కడి నుండి వెళ్లాడు చైతన్య. మరో నాలుగు-రోజులు మామూలుగా గడిచాయి. ఆ సాయంత్రం యూనివర్శిటీ నుండి వచ్చి రిలాక్స్ అయి, డాబా మీదకు వెళ్ళాడు పూల మొక్కల వద్దకు. వాటికేవో ఎరువులు పెడుతుంటే ప్రభాత ప్రక్కనే నిల్చుని సహాయం చేస్తోంది.

అందమైన ప్రకృతిని గూర్చి అందులో భాగమైన చెట్ల యొక్క అందాలను వర్ణించి చెప్తున్న కృష్ణచైతన్య హఠాత్తుగా "నువ్వెందుకు చదువుకోకూడదు?" అన్నాడు.

ఈసారి ఆమె చేష్టలుడిగి నిల్చోలేదు. అప్పటికే ఆ విషయంలో ఆమె ఒక నిర్ణయానికి వచ్చింది వీలు చూసుకుని తనే ఆ నిర్ణయం మామయ్యకు చెప్పాలి అనుకుంది.

"నాకు బయటకు వెళ్లి చదువుకోవాలంటే భయం మామయ్యా!" అతి నెమ్మదిగా అంది."

"భయం ఎందుకు? ట్యుటోరియల్ కాలేజీకు అమ్మ వయసున్న వాళ్ళు కూడా వస్తారు.

ఆమె మౌనం వహించింది. ఆమె భయంవేరు. ఆమె సిటీకి క్రొత్త, పల్లె నుండి వచ్చింది. ఆమె వేష భాషలు వేరు.– పద్ధతులు వేరు కాని అదే విషయాన్ని ఆమెపైకి చెప్పలేక పోయింది

కృష్ణచైతన్యకు ఆమె సంకోచం ఏమిటో తెలియలేదు తెలిస్తే తేలిగ్గా కొట్టి పారేస్తాడు.

'పోనీ... నేను చెప్తాను. చదువుకుంటావా?"

ఆమెకు కలో, నిజమో ఒక్క క్షణం అర్థంకాలేదు.

'మామయ్య– తను అపురూపంగా భావించి, ఆరాధించే మామయ్య-- యూనివర్శిటీలో ఎం. ఎ. స్టూడెంట్సుకు ఇంగ్లీషు సాహిత్యం బోధించే మామయ్య వివిధ రంగాల్లోని వ్యక్తులతో పరిచయం కలిగి యింటా బయటా యెప్పుడూ బిజీగా ఉంటూ అందరిచేత గౌరవించబడే మామయ్య– తనలాంటి ఈ ప్రపంచంలో ఎందుకూ పనికిరాని, ఎవ్వరికీ అక్కర్లేని ఒకానొక అతి సాధారణ వ్యక్తికి పాఠాలు చెప్తూ తన సమయాన్ని వెచ్చిస్తారా?'

"నిజమేనా? ఎగతాళి చేస్తున్నావా?" అనుమానంగా చూచింది.

"ఎగతాళికాదు నిజమే" అతనిముఖం ఎంతో సిన్సియర్‌గా ఉంది.

అంగీకారంగా తల ఊపింది.

"మెట్రిక్ వ్రాస్తావా?"

"అమ్మో!"

'చాల తేలిక. సిలబస్ తీసుకు వస్తాను. ఈ లోపు స్టాండర్డ్ ఎలా ఉందో చూద్దాం. నీకు తేలిగ్గా ఉంటే ఈ సంవత్సరమే వ్రాయి. లేకుంటే వచ్చే సంవత్సరం వ్రాయవచ్చును, అతని ఉత్సాహం చూస్తుంటే. ఆమెకు బెంగగా వుంది. తాను అతని పరిధికి ఎన్నడైనా చేరగలదా?, అతను అన్న అర్హతను పొందగలదా?

ఆ రోజే కృష్ణచైతన్య ఆమెకో చిన్న పరీక్ష పెట్టాడు.

"నీకేం భయంలేదు. ఈ ఏడాది నీచేత మెట్రిక్ పాస్ చేయించి వచ్చే సంవత్సరం కాలేజీకి పంపకపోతే నా పేరు మార్చు" అన్నాడు









'నీ కిష్టమైన పేరు వేరే ఉందా మామయ్యా' చిలిపిగా అడిగింది.

ఆమె చిలిపితనానికి హాయిగా, మనసారా నవ్వుకున్నాడు. 'అదీ, అలా చలాకీగా ఉండాలి. బిడియం వదిలేసి ధైర్యంగా మసలాలి" అన్నాడు.

డాబామీద తీసికొన్న నిర్ణయం గూర్చి, లైబ్రరీ గదిలో సాగుతున్న చదువుల గురించీ ఆ యింట్లో ఎవ్వరికీ వెంటనే తెలియలేదు.

నాలుగు రోజులు పోయాక కృష్ణచైతన్య 'సిలబస్ బుక్‌తో పాటు టెక్స్ట్‌బుక్స్ కూడా తెచ్చి లైబ్రరీలో పెడుతూంటే చూచి; వాడేవో పుస్తకాలు తెచ్చుకున్నట్టున్నాడు' అనుకుంది ప్రభావతమ్మ.

ఆ రోజు పాఠాలు మొదలు పెట్టడానికి రాత్రి అయే వరకూ సాధ్యం-కాలేదు. నిద్రపోవడానికి ఉపక్రమిస్తున్న ప్రభాత కృష్ణచైతన్య పుస్తకాలు తీసి ఒక్కొక్కటి యిస్తుంటే విస్తుపోయి–

'ఎప్పుడు తెచ్చావు?' అంది.

'సాయంత్రం. కాని యిప్పటి వరకూ గుర్తులేదు. ఈ గదిలోకి వచ్చి టేబిల్‌మీద ఈ బుక్స్ చూస్తేగాని జ్ఞప్తికి రాలేదు. రా వచ్చి కూర్చో. ఈ రోజుకు ఒక ఇంగ్లీషు పద్యం చెప్పి ముగిస్తాను.' అన్నాడు.

ప్రభాత మారు మాట్లాడకుండా లేచి వచ్చింది. కృష్ణచైతన్య మధురమైన స్వరంతో మృదువుగా ఆ పద్యాన్ని గానం చేస్తున్నట్టు చదివి వినిపిస్తుంటే ఆమె సంభ్రమాశ్చర్యాలతో విన్నది.

మామయ్య విద్యార్థులెంత అదృష్టవంతులో– రోజూ మామయ్య యిలా చెబుతూ ఉంటే వినడానికి ఎంత పుణ్యం చేసికోవాలి–అన్పించింది.

పద్యాన్ని ఒకటికి రెండుసార్లు విన్పించాడు. తెలియని మాటలన్నింటికీ అర్థాలు చెప్పి వ్రాసుకోమన్నాడు. ఆమెచేత పద్యాన్ని రెండుసార్లు చదివించాడు. ఉచ్చరణకు కష్టంగా ఉన్న మాటలను డ్రిల్ చేయించాడు. 'రేపు ప్రొద్దున లేవగానే ఈ అర్థాలు నేర్చుకో. పద్యం కంఠతాపట్టు' అని ఆ రోజుకు ముగించాడు.

అతడు లైట్‌తీసి బెడ్‌లైట్ వేస్తుంటే చూస్తూ కూర్చున్న ప్రభాత అతను వెళ్లగానే టేబిల్ లైట్ వేసుకుంది. మొదటిసారిగా, ధైర్యంగా అతను రోజూ కూర్చునే కుర్చీలో కూర్చుని అప్పుడే మూసేసిన పుస్తకం తెరిచింది.

ఆమెలో ఏదో నూతన చైతన్యం ఆవరించింది. భవిష్యత్ పట్ల అందమైన నమ్మకాలు ఏర్పడ్డాయి. మరునాడు ప్రొద్దునే ప్రభావతమ్మతో "అమ్మమ్మ! నేను చదువుకుంటాను. మామయ్య పుస్తకాలు తెచ్చిచ్చారు." అంది ఎంతో ఆనందంగా.

ప్రభావతమ్మ కళ్లల్లో రాజ్యలక్ష్మి మెదిలింది. ఇలాగే తన తల్లిని రాజ్యం కూడా ప్రాధేయపడింది.

చర్విత చర్వణం కాబోతూందా! ఏమి జరగనున్నది కుటుంబ విషయాలన్నీ తనతో చర్చించే కృష్ణ ఈ విషయం ఎందుకు దాటవేశాడు? అసలు అతని అంతర్యం ఏమిటి?

ఆమెకు ఆలోచించిన కొద్దీ అనుమానాలు అధికం అవుతున్నాయి.

దీక్షగా మనుమరాలికేసి చూస్తూ, నీ యిష్టం. నాకు చెప్పాల్సిన అవసరం ఏముంది?" ఎంత వద్దనుకున్నా నిష్ఠూరం ఆమె కంఠంలో ప్రతిధ్వనించింది.

ఆ కంఠ ధ్వనికి బిత్తర పోయింది ప్రభాత.

అమ్మమ్మ యిష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించడం దోషమని ఆమెకు తెలుసు.

"రోజంతా ఖాళీగా ఉంటే విసుగ్గాఉంది. ఏమి తోచడంలేదు."– ప్రభాత.

'మీ ఊర్లో ఏం చేసేదానివి?'

"ఊర్లో అయితే యిరుగు పొరుగుతో ఆటలు, కబుర్లు ఉంటాయి."

అదీ నిజమే. అక్కడిలా యిల్లిల్లూ తిరిగి కాలక్షేపం చేయడం యిక్కడ వీలుకాదు.

'నువ్వు వద్దంటే మానేస్తాను.'

నిర్ణయాన్ని ప్రకటించినప్పటికీ ఆమె కన్నులు అంగీకరించమని వేడుకుంటున్నాయి.

ప్రభావతమ్మ కళ్ల ముందు రాజ్యలక్ష్మి మెరిసింది. అప్పుడు తల్లిని పోగొట్టు కున్న రోజుల్లో ఆమెకూడా యిలాగే అందరి ఇష్టాలకూ తలఒగ్గి బ్రతికేది. ఆ బ్రతుకు మీద విరక్తిపుట్టి తన మార్గం తాను చూచుకుని కష్టాలనీ, కన్నీళ్లని దిగమ్రింగి బ్రతికింది. చివరకు అలాగే కూలిపోయింది. ప్రభావతమ్మ యిప్పటికీ ఆ నాడు రాజ్యాన్ని తనతో తీసుకొని రాకపోవడాన్ని కారంగానే పరిగణిస్తుంది. ఆ రోజుల్లో రాజ్యం పడిన మూగవేదనను ఆమె ప్రత్యక్షంగా చూడక పోయినా అర్థం చేసుకో గల్గింది. అందుకే రాజ్యం జ్ఞాపకాలు ఆమెను బాధిస్తాయి.

ఇప్పుడు....

రాజ్యం కూతరు ప్రభాత-

ఉహుఁ వీల్లేదు. ప్రభాత తన తల్లిలా నలిగిపోకూడదు. ఈ ప్రపంచంలో ఆత్మ విశ్వాసంతో దర్జాగా బ్రతకాలి. అప్పుడుగానీ రాజాన్ని నిర్లక్ష్య పరచిన తన తప్పుకు ప్రాయశ్చిత్తం జరగదు.

'నువ్వు చదువుకుంటానంటే నేనెందుకు కాదంటాను?' అంది సౌమ్యంగా.

ప్రభాత చదువుకుంటుందన్న వార్త రామూకు ఆశ్చర్యంగా ఉంది. వాడు యిందాకట్నించీ వీళ్ల సంభాషణ వింటున్నాడు. అమ్మగారు పచ్చజెండా ఊపడంతో వాడికి ఎక్కడ లేని సంతోషం కలిగింది. నిద్ర లేచి వస్తున్నా ఒక్కొక్కరికీ ఈ వార్త సంబరంగా చెప్పాడు.

నిజానికి వాడు సంతోషించినంతగా మరెవ్వరూ సంతోషించలేదు. రామస్వామిగారికి ప్రభాత అంటే అయిష్టం ఏమీలేదు. ఆమె అంటే జాలీ, దయా

# వనసీమ

అందము చిందే వనము లుండగా
డెందము కలచే నగరా లెందుకు?
అటవీ సీమల నడుగిడగానే
ఆదరమెంతో నగపడు నీకు
చల్లని మెల్లని పిల్లవాయువులు
చందన చర్చలు సలుపును నీకు
కోమల వల్లులు కుసుమాక్షతలను
కోకొల్లలుగా చల్లును నీపై
ఝరిసీమంతిని చల్లని జలమును
పాద్యమ్మొసగును భక్తిన్నీకు
మల్లీభామిని మంచి గంధమును
ఉల్లము ఝల్లన చల్లును నీపై
మందారాంగన మధు భాండమ్మును
పొందు పరచుగా విందుగ నీకై
రసమయ ముద్రల రమణీయముగా
అన్నుగ నెమ్మిల ఆడును నీకై
పంచమ సుశ్రుతి పారవశ్యమున
కోడె కోయిలలు పాడును నీకై
పవ్వళించుటకు క్రొవ్విరి పాన్పులు
పారిజాతములు పరచును నీకై
అందము చిందే వనములుండగా
డెందము కలచే నగరా లెందుకు?

— కనమలూరు వెంకట శివయ్య

# మౌన విపంచి

ఉన్నాయి. ఆమె చదువుకోవడం ఆయనకు సంతోషమే. ఏది ఎలా ఉన్నా చదువుకుంటే ఆమెకో జీవనాధారం చూపించవచ్చు. కానీ ఆమె చదువుకు కృష్ణచైతన్య ప్రోద్బలమే ఆయనకు నచ్చలేదు. ఆ ప్రోద్బలం వెనుక సంస్క-రించాలన్న ధ్యాస గాక, మరేదో యింటరెస్ట్ ఉందేమోనని ఆయనకు అనుమానం.

ఆ రోజు సాయంత్రం సమావేశంలో ఆయన కృష్ణ చైతన్యను 'బెర్నార్డ్ షా వ్రాసిన 'పిగ్ మాలియన్' నాటకం గుర్తుందా నీకు?' అని అడిగారు.

కృష్ణ చైతన్య తండ్రి ఉద్దేశ్యం చప్పున గ్రహించాడు. గుర్తుందన్నట్టు తల ఊపాడు.

'కథలో చదవడానికి ఎంతో ఆసక్తిగా ఉన్నా విషయాలు ఆ పాత్రల సంఘర్షణ నిజ జీవితంలో దుర్భరంగా ఉంటాయి' అన్నారు

'కథలు జీవితంలో నుండి పుట్టినవేను జీవితంలోని వ్యక్తులే కొద్ది మార్పులతో కథల్లో, నాటకాల్లో పాత్రలుగా మారిపోతారు జీవితంలోని కొన్ని భాగాలను, కొన్ని కోణాలనుండి తర్కించి కథలుగా మలుస్తాము" చైతన్య. అసలు విషయాన్ని గ్రహించి కూడా అతను దాట వేస్తున్నాడనీ, విషయాన్ని సాహిత్య గోష్ఠిలోకి దింపి తనను మరపింపజేయబోతున్నాడని రామస్వామిగారు చప్పున గ్రహించారు. ఆ రాత్రి ప్రభావతమ్మ భర్తను తప్పించుకోలేకపోయింది మునుపటిలా-

'ఇప్పుడేమంటావు?' అడిగారు ఆయన.

ప్రభావతమ్మ మాట్లాడలేదు

'ఆ పిల్ల చిన్న పిల్ల, పసి పిల్ల అన్నావు'

'ఆ పిల్ల చిన్న పిల్లేను అయితే నా కొడుకు ఎదిగిన వ్యక్తి '- ఆమె

'నీ కొడుకులో మార్పేగాని ఆ పిల్ల కళ్లల్లో వాడి పట్ల ఆరాధన నీవెప్పుడూ గుర్తించలేదా?'

'చిన్న పిల్ల వాడు దాని బాగోగులు చూస్తున్నాడు అందుకే కృతజ్ఞత' అంది.

ఆమె ఆయన మాటకు మాట జవాబిస్తోందిగాని ఆమె మనసు మారు మూలల్లో ఆయన అనుమానం నిజం అన్న నమ్మకం లేకపోలేదు

జయశ్రీతో ప్రభాత ప్రయాణాన్ని ఆపు చేయించిననాడే ఆయన తన ఉద్దేశ్యాన్ని వెల్లడించారు

అప్పుడు ఆయనలా అంటుంటే ప్రభావతమ్మ కోపగించుకుంది 'వాడి మనసే అంత. ఈ రోజు మీకు క్రొత్తగా కనిపిస్తున్నాడా?' అని నిలదీసింది

'నిజమే కృష్ణ చైతన్య తీరే అంత. అందర్నీ గుర్తిస్తాడు, గౌరవిస్తాడు, ఆదరిస్తాడు అతని సహజ స్వభావంతోనే ప్రభాతను ఆదరించాడు. కానీ ఆ ఆదరణ వెనుక వేరే ఆలోచనలున్నాయని ఆయనకు మొదటినుండే అనిపిస్తున్నా ప్రభావతమ్మ తేలిగ్గాకొట్టిపారేసింది

"వాడి వయసేమిటి? దీని వయసేమిటి? మరీ చిన్న పిల్ల ఇద్దరకు పధ్నాలుగేళ్లయినా వ్యత్యాసం ఉంది" అంది.

ఒక్కోసారి ఆ వ్యత్యాసమే ఆకర్షణకు దారి తీస్తుందని తన భార్యకు తెలియనందుకు సణుక్కున్నారు రామస్వామి ఎన్నో గంటల వాగ్వివాదం తరువాత చివరిసారిగా హెచ్చరించారాయన. "నీకు ముందే చెప్తున్నాను. ఆ అమ్మాయిని వేరే విధంగా సెటిల్ చెయ్యి. తర్వాత అనుకోని విధంగా పరిణమించితే సహించను." అని.

అలా జరగదు అని ఆమె ఆ రోజున నమ్మినప్పటికీ అదే నమ్మిక ఆమెకిప్పుడు లేదు.

ఆమెకు రాజ్యం అంటే వల్లమాలిన ప్రేమ. పూర్వ సాన్నిహిత్యం లేక పోయినప్పటికీ ప్రభాతను చూడగానే మనుమరాలిగా స్వీకరించింది ఆమెకో చక్కని భవిష్యత్తును ఏర్పాటు చేయాలని నిశ్చయించుకుంది. అయితే ఆ భవిష్యత్తు తన కొడుకుతో ముడి పడటం ఆమెకు సతరమూ యిష్టం లేదు ఆమె రాబోయే కోడల్ని గురించి ఎన్నెన్నో ఊహించుకుంది. సంపన్నమైన, సాంప్ర-దాయక కుటుంబం నుండి వచ్చిన విద్యావంతురాలైన సౌందర్యవతి కృష్ణ ప్రక్కన నిలబడాలి.

ఆమెలో నిక్షిప్తమై ఉన్న ఈ ఆశలకు అఘాతం తగిలితే ఆమె సహించలేదు.

అందుకే ఆమెలో సంఘర్షణ ప్రారంభమైంది. ఒక్కొక్కసారి, ఇదంతా నా ఊహ, భ్రమ. వాడి తీరే అంత" అని సర్ది చెప్పుకుంటుంది.

ఆమె సంఘర్షణను తీవ్రం చేసే సంఘటన దీపావళి ముందు జరిగింది..... .

**(ఇంకా ఉంది)**

# మంటలు రేపిన నెలరాజు

బులుసు
వెంకటేశ్వర్లు

ప్రతీ ఆదివారం ఉదయం పది పదకొండు గంటల మధ్య మా ఆవిడ అంటూ ఉంటుంది కొంచెం వేళాకోళంగా "అదిగో! మీ ఫ్రెండ్ వచ్చాడు!" అని! వెంటనే నేను అరుగుమీది కెళ్ళి, గేటులో నిలబడ్డ "నా ఫ్రెండ్"ని రమ్మని చెయ్యూపుతాను!

"నమస్కారం బాబూ!" అంటూ వచ్చి మెట్లమీద కూర్చుంటాడు వాడు!

"నా ఫ్రెండ్" పేరు రాజు! వయస్సు సుమారు పదిహేనేళ్ళుంటాయ్! ఇంటింటికీ తిరిగి పాటలు పాడి బతుకుతూ ఉంటాడు!

నాకు పాటలంటే చాలా ఇష్టం! కానీ పెద్దగా పాడ్డం చేతకాదు ఏదో బాత్‌రూం కూని రాగాలు తప్ప! రాజుగాడు వచ్చిన రోజు నాకు పండగే! నాకు ఇష్టం అయిన పాటలన్నీ అడిగి పాడించుకుంటాను! వాడేవీ పెద్ద ఘంటసాలా, బాలసుబ్రహ్మణ్యంలాగా పాడక పోవచ్చు! సినిమా పాటలే 'డక్కి' మోగిస్తూ వాడు పాడుతూ ఉంటే, మనస్సు ఎంత తేలిక పడుతుందో - చెప్పలేను!

రాజుగాడు చాలా తెలివైన వాడు! బహుశా ఇల్లాంటి జీవన పోరాటాల వల్లే వీళ్ళకి వరుసుకి మించిన తెలివి తేటలు వస్తాయనుకొంటాను! బస్టాండ్‌లో అయితే ఎన్. టి ఆర్ పాటలూ, కాలేజీ దగ్గఱ ఎ ఎన్. ఆర్ పాటలూ, కొంచెం వయసు మళ్ళిన శ్రోతల దగ్గఱ భక్తి గీతాలూ పాడితే డబ్బులు బాగా రాల్తాయని వాడే చెప్పాడు ఓసారి!

నా కిష్టమైన పాటలు వాడు గ్రహించి పాడి చివరగా అడుగుతాడు!

"బాబూ! ఇంకేమైనా పాడమంటారా!"

"చాల్లేరా! ఇంక చాల్లే" అని జేబులోంచి రెండు మూడు రూపాయలు తీసి వాడి చేతిలో పెడతాను!

అప్పుడు మొదలు పెడతాడు ఆఖరి పాట - నాకు నచ్చిన పాట - డక్కిని మంద్రంగా వాయిస్తూ -




"మంటలు రేపే నెలరాజా! ఈ ఒంటరి బ్రతుకూ నీ కేలా??"

కమ్మగా సాగిపోతున్న వాడి కంఠస్వరంలో - ఏదో - బహుశః పూర్వ జన్మానుబంధమైనది - ఏమో! తియ్యని వేదన! పురి విప్పినట్లు తొంగి

చూస్తుంటుంది! నా హృదయంలో సంతోషం – దుఃఖం పెన వేసుకుని గొంతు గద్గదం చేస్తాయ్!

ఆ పాటలో నే –

"సుఖమూ, శాంతీ, ఆనందం, నా నుదుట రాయుటే మరిచాడూ....."

అని వాడు పాడుతుంటే – ఓహ్! హృదయభారం తగ్గించుకొందుకు కరువుతీరా ఏడుద్దామా అన్నంత ఉద్వేగంగా ఉంటుంది నాకు! ఎందుకు? ఏమో తెలియదు??

పాట పూర్తి చేసి, నిశ్శబ్ద గంభీరంలో నన్ను దిగవిడిచి మెల్లగా వెళ్ళిపోతాడు రాజు కాదు..... కాదు.... నెలరాజు!!

నాల్గు మూడేళ్ళ క్రితం!

శ్రీమతి పురుడు పోసుకుందుకు పుట్టింటికి వెళ్ళగా, ఏమీ తోచక ఇంట్లోనే ఉన్నాను ఓ ఆదివారం!

వీడు.... ఈ రాజుగాడు వచ్చాడు ఏదో పాట పాడుతూ మా యింటికి!

అప్పటికి బాగా కుర్రాడు! చిన్న గోచీ తప్ప ఒంటిమీద నూలుపోగు లేదు రాజుగాడికి! అర్భకంగా ఎముకలు కనిపిస్తూ శవంలా ఉన్నాడప్పుడు! అయితేనేం? కంచు కంఠం!! నాకు చాలా ముచ్చటేసింది!! నాల్గు పాటలూ పాడించి ఓ రూపాయ్ ఇచ్చి పొమ్మన్నాను!! అది మొదలు ప్రతీ ఆదివారం మా ఇంటికి వచ్చి నాల్గు పాటలు పాడి

## మంటలు రేపిన నెలరాజు

వెళుతూ ఉంటాడు! ఈ నాల్గు అయిదు ఏళ్ళలో రాజుగాడిలో బాగా మార్పు వచ్చింది!!

మనిషి సోగగా తయారయ్యాడు! చిన్నప్పుడు పాలిపోయినట్టుండే ఒళ్ళు రంగు తిరిగింది! అంతేకాదు! వయసుతో పాటు వాడి కంఠం కూడా సాఫుగా తయారైయింది!

నా శ్రీమతికి మ్యూహాళ్ళంటే అసహ్యం! అంతే గాదు! భయం కూడాను!! పగలు ముష్టి ఎత్తుకోడానికి వచ్చినట్టుగా

వచ్చి ఇళ్ళ ఆనూ పానూ కనిపెట్టి రాత్రిళ్ళు దొంగతనం చేస్తారట వాళ్ళు! మహా నగరంలో పుట్టి పెరిగిందేమో కదిపితే చాలు ఇలాంటి ఉదాహరణలు చాల ఇస్తుంది!

నేను రాజుగాణ్ణి అభిమానించడం ఆమెకు సుతరామూ ఇష్టం లేదు! అయితే వాడి 'గొంతు'ను ఆమె మాత్రం కాదనదు!

రాజుగాడికి వాడి అమ్మా, నాన్న ఎవరో తెలియదట! ఎవరో కని రోడ్డు పక్క పడేస్తే ఓ బిచ్చకత్తె చేరదీసి పెంచింది! ఏడెనిమిది ఏళ్ళు వీడికి వచ్చేటప్పటికి ఆ ముసిల్ది కూడా గుటుక్కుమంది! అప్పట్నించీ ఇలా పాటలు పాడుకుంటూ రైలు స్టేషన్లో రాత్రి పడుకుంటూ కాలం గడపుతున్నాడు రాజుగాడు!!

నేననుకుంటూ ఉంటాను!

"రాజుగాణ్ణి తయారు చేసేటప్పుడు దేవుడు ఏదో చిరాకులో ఉండి ఉంటాడు! అందుకే వాడి నుదుట్ని సుఖమూ, శాంతీ, ఆనందం రాయడం మరిచిపోయేడేమో!!"

ఇంకా వాడిలో నాకు నచ్చిన విషయం ఏమంటే.....

వినయం! నిజాయితీ.....

బజారులో ఎప్పుడైనా కనబడితే ఓ రూపాయ్ ఇద్దామంటే పుచ్చుకోడు!

"ఎందుకు బాబూ! మళ్ళా ఆదివారం తమ దగ్గఱకొచ్చి పాడతాను! అప్పు డిద్దురుగాని.... అంటాడు! యాచనలో కూడా నిజాయితీ!!

"ఆ సంచీ ఇటివ్వండి బాబూ! నేను పట్టుకొత్తాను!!"

"పర్వాలేదు లేరా!!" అంటాను సంకోచంగా!

"బాబూ! మీరే చెప్పారోసారి! దేవుడికి ఏ కులవూ లేదని! నాకూ ఏ కులవూ లేదు బాబూ!"

అమ్మా నాన్నా ఎవరో తెలియదనే బాధని నవ్వుతూ అలా వ్యక్తీకరించాడు వాడు!

"అబ్బే! అందుగ్గాదురా!! నాల్గు ఇళ్ళు తిరిగితే నీకు...."

నేను అనే లోపలే చొరవగా నా చేతి సంచీ లాక్కున్నాడు వాడు!!

ఇంట్లో సంచీ పెట్టి పరుగెత్తుకు

పోయాడు!నిలబడితే ఏమైనా కొనుక్కోమని డబ్బులిస్తానన్న భయంతో అనుకుంటాను!

ఆ రోజు, కూరలు వాడిచేత తెప్పించినందుకు నా శ్రీమతికి ఎంతకోపం వచ్చిందో చెప్పలేను! కూరలయిపోయేదాకా నాతో మాట్లాడలేదు! మళ్ళీ ఆదివారం నా దగ్గరికి వచ్చాడు" కొత్త బట్టలు కట్టుకుని!

'ఏరా! ఏంటి హుషారుగా ఉన్నావ్!"

'ఏం కాదు! బాబూ! తమరు అప్పుడప్పుడిచ్చే డబ్బులు జాగ్రత్తపెట్టి చొక్కాలాగూ కుట్టించుకున్నాను!"

ఓ! దొరబాబులా ఉన్నావురా!"

వాడు చనువుగా నా కాళ్ళని స్పృశించి వదిలాడు!"

బాబూ! నాకో సాయం చెయ్యాలండి!"

వాణ్ణి ఎరిగిన నాల్గు అయిదు సంవత్సరాల్లో ఇల్లాంటిమాట వాడినోటినుండి రావడం ఇదే ప్రథమం!

చెప్పరా! తప్పకుండా చేస్తాను!

మనూళ్ళో సంగీతం నేర్పుతారంట బాబూ!ఎలాగైనా నన్ను దాంట్లో చేర్పించరూ? నేను కొంత డబ్బు కూడ బెడతాను బాబూ! మాలాంటోళ్ళని ఆ బళ్ళోకి రానిత్తారో లేదో "

"ఒరేయ్! నా శాయశక్తులా ప్రయత్నంచేసి నిన్ను సంగీత పాఠశాల్లో చేర్పుతాను! జేరడానికి ఏమైనా డబ్బు అవసరం అయితే మొత్తం నేనే కడతాను! వానికోసం పొట్ట మాడ్చుకుని డబ్బులు కూడబెట్టద్దు!అయినా నీకు ఒకళ్ళ సిఫార్సు ఎందుకురా! నీ కంఠంచూసి నిన్ను కళ్ళకద్దుకుని జేర్చుకుంటారు –" అన్నాను వాడికి హుషారిస్తూ!"

వాడు ఆనంద బాష్పాలు తుడుచుకుంటూ, డక్కీని చేతిలోకి అందుకుంటూ తలవంచుకుని పాటసాగాడు

"మంటలు లేపే నెలరాజా!

ఈ తుంటరి తనమూ నీకేలా!!

వాడు వెళ్ళిపోయాక నా శ్రీమతితో అన్నాను!చూడూ! వాడు నేనిచ్చిన డబ్బులు దాచుకొని కొత్తబట్టలు కుట్టించుకున్నాడు! ఆ వయసులో పిల్లలు అడుక్కుంటూ తిరిగేవాళ్ళు జూదాలకీ, సినిమాలకీ డబ్బులు తగలేసేవాళ్ళు ఏంతమందున్నారో!! ఏమైనా వాడికి కొంచెం ఆసరా ఇస్తే చాలు ప్రయోజకుడవుతాడు! ఏమంటావ్!"

"ఇంకేం! ఎక్కడైనా అప్పు తెచ్చి వాడిచేత వ్యాపారం చేయించండి!! మిమ్మల్ని మీరు ఇప్పించిన అప్పుని గంగలో ముంచుతాడు!! అంది నా శ్రీమతి అక్కసుతో!

అయిష్టంతో ఇచ్చినా ఎంత మంచి సలహా ఇచ్చింది మా ఆవిడ! వెధవ మట్టిబుర్ర! ఇంతకాలం నాకు ఈ ఆలోచనే రానందుకు నన్ను నేను గట్టిగా తిట్టుకున్నాను??

"ఏమిటి! నిజంగానే వాడిచేత వ్యాపారం పెట్టిస్తారా ఏమిటి!! తెగ ఆలోచించేస్తున్నారు??

నేను అన్నాను దృఢంగా" అవును!!!"

ఊళ్ళో స్టేటు బ్యాంక్ ఏజంటుతో నాకు కొంచెం పరిచయం వుంది! ఆయనా సాహితీ ప్రియుడు!నాలుగు మూడు సభల్లో మేము కలుసుకున్నాము!!ఆయనతో రాజుగాడి గురించి చెప్పి, వెయ్యో పదిహేను వందలో అప్పు ఇప్పించి, రాజుగాడిచేత ఓ కిళ్ళీ బడ్డీ తెరిపిస్తే

ఎన్నాళ్ళు ఇలా తెగిన గాలిపటంలా తిరుగుతాడు! వీడి జీవితానికి ఓ స్థిరత్వం కలిగించాలి!"బ్యాంకీ వాళ్ళకి నేను హామీ ఇస్తాను రాజుగాడి అప్పు గురించి!

భగవంతుడా! వీడి బ్రతుకు ఓ దారిని పడేలా చెయ్యి!"

జీవితంలో ఓ మంచిపని చేయడానికి నిశ్చయించుకొన్న ఆ మొదటి రాత్రి, రాజుగాడి సంచర భవిష్యత్తు ఊహించుకొంటూ గడిపేసాను!!

తెల్లారగానే స్టేషన్‌లో రాజుగాణ్ణి పట్టుకుని సంగతంతా వివరించాను! మౌనంగా అంతా విన్నాడు! చెప్పవలసింది అంతా చెప్పి, 'నీ ఉద్దేశ్యం ఏమిటి చెప్పు' అన్నాను!! వాడు నా కాళ్ళు చుట్టేసి అలా ఏడుస్తూ ఉండిపోయాడు!!

"అరెరే! ఒరేయ్! రాజూ! ఏమిటిది!!! ఛా! లే!" అన్నా వాడు కాళ్ళు ఒదలలేదు చుట్టూ ప్రయాణీకులు ఎంతగా చూస్తుంటే నాకు సిగ్గేసింది!

ఒకాయన నాతో అన్నాడు!

"ఏంసార్! మీది ఏమైనా కొట్టేసాడా??"

"ఆ! అవునవును! నా హృదయం!! అన్నాను!

ఆ పృచ్ఛకుడు తెల్లబోయాడు!

రాజు అంత దుఃఖంలోనూ, గలగలా నవ్వుతూ 'భలేవారు సార్! మీరు!' అన్నాడు!

పదిగంటలకి బ్యాంక్ దగ్గరకు రమ్మని ఇంటికి వచ్చేసాను!

భగవంతుడి దయవల్ల బ్యాంక్ వ్యవహారం అనుకూలమైంది! పదిహేను వందలు రాజుగాడికి సహాయం చేయడానికి ఏజంట్‌గారు ఒప్పుకున్నారు! ఆ అప్పుకి నేను 'హామీ' ఇవ్వడానికి సిద్ధపడ్డాను! దరఖాస్తు రాసి ఇచ్చాను!రాజు పేర! పది పదిహేను రోజుల్లో వచ్చి డబ్బు పట్టికెళ్ళొచ్చు అన్నారు ఏజెంట్!!

పది పదిహేను రోజుల్లో ఎన్ని మార్పులు రావచ్చు??

ప్రభుత్వాలు కూలిపోవచ్చు! ప్రళయం రావచ్చు!!అణుయుద్ధం రావచ్చు!!

కానీ ఇవేమీ రాలేదు!!

అంతకన్నా భయంకరమైన అనుభవం ఎదురుకొన్నాను!!

ప్రస్తుతం నేను ఉంటున్న ఇల్లు ఖాళీ చేయవలసి వచ్చింది! మొత్తం స్నేహితుల సహాయంతో ఇల్లు వేట పూర్తిచేసాను! పక్కపేటలో ఓ ఇంట్లో పోర్షన్ దొరికింది! గత వారం రోజులుగా రాజుగాడు మా ఇంటికి రావడంలేదు! వస్తే మేం ఇల్లు మారుతున్న సంగతి చెపుదామని చూస్తున్నాను!

ఇల్లు ఖాళీ చేయవలసిన రోజు వచ్చింది కానీ రాజుగాడి జాడలేదు! ఎల్లా ఉందో ఒంట్లో వాడికి!ఏమైనా జ్వరపడ్డాడా??

సామాన్లు సర్దుకునే ప్రయత్నంలో వాడి గురించి తిరగడానికి నాకూ తీరిక చిక్కలేదు

కొత్త ఇంట్లోకి ప్రవేశించాము!!

ఏ వస్తువుకి తగినచోటు ఆ వస్తువుకి కేటాయించే పనిలో పడ్డామేమో రాత్రి ఏడుగంటలయ్యేసరికే శరీరం బాగా అలసిపోయింది!



అర్ధరాత్రి!! మెలుకువ వచ్చింది!

టైం ఒంటిగంట!! దొడ్డివైపున ఏదో చప్పుడైతే లేచి తలుపు తీసాను! ఏవడో! దేనికోసమో వెదుకుతున్నట్లు లీలగా కన్పించింది నాకు!

'ఎవడా వాడు? అంటూ బ్యాట్రీలైటు ఫోకస్ చేసాను!!

ఎదురుగా రాజు!!

అప్రతిభుణ్ని అయ్యాను!!

"ఏరా! ఎప్పట్నించి ఈ ఉద్యోగం??'

వాడు చేతులు జోడిస్తూ 'అదికాదు బాబూ నేను నిన్న .' అన్నాడు!

కోపాన్ని నిగ్రహించుకోలేక పోతున్నాను!

నువ్వు నువ్వు మనిషివి కావురా!పశువ్వి ఛీ పశువ్వి కూడా కాదు ."

అదికాదు బాబూ!! నేను దొంగ ని కాదు బాబూ నాడక్కీ "

మాటకీ మాటకీ పొంతన లేకుండా మాట్లాడుతున్న వాణ్ని చూస్తే ఎంత అసహ్యం వేసిందో చెప్పలేను!

నాకు వినడానికి అసహ్యం అయిన విషయాలూ, వస్తువులూ ఏకం అయి, రూపం ధరించి రాజుగాడిలో ప్రవేశించాయా అన్నట్లు ఉంది నాకు!

"ఛీ పాలు పోసిన చేతినే కాటువేసే రకంరా నువ్వు! తిన్నింటి వాసాలు లెక్కపెట్టే జాతిరా నీది! నీ కులం ఏంటో నీ కిప్పుడు తెలిసిందా? దొంగల కులం!!" ప్రయత్నంతో గొంతు తగ్గించి తిడుతున్నాను వాణ్ని! గట్టిగా కేకలేస్తే పదిమందీ లేస్తారు! నేను పెంచిన కుక్క పిచ్చిదినా సరే పదిమందిలో దెబ్బలు తింటుంటే నేను చూడలేను!!

రాజుగాడు కాళ్లు పట్టుకుని అన్నాడు ఏడుస్తూ!!

"బాబూ! నేను దొంగనుకాను! నాడక్కీ కోసం వచ్చాను

"ఛీ! ఇంకా అబద్ధాలు చెప్పడానికి సిగ్గులేదుట్రా!లే! తక్షణం బయటకు నడు! ఇంకా నా ముందు నిలబడ్డావంటే నిన్ను ఏం చేస్తానో తెలియదు! ఊనడు బయటకు " ఉద్రేకంతో ఊగిపోతూ అన్నాను!

'బాబూ!!"

రాజుగాడు ఏదో చెపుదామనుకుని ప్రయత్నం చేస్తున్నా నేను వినకుండా వాణ్ని బయటకు గెంటేసాను!!

ఆ సమయంలో వాడి మాటలన్నీ పచ్చి అబద్ధాలుగాతోచాయ్ నాకు!!

వాణ్ని బయటకు తోసి దొడ్డి తలుపువేసి గదిలోకి వచ్చి పడుకున్నాను!! నిద్రలేదు!!

రాజు గాడెంత పతనమయ్యాడు!! ఎందుకిలా తయారయ్యాడు!

ఇంత చిన్న వయస్సులోనే ఎంత బాగా నమ్మించాడు! వంచకుడు!!!

# అరుణ స్పర్శ

ముఖ లావణ్యపు
ముత్యపు రువ్వులు
బింబాధరమున
విచ్చిన నవ్వులు
కన్నుల విరిసిన
కలువల అందము
కాటుక రేకల
కమ్మని చంచము
తియ్యని వలపుల
తేట దనంబులు
జడలో మల్లెల
చక్క దనంబులు
తటిల్లతా నిభ
తనూ విభ్రమము
సమ్మోహ ప్రద
సంధ్యా రాగము
'అరుణ' కాంతియై
అంకము చేరెను
తరుణ జ్యోతియై
తమకము గూర్చెను
తదరుణ తరుణ సు
ధామ స్ఫురణము
ఊచెను నా యెద
పూచెను కవనము

—భారతి

## మంటలు రేపిన నెలరాజు

రాత్రి ఆదమరిచి నిద్ర పోయిన నా శ్రీమతికి రాత్రి జరిగిన వ్యవహారం తెలియక పోవడం వల్ల కొంత బతికాను! లేకపోతేనా? క్షణం క్షణం నా 'ఆదర్శాలని' దెప్పుతూ ఉండేదేమో!!

తెల్లవారాక నా శ్రీమతి రాజుగాడి డక్కీని పట్టుకొచ్చి అంది. "మెట్ల కింద గూట్లో పడుంది! ఇది రాజు గాడిదికదూ? ఏం మీరు కూడా సాధన చేస్తున్నారా ఏవిటి??"

నేను అదిరిపడి శ్రీమతి చేతుల్లోంచి డక్కీని లాక్కొని చూశాను! సందేహంలేదు! రాజు గాడిదే!చుట్టూ ఉండే ఎఱ్ఱ పూసలూ, డబ్బామీద అంటించిన రాజుగాడి అభిమాన నటుడి ఫోటో నాకు గుర్తే!!

ఖాళీ పాల డబ్బాకి అడుగు రేకు ఊడదీసి, దానికి కప్ప చర్మం చుడతారట! ఆ తోలునుండి ఓ తాడు ఉంటుంది! దానికి ఓ కర్ర పుల్ల చుట్టి దాన్ని పట్టి లాగితే అది డబడబ మంటుంది! దీని పేరేంటో నాకు తెలియదు కానీ నేను డక్కీ అంటాను! ఆ ఖాళీ డబ్బా కూడా నేను ఇచ్చిందే!!

ఇదే! ఇక్కడ కెలా వచ్చింది! నిన్న రాత్రి రాజుగాడు ఏదో 'డక్కీ' అని అన్నట్టు గుర్తు! నేను వినిపించుకోలేదు శ్రీమతి చెపుతున్న మాటలు!!

ఒక్క పరుగులో పక్క వాటా ఆయన దగ్గరకు వెళ్ళాను!

"నిన్న కానీ, మొన్నకానీ ఈ డక్కీ వాయించే కుర్రాడు ఇటు వచ్చాడా? మీకేమైనా తెలుసా??" అని అడిగాను కంగారుగా!

"తెలుసండీ! మొన్న సాయంత్రం మా వాటాలో ఉండే మూర్తిగారు ట్రాన్స్ఫరై ఇల్లు సర్దుకునే హడావిడిలో ఉండగా ఆ కుర్రాడు వచ్చి పాటలు పాడ్డం మొదలెట్టాడు ఆయన ●రా' అన్నా వీడు వినకుండా 'కడుపులో కాలిపోతోంది బాబూ!' అంటూ పాడ్డం మొదలు పెట్టాడు! ఆయన ట్రైన్‌కి టైం అయిపోతోందనే కంగారులో ఉన్నాడేమో వాణ్ని రెండు కొట్టి డక్కీ లాక్కుని పొమ్మన్నాడు! వాడు ఏడుస్తూ పోయాడు! వాడు మేం వెళ్ళిన తరవాతవస్తే ఆ డక్కీ పడేయండి" అంటూ ఇల్లు ఖాళీ చేసి పోయారు

నాకు భూమి లోకి క్రుంగిపోతున్నట్లు అనిపిస్తోంది!

కంగారుగా సైకిల్ తీసుకుని రైల్వే స్టేషన్‌కి బయలు దేరాను!

బజారులో గుమిగూడిన జనం వల్ల సైకిల్ దిగక తప్పలేదు!

ఎవరో కుర్రాడు లారీ కింద పడ్డాడు! అబ్బ చూడ్డానికి భయంగా ఉంది శవం!!" అంటున్నారు ఎవరో!

ఉద్విగ్నంగా సైకిల్ స్టాండు వేసి జనంలోనికి దొరబడ్డాను!!

రాజుగాడు!! నిశ్చైతన్యంగా, నిస్తేజంగా నుగ్గు నుగ్గు అయిపోయిన శరీరంతో రాజుగాడు!! లారీ కింద పడి ఉన్నాడు!

రాజుగాడు ప్రమాద వశాత్తు లారీ కింద పడ్డాడాలేక కావాలనే . నేను . దొంగముద్ర వేసినందుకు

నాకళ్ళనుండి ధారాపాతంగా కనీరు కారుతున్నాయ్!!

"సుఖమూ, శాంతీ, ఆనందం

నా నుదుట రాయులేదే మరిచాడూ "

రాజు గొంతు నా చెవుల్లో ప్రతిధ్వనిస్తోంది!! □

# మీ పెట్టుబడి రక్షణకు, మీ కుటుంబ క్షేమానికి యుఎల్ఐపి



## ULIP ఒక్కటే మార్గం

యు.ఎల్.ఐ.పి. (అంటే యునైటెడ్ లింక్డ్ ఇన్సూరెన్స్ ప్లాన్) ని ఒక్కసారి బాగా పరీక్షించండి.

వైద్య పరీక్షతో నిమిత్తం లేకుండానే, అనుకున్న మొత్తానికి, మీకు జీవిత బీమా రక్షణ దొరుకుతుంది.

ఇంకా, అపాయాల సందర్భంలో, రూ. **15,000** ల దాకా మీకు రక్షణ లభిస్తుంది.

అంతేగాక, మీ పెట్టుబడిమీద మంచి ఫలసాయం వస్తుంది.

పైగా, మీరు వేసిన మొత్తంమీద రాబడి పన్నులో మినహాయింపు వుంటుంది.

**18** సంవత్సరాల నుండి **45½** సంవత్సరాల మధ్య వయస్సులో వుంటే, మీరు యు.ఎల్.ఐ.పి. పథకంలో చేరవచ్చు. రూ. **3,000/-** కనీస మొత్తం నుండి రూ. **12,000/-** గరిష్ట మొత్తం వరకు, **10** నుండి **15** ఏళ్ళ వరకు.

మొదటిసారి చేరిన మూడేళ్ల తర్వాత, మళ్లీ రూ. **12,000/-** లకు కొత్త పథకాన్ని తీసుకోవచ్చు

ఇతర వివరాలకు, మా ఏజెంట్లను గాని, ముఖ్య ప్రతినిధులను గాని, మీకు దగ్గరలో వున్న బ్యాంక్ ఆఫ్ ఇండియా శాఖను గాని సంప్రదించండి.



**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

(ప్రభుత్వ రంగంలోని ఆర్థిక సంస్థ)

హెడ్ ఆఫీస్, బొంబాయి-20

ప్రాంతీయ కార్యాలయం: 'రెజీనా మ్యాన్షన్', **46**, సెకండ్ లైన్ బీచ్, మద్రాస్-**600 001**. టెలిఫోన్: **27433**
ఆంధ్రప్రదేశ్ కార్యాలయం: **27/11/6B**, మేరీ స్ట్రీట్, గవర్నర్‌పేట, విజయవాడ-**520 002** టెలిఫోన్: **63964**

ఆంధ్రప్రదేశ్‌లో మా ముఖ్య ప్రతినిధి:

కె.బి. తిలక్, లియో సర్వీసెస్, **13**, అంజుమన్ బిల్డింగ్ (లాలాపేట పోలీస్‌స్టేషన్ దగ్గర), గుంటూరు-**5220 03** టెలిఫోన్: (O) **23439** ● యర్రమిల్లి సోమసుందరరావు, నేతాజీ ప్రెస్, మెయిన్ రోడ్డు, తుని-**534 211** ఫోన్: (R) **106** ● సి. నారాయణస్వామి, **15-5-4**, శైలేశ్వరసేన రోడ్డు, కృష్ణ నగర్, మహారాణిపేట, విశాఖపట్టణం-**530 002**.

**మీ మిగులు ధనాన్ని- యూనిట్ యూనిట్‌గా పెరగనివ్వండి!**

**20 YEARS OF TRUSTED SERVICE**

Sista's - UTI.242.84 TE D

## సీరియల్

# రాగితప్పు పడవలు

### యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

(గత సంచిక తరువాయి)

ఇచ్చిన మాట ప్రకారం కుటుంబరావు అయిదు రోజుల తరువాత కంటకాపల్లి వెళ్ళి జనార్ధనయ్యగారితో సంప్రదించేడు

బావగారూ! నన్ను క్షమించాలి ఇంత అలస్యంగా మీ ఇంటికి వచ్చి-నందుకు కాని కారణాన్ని మీ కింతకుముందే విన్నవించేను మా అబ్బాయికి విశాఖలో ఉద్యోగ మయింది మేము కూడ రెండు మూడు నెలల్లో విశాఖ-పట్నం పోదామనుకుంటున్నాము అబ్బాయికి హిందూస్థాన్ జింకులో ఉద్యోగం గనుక ఆ ఊరులో ఉంటే గాని సమయానికి డ్యూటీకి వెళ్ళలేడు-కదా-అందుకని దగ్గర్లో ఇల్లు తీసుకుందామనుకుంటున్నాము ఏ ఊరైనా మాది అద్దె కొంపే కదా!

'ఆమధ్యన జయలక్ష్మి మా ఇంటికి వచ్చినప్పుడు చెప్పింది కృష్ణుడికి ఉద్యోగమయిందని– చాల సంతోషం

బావగారు! మేము విశాఖ వెళ్ళేలోగా అమ్మాయి జయకు వివాహం చేయాలనుకుంటున్నాను మీరు సమ్మతిస్తే

ఇంకా అలస్యమెందుకు మాకూ మా అబ్బాయికి త్వరగానే పెండ్లి చేయాలని ఉంది

అయితే మనిద్దరం ఎల్లుండి ప్రొద్దున్న విజయనగరం వెళ్ళి అక్కడ ఎతపరి సిద్ధాంతిగార్ని కలసి ముహూర్తం పెట్టించుకొని వద్దామా?

సరే అలాగే-నేను అదే బండికి కంటకాపల్లి స్టేషన్లో మిమ్మల్ని కలుస్తాను

22

రామారావు! నిన్ను నేను ముద్దుగా రాము అని పిలవదల్చేను నీకేమైనా ఇబ్బందా?

> **జరిగిన కథ – 13 :** సుమతి జగ్గారావుల పెళ్లి జరిగిపోయింది రామారావు జయలక్ష్మిల పెళ్లి వాయిదా పడింది సుబ్బారావు మాస్టారుకి సుభద్రయందు సదభిప్రాయం ఏర్పడింది రామారావుకి వరుసకి మేనమామ సుభద్రకు కుండమార్పు సంబంధం తెస్తే రామారావు తిరస్కరించాడు రామారావు, జయలక్ష్మి, సుభద్ర, కనకం, వెంకటరమణ, సుబ్బారావు మాస్టారు తోటిపూడి రిజర్వాయరుకు పిక్‌నిక్ వెళ్తారు సుభద్ర, సుబ్బారావు ఒకరి నొకరు ప్రేమిస్తారు జయలక్ష్మి వారిని ఆటలు పట్టిస్తుంది సుబ్బారావు, సుభద్రల పెళ్లితోపాటు జయలక్ష్మి, రామారావుల పెళ్లి జరిపించను రామారావు తల్లి దండ్రులు సంకల్పించారు కానీ కుటుంబరావు తన కొడుక్కు ఉద్యోగం దొరికిన తరువాతే జయలక్ష్మి పెళ్లి జరగాలని పట్టు పట్టాడు సుబ్బారావు, సుభద్రల పెళ్లి జరిగిపోయింది జయలక్ష్మి తమ్ముడికి ఉద్యోగం వచ్చింది కుటుంబరావు జయలక్ష్మి పెళ్లి జరిపించను అంగీక రిస్తాడు ఆ శుభ వార్తను రామారావుకి చెప్పింది జయలక్ష్మి

అలాగే పిలు నా కష్టమే

మరి మన పెండ్లి అయేక కూడ నిన్ను నువ్వు అంటే బాగుంటుందా-- మిరు అనకపోతే మన వాళ్ళంతా తప్పు పట్టరూ?

'వాళ్ళందరి సంగతి ఎందుకు కట్టుకునేవాణ్ని నేను ఒప్పుకుంటు-న్నప్పుడు నేను నిన్ను నువ్వు అని అన్నప్పుడు, నువ్వు నన్ను అలాగే సంబో-ధిస్తేనే సాన్నిహితంగా ఉంటుంది అంతెందుకు ఈ మీరు ఆచారం మన దక్షిణాదిలోనే ఉత్తరాదిలో లేదు

ఒకె నిన్ను రాము అనే అంటాను మనం యిప్పటినుంచే మన సంసారిక జవితం గురించి ఓ పథకం వేసుకోవాలి అన్నట్లు మనం పెండ్లి చేసుకున్నాక ఒకరిమీద ఒకరం అదికారం చెలాయిస్తూ దెబ్బలాడుకుంటామా?"

తప్పకుండా-మనం భార్యా భర్తలం యెప్పుడయితే అయేమో అప్పుడే ఒకరిమీద ఒకరికి అధికారం కల్గుతుంది నేను రాత్రుళ్ళు నీకు ముందుగ చెప్పకుండ అర్ధ రాత్రి వస్తే నీవు ఊరుకుంటావా? అలాగే నువ్వు వేళకి వంట చెయ్యకపోతే నే నడగనూ? తరువాత మనం మన పిల్లల్ని గదమాయించం? అంతమాత్రంచేత ఒకరిమీద ఒకరికి ప్రేమ, అనురాగం లేదనుకుంటే ఎలా?

"సరే అయితే నాకు ముందుగా చెప్పకుండా నువ్వెక్కడికీ పోకు నన్ను ప్రతి విషయానికి తప్పు పట్టకూడదు నేనేమైన పొరబాట్లుచేస్తే నువ్వు అనునయంగ సరిదిద్దాలి గాని దుయ్యపట్టకూడదు లేకపోతే 'జానకి విముక్తి'లో జానకలా ఇల్లు విడచిపోతాను జాగ్రత్త!'

"ఆ జానకి సంగతి నాకు చెప్పకు ఆ జానకి వర్రి స్టుపిడ్ అండ్ చచ్చు ఉమెన్ మొదటినుంచి వెంకట్రావుకి, జానక్కి మధ్యన ఏ ప్రేమ, అనురాగం లేవు ఒకే ఇంట్లో ఉన్నంత మాత్రాన భార్యా భర్తలయిపోరు ముఖ్యంగా నోరు, పోరు తెలీని ఆడది ఆడదే! వెంకట్రావుని కాన్వెక్సు లెన్సు నుండి, జానకిని కాన్‌కేవ్ లెన్సు నుండి చూపడమైంది అందుకే వారి దాంపత్యం వికృతంగ తయారైంది ఎక్కడయితే ప్రేమ ఉంటుందో అక్కడే సదవగాహన ఉంటుంది

"మరి మన వ్యక్తిగత స్వాతంత్ర్యం సంగతి నేను చెప్తాను ప్రతి చిన్న విషయం నీకు చెప్పి చేయను అలాగే మన ఖర్చుల విషయంలో కూడ ప్రతి దానికి నువ్వెక్కడ కెళ్ళేవు అని నన్ను నిలబెట్టకూడదు అలాగే నేను నిన్ను వేధించను

"నేను నీకు ఓ విషయం చెప్పాలి ఎంత భార్యమీద ప్రేమున్న మగవాడు కూడ భార్యను మెడకు కట్టుకుని తిరగలేడు కొంత వ్యక్తిగత స్వాతంత్ర్యం వదలుకున్న అప్పుడప్పుడు మగ స్నేహితులతో పార్కులో కూర్చుని ఏవో పోరంబోకు డిస్కషన్సు చేయాలని ఉంటుంది, అప్పుడప్పుడు వాళ్ళతో సిగిరెట్టు దమ్ము కొడుతు సినీమాకి వెళ్ళాలని ఉంటుంది అట్లాంటి సమయంలో నువ్వు నన్ను సినిమాకు తీసికెళ్ళకుండ నీ ఫ్రెండ్సుతో వెళ్ళిపోయేవు', అని రోదిస్తు కూర్చుంటే నాకే విడాకులు ఇవ్వాలని అనిపిస్తుంది-జాగ్రత్త!

"సరే ఈ పాయింటు నోటు చేసుకుంటా అలాగే నేను నా స్నేహితు-రాళ్ళతో అప్పుడప్పుడు తిరుగుతుంటా-నేనన్నదీ అదే. ఇద్దరి స్వేచ్ఛ పూర్తిగా పోకూడదు కనీసం ఏభై శాతమైనా ఉండిపోవాలి అలాగే మన జీతాల గురించి కూడ మన మొక అవగాహనకు వస్తే మంచిది

"చూడు జయా! నీ జీతం నీది–నా జీతం మనది అది నా తత్వం నువ్వు నాకు వంట చేస్తావు, సేవలు చేస్తావు–పిల్లలు పుట్టేక వాళ్ళకు ఎన్నో సేవలు చేయాలి ఉద్యోగం చేసుకుంటు నాకు వంట చేయడం రాదు, ఇల్లు సర్దడం రాదు పిల్లల్ని ఆడించడం అంతకంటే చాతనవదు వాళ్ళు నా దగ్గరకు వస్తే మరింత గట్టిగా యేడుస్తారు ఆఫ్‌కోర్సు నిన్ను కాళ్ళు పిసకమని వేధించనుతే నా బట్ట లుతకమనను మన బట్టలని లాండ్రీకే వేసుకుందాం చెప్పడం మరచా నాకు ఓ పని బాగా చేతనవును జోళ్ళు బాగా పాలిష్ చేస్తాను రోజు ప్రొద్దున్నే నీ జోళ్ళు, నా జోళ్ళు పాలిష్ చేస్తాను? సరేనా?'

జయ ఆనందంతో విరగబడి నవ్వింది

"గుడ్ ఆ పని చేస్తుండు కాళ్ళు పట్టడమన్నావు-అందులోని రహస్యం నీకు తెలియదు భార్య కావాలనే సేవ నెపం పెట్టుకుని భర్త కాళ్ళు పడుతుంటుంది అందులో స్త్రీకు ఆనందం లేకపోతే ఆ పని చేయదు అంతేగాని అది బానిసత్వం కాదు మా అమ్మ అంటే మా నాన్నకు జంకే ఆమె నోటి జోరు అట్లాంటిది-గాని మా నాన్నకు తప్పని సరిగా రోజు రాత్రి ఓ అయిదు నిముషాలైన కాళ్ళు పడితేగాని నిద్ర పోయేదికాదు మా నాన్నకు కాస్త ఒంట్లో బాగులేకపోతే హడలిపోయి అతని దగ్గరే ఉండిపోయేది సేవలు చేస్తూ మా నాన్న ఆరోగ్యం కుదుటపడగానే మళ్ళీ మామూలే ప్రతి విషయానికి పోట్లాడేది మా నాన్న విసుక్కునేవాడు గాని జవాబు చెప్పలేక పోయేడు 'వెర్రి బాగులది-అరచుకోని' అనేవాడు నువ్వేమనుకున్నా గాని పూర్వం వాళ్ళకున్న ప్రేమ. అనురాగాలు మనకు లేవు '

"ఏమిటి జయా! నా ప్రేమనే సంశయిస్తున్నావా?"

"ఛా! అది కాదు నేననేది ఈ తరం వాళ్ళకు అన్నాను జనరల్‌గా-అంతే అసలు సంగతి మన జీతాల సంగతి తెల్చుకోలేదు నువ్వన్నది నే నొప్పుకోను-నా జీతంలో సగం మనింటికోసం ఖర్చు చేస్తాను మిగతా సగం మా నాన్నకు ఇస్తాను వాళ్ళింటి ఖర్చు కోసం అలాగే నువ్వూ నీ జీతంను చేయాలి మనింటికి కేటాయించిన డబ్బులోనే మనిద్దరం మన స్వంతానికి




అంటే బస్సు ఖర్చులకు, కాఫిలకు, టిఫిన్‌లకు, సినిమాలకు, బట్టలకు ఖర్చు చేసుకుందాం ఎవరి అవుసరపు ఖర్చులు వాళ్ళు చేసుకుందాం-ఏం?'

"సరే నీ మాటే కానీయ్ "

మరి మనం యెక్కడ ఇల్లు అద్దెకు తీసుకుందాం?

"ఏం కొన్నాళ్ళు మనం కంటకాపల్లి నుండి రోజు ట్రెయినులో వస్తే?"

'ఇన్ని సంవత్సరాలు పడ్డ కష్టాల్ని తొలగించుకునేందుకు కద, ఈ మన పెండ్లి, మన సంసారం-కావలుస్తే మన జీతాల్లో రెండో వంతు జీతాలు మన వాళ్ళకు ఇచ్చేద్దాం-గాని మనం విశాఖలోనే మనిద్దరి ఆఫీసులకు చేరువలోనే ఓ రెండు గదుల చిన్న ఇల్లు తీసుకుని క్లుప్తంగా సంసారం చేద్దాం అంతేగాని రెండు ముద్దలు నోట్లో వేసుకుని రైలు బండీ యెక్కి మళ్ళీ బస్సు యెక్కి ఆఫీసుకు చేరి మళ్ళీ ఆఫీసు అయిపోగానే ట్రెయిను తప్పుతామేమో-నన్న భయంతో, ఆందోళనతో మళ్ళీ బస్సెక్కి 'మళ్ళీ ట్రెయినెక్కి ఇంటికి చేరడం-బాబోయ్! మరి చెయ్యలేను ఈ డెయిలీ పాసింజరు పని '

'అంత జీతం మన వాళ్ళకు ఇవ్వనవుసరం లేదు-ఫిఫ్టీ ఫిఫ్టీ బాగానే ఉంటుంది ఓకె-ఇప్పటినుంచే ఇంటి కోసం నలుగురు ఫ్రెండ్సుకి చెప్పి ఉంచుతాను

"ప్రొద్దున్నే నేను వంట చేస్తాను మనిద్దరం తొమ్మిది గంటల నలభై అయిదు నిముషాలకే భోజనం చేసి పది గంటలకు ఆఫీసుకు చేరుదాం

# కాగితపు పడవలు

అప్పుడే నేను టిఫిను కూడ చేసి ఉంచుతాను ఒంటి గంటకు ఇద్దరం ఇంటికి వస్తే ఆ టిఫిను తినేసి అప్పుడు నేను తయారు చేసే కాఫీని త్రాగేసి మళ్ళీ ఆఫీసుకు పోదాం ఓ మెనూ పెట్టుకుని రోజుకో రకం టిఫిను తయారు చేస్తాను నేను శ్రద్ధగా చేస్తే వంట బాగానే చేస్తాను "

తినబోతూ రుచు లడగను గాని-తరువాత ప్రోగ్రాం చెప్పు '

"సాయంత్రం ఆఫీసు అయిపోగానే ఇంటికి చేరి ముఖం, కాళ్ళు చేతులు కడుక్కొని ఆఫీసు బట్టల్ని మార్చేసికొని ఏదైన లైట్ టిఫిను అంటే మిక్సర్, కారంపూస, ఖారపు అటుకులు లాంటివి తీసికొని కాఫీ త్రాగి అలా షికారుకి పోదాం, ఓనాడు బజారు వైపు, మరోనాడు బీచికి, ఇంకోనాడు సినిమాకి అటునుంచి వచ్చి వండుకుని వేడిగ భోజనం చేసి పడుక్కుందాం "

తరువాత?'

ఇంకేమిటి తరువాత? రోజంతటికి కార్యక్రమం చెప్పేసేనుగు"

అదే పడుక్కున్న తరువాత ఏమిటి అని "

"ఛో-పెంకీ-సిగ్గు లేకపోతే సరి "

మరి మనింటికి కావల్సిన గిన్నెలు, ముంతలు సంగతి జాబితా వ్రాసిస్తే, అవి కూడ కొని ఉంచుతాను '

'అన్ని ఒక్క సారి కొనొద్దు మా అక్క ఏవో కొన్ని గిన్నెలు అవి ఇస్తుంది మీ ఇంట్లో మీకు ఏమైన ఇస్తే తీసుకునిరా ముందుగా కాల్ గాస్‌కి పేరు రిజిస్టరు చేయి ప్రస్తుతం ఓ కిరసిన్ స్టవ్, ఓ బొగ్గుల కుంపటి కొందాం ఇద్దరం కాపురం మొదలెట్టేక మెల్లి మెల్లిక కావల్సిన వస్తువు లన్నిటిని మనిద్దరం బజారుకు పోయి కొనివద్దాం అదో సరదా!'

"ఈ మూఢాలు కావు గాని ముహూర్తం వెంటనే పెట్టేస్తే ఎంత బాగుండును మరో మూడు నెలలు ఆగాలిట అప్పుడే ముహూర్తం పెట్టారట! "

"రాము! తొందరపడకు అన్ని సవ్యంగా జరుగుతాయి "

"ఈలోగా నేను అప్పుడప్పుడు నీ బుగ్గలు కొరుకుతుంటాను '

"నీ ఇష్టం-గాని పెండ్లి పీటలమీదకు నేను వెళ్ళేసరికి జయలక్ష్మి మైనస్ రెండు బుగ్గలు అవగలవు జాగ్రత్త!"

"సరే-తరువాత కథ చెప్పు

"మనం మన పెండ్లి అయిపోగానే ఒక పని చెయ్యాలి

"అవును అది చాల ముఖ్యం-అదే హనీమూన్!"

"బాగుంది-నీ కెప్పుడు అదే దృష్టిలాగుంది

"మరి అమ్మాయికి మరే దృష్టి ఉండి పెండ్లి చేసుకుంటుందో!"

"ఎన్నో దృక్పధా లున్నాయి వివాహం చేసుకుందుకు నీకు వండి పెట్టడంలో ఆనందముంది నీతో షికారులకు, సినీమాలకు రావడంలో ఎంతో సంతోషముంది నీతో కలసి ఉండి నీకు పిల్లల్ని కని వాళ్ళను పెంచడంలో ఎంతో ఆత్మానందముంది నీ సహచర్యంలో, నీ తోడు నీడలో నా కెంతో ప్రశాంతత ఉంది నీవు ప్రేమతో నన్ను నీ చేతులలోకి తీసుకుంటే నా కెంతో మాధుర్యముంది "

"వెరీగుడ్-అమ్మాయి మంచి, గాఢమైన ప్రేమలో పడ్డదే!

"మన ఈ అనుబంధానికి సరైన నిర్వచనం నేను చేయలేను గాని నా మాట పూర్తిగా విను "

"సరే-చెప్పు నీ పధకాలన్ని సీరియల్ నవల్లా సాగుతున్నాయి

"మన పెండ్లి అయిపోగానే ఇద్దరం తిరుపతి వెళ్ళి దైవ దర్శనం చేసుకుని వద్దాం "

"దైవ దర్శనం అవగానే వెంటనే ఇక్కడకు వచ్చేయడ మెందుకు? అలా ఏ మద్రాసుకో, హైదరాబాదుకో ఓ పది రోజులు హనీమూన్‌కి పోదాం






"వద్దు."

"అంటే హనీమూన్ వద్దా?" అని రాము చాల ఆశ్చర్యపోయేడు.

"అది కాదోయ్ బుద్దూ. మన కొత్తింట్లో విశాఖపట్నంలోనే అది జరుపుకుందాం. నా చేత్తో నేను గదిని అలంకరిస్తాను. మా అక్క నాకు సహాయ పడుతుంది."

"స్టాప్-స్టాపిట్! ఈ విషయంలో నీవన్ని నాయనమ్మ భావాలు. నేను వొప్పుకోను. నువ్వు నా మాట వినవల్సిందే. నేను నీ మొగుణ్ని-మరచిపోకు. మన హనీమూన్ మనకు తెలియని ఏదో కొత్త పట్నంలో జరగవల్సిందే-ఆ!"

జయలక్ష్మికి చాల నవ్వు వచ్చింది.

"సరే-మొగుడుగారు ఏపట్నంకి వెళ్దాం."

"ఆ పట్నాన్ని నిర్ణయించడం నీకే వదిలేస్తున్నాను."

"ఆలాగయితే హైదరాబాదుకే పోదాం-మనిద్దరం కూడ చూడలేదు."

"సరే. అలా ఏకీభవించుకొంటూ పోతుంటే సంసారంలో గొడవలే ఉండవు. తెల్సిందా?"

"తెల్సింది మొగుడుగారు!" అని నాలిక చివర బయటకు తీసి వెక్కిరింపుగా చూపింది.

"మరి మనింటికి చాప కొందామా, నులక మంచమా. పట్టెడ మంచమా, మోడర్న్ కాటా-ఏది కొందాం?"

"మరి నాకు సిగ్గు వేస్తుంది కాని చెప్పక తప్పదు"

"అదే చెప్పేసి బోలెడంత సిగ్గు పడిపో, సినిమా హిరోయిన్‌లా."

"సహారా ఫర్నిషర్స్‌లో ఓ రకం డబుల్ కాట్ చూసేను. చాల బాగుంది. అది కొందాం. దానిపైన రబ్బర్ ఫోమ్ పరుపూ, రెండు ఫోమ్ తలగడాలు, మేచింగ్ బోంబే డయింగ్ దుప్పట్లు, గలీబులు కొందాం- ఏం."

"మంచం కొనొచ్చు గాని రబ్బర్ఫ్ ఫోమ్ పరుపు ఏంత లేదన్న వెయ్యి రూపాయ లుంటుంది ఇప్పుడు. ఇంత ఖర్చు చేయడమే."

"తప్పదు-కావలుస్తే నేను సగం ఖర్చు భరిస్తాను-నువ్వు సగం ఖర్చు పెట్టు."

"సరే-మరేమిటి నీ కోర్కెలు త్వరగా చెప్పు. చూసేవా మన మీ కలల్లోపడి ఎంత రాత్రయిందో గమనించనేలేదు. అప్పుడే బీచంతా నిర్మానుష్యమైంది--చూడు! ఇంకా ఆలస్యమైతే మనకి ఆఖరి బస్సు దొరకదు."

గతుక్కుమని జయలక్ష్మి నలు పక్కల చూసి లేచింది. ఇద్దరు త్వరగ రోడ్డు మీదకు వచ్చి అప్పుడే వచ్చిన సిటీ బస్సు ఎక్కేరు.

## 23

జయలక్ష్మి వివాహం నిర్ణయమైంది. సరిగ్గా ఆ మంగళవారం నాటికి ఒక నెలాళ్ళలో పెండ్లి ముహూర్తం పెట్టుకున్నారు. కుటుంబరావు తన అనారోగ్యాన్ని మరచిపోయి ఉత్సాహంగ పెండ్లికి యేర్పాట్లు చేస్తున్నాడు. జయలక్ష్మి చాల ఉల్లాసంగా ఉంది. రామారావు ఆనందానికి అవధి లేదు. జనార్ధనయ్య, కామేశ్వరమ్మ ఆ శుభ ముహూర్తానికి ఎదురు చూస్తున్నారు. పెండ్లికి వారం రోజులు ముందుగానే రమ్మని, కుమార్తెలు సుభద్రకు పార్వతికి ఉత్తరాలు వ్రాసింది కామేశ్వరమ్మ. అలాగే అల్లుళ్ళకు కూడ ఉత్తరాలు పోస్టు చేసేడు జనార్ధనయ్య. సుమతి వాళ్ళక్కకు పెండ్లి ముహూర్తం నిర్ణయమైన నాటి నుండి తెగ సంబరంగ తిరిగేస్తుంది పుట్టింటికి, మెట్టినింటికి మధ్యన.

"కోడలుకి మంచి పట్టు చీర లగ్నంకు పెట్టాలికద; ఇప్పుడు పట్టు చీరలపైన రూపాయికి పదిహేను పైసల రిబేటు ఇస్తున్నారట. మన పక్క వీధి కనకం చెప్పింది మొన్నను మనింటికి వచ్చినప్పుడు. మీరు ఓ పట్టు చీర కొనుక్కుని రాకూడదు?"

"బాగుంది-నా ఎంపిక అబ్బాయికి, నీకు నచ్చవద్దు? ఇంతకు కట్టుకునేది కోడలు పిల్ల గనుక మన అబ్బాయి, జయలక్ష్మి వాళ్ళకు నచ్చింది కొని తేవడమే ఉత్తమం."

"సరే-రామం! ఇలా ఓసారిరా."

"ఏమమ్మా-దేనికి?"

"విశాఖపట్నంలో పట్టు చీరలపైన రిబేటు ఇస్తున్నారుట, అమ్మాయి జయలక్ష్మిని తీసుకుని వెళ్ళి ఆ అమ్మాయికి నచ్చిన పట్టు చీర, దానికి సరిపడే పట్టు రవికల గుడ్డ కొని తీసుకునిరా. నాన్నగారు డబ్బిస్తారు. రేపు సాయంత్రం మీ రిద్దరు ఆఫీసు వదిలేక అలా బజారుకి పోయి రండి" అని కామేశ్వరమ్మ కొడుక్కి చెప్పింది.

ఆ మరునాడు ట్రయినులో జయలక్ష్మి కలియగానే రామారావు ఆ మాటే చెప్పేడు.

"అయితే రామం కంకటాల వాళ్ళ దుకాణానికి పోదాం. అక్కడేవో కొత్త రకాలు వచ్చేయని విన్నాను-పండుగ వస్తుందికదా అందుకే."

"జయా! మరి ఆఫీసుకి శలవు ఎప్పటి నుండి తీసుకుంటావు?"

"ఎప్పటినుండి తీసుకోమన్నావు చెప్పు?"

"పెండ్లి వారం రోజులుందనగా ఓ నెలాళ్ళకు శలవు తీసుకుందాం. పెండ్లి అయేక తిరుపతికి ఆ తరువాత హైదరాబాదుకి పోయి రావచ్చు."

"ఓకె-నేనూ అలాగే శలవు తీసుకుంటా. సాయంత్రం బజారుకి పోదామన్నావు గాని బహుశా ఇవాళ వర్షం పడవచ్చు. మబ్బుగా ఉంది కదూ."

"మరేం ఫరవాలేదు-సాయంత్రం లోగానే వర్షం పడి సాయంత్రం తెరిపీయవచ్చు- ఒకవేళ పడినా ఏమైయిపోదులే- కాస్త తడుస్తాం-అంతేగా."

"రాము! సినిమాలు చూసి చూసి ఆ సినిమాలో వాళ్ళలా తడద్దామని ఉందా!"

"అవును. అదో ముచ్చట."

సాయంత్రం అనుకున్నట్టుగా ఆఫీసు అయిపోగానే రామారావు, జయలక్ష్మి

## కాగితపు పడవలు

బజారుకి బస్సులో పోయేరు. రోజంతా అతపా తడపా సన్నటి జల్లు కురుస్తూనే ఉంది. సాయంత్రం కాస్త తెరిపిచ్చింది. జయలక్ష్మి, రామారావు ఉత్సాహంగ బజారులోని ముఖ్యమైన బట్టల షాపులన్నీ తిరిగేరు. జయలక్ష్మి రెండు పోలిస్టర్ చీరలు కొనుక్కుంది. ఆఖరికి కంకటాల షాపుకి చేరేరు. వాన ఉధృతంగ కురవ నారంభించింది.

"రాము! ఈ లేత వైలెట్ రంగు చీర బాగుందికదూ?"

"చీర రంగు బాగుంది కాని ఆ అంచు మరి కొంత వెడల్పుగనుంటే బాగుండును"

"మరీ అంత పెద్ద జరీ బోర్డరు ఎబ్బెట్టుగ ఉంటుంది. ఈ బోర్డరు మరీ అంత సన్నది కాదు. మరీ అంత పెద్దది కాదు-నాకు నచ్చింది."

"బాగుంది. బాగు లేదని నేనూ అనటం లేదు-అదే తీసుకో. దానికి మేచింగు బ్లౌసు పీసు పట్టుది కూడ తీసుకో."

జయలక్ష్మి ఎంపిక, కొనటం పూర్తయింది, గాని వాన వెలయలేదు. ఇలా వాన పడుతుంటే ఎలా స్టేషనుకు చేరడం అని ఇద్దరు ఆలోచనలో పడ్డారు. ఆ వానలో ఒక్క ఆటోగాని, మామూలు రిక్షా గాని దొరకలేదు. వాన తగ్గే సూచనలేమి లేవు. చీరలు తడసి పోకుండ షాపువాడు ప్లాస్టిక్ బాగ్‌లో బాగా పేక్ చేసిచ్చాడు.

"జయా! ఎప్పటికి వాన తగ్గుతుందో ఏమో. మనం మెల్లగ పూర్ణ మార్కెట్టు వరకు వెళ్తే బాగుంటుందేమో. అక్కడ తప్పకుండ బస్సో, ఆటోవో దొరకుతుంది."

"సరే పద-ఈ వానిప్పుడు తగ్గేట్టు లేదు. ఇంకా ఆలస్యం చేస్తే ట్రెయిను కాదు బస్సు కూడ దొరకదేమో పద."

ఇద్దరు షాపుల గుమ్మాల్ని అంటుకుని నడుస్తూ మెల్లగ పూర్ణ మార్కెట్టు చేరేరు. ఆ సరికి ఇద్దరు బాగా తడిసేరు. అక్కడ ఆటో దొరకుతే అందులో ఎందుకైన మంచిదని బస్సు స్టాండుకే పోయేరు. మరో పావు గంటకు బస్సు దొరకింది. బస్సులో కూర్చున్నది లగాయితు జయలక్ష్మి దగ్గ నారంభించింది.

రామారావు ఆందోళన చెందేడు.

"జయా! నేనూ కొత్తవలసలో దిగిపోతాను. నిన్ను డాక్టరు వద్దకు తీసుకుని వెళ్తా."

"ఇది మరీ బాగుంది. వానలో తడిస్తే కాస్త దగ్గు వచ్చింది. ఇంటికి వెళ్ళగానే వేడిగ ఇంత మిరియాల కషాయం పెట్టుకుని త్రాగుతాను దగ్గు ఇట్టే పోతుంది. అంతేగాని ప్రతి చిన్న విషయానికి డాక్టరు దగ్గరికిపోతే మన జీతం సగం డాక్టరు ఫీజు క్రిందే పోతుంది!"

"మరేం ఫరవాలేదంటావా?" రామారావు ఆందోళన తగ్గలేదు.

"ఏం ఫరవాలేదు-నువ్వు ఏ బెంగ పెట్టుకోకుండ మీ ఇంటికి పో. నువ్వు కొత్తవలసలో దిగేవంటే మా వాళ్ళేమంటారో తెలుసా? ఇప్పటినుండే పెళ్ళాన్ని వదలలేక తిరుగుతున్నాడని-బాబు! నాకు సిగ్గు కల్గించకు."

ఎన్నో జాగ్రత్తలు చెప్పి కంటకాపల్లికి రామారావు వెళ్ళిపోయేడు. మర్నాడు ట్రెయినులో ఆఫీసుకు వెళ్తున్నప్పుడు జయలక్ష్మి కోసం కొత్తవలస స్టేషనులో చూసేడు. జయలక్ష్మి కనుపించలేదు. జనంలో సరిగా చూడలేక పోయేననుకుని, వాల్తేరు స్టేషనులో మళ్ళీ జయలక్ష్మి కోసం గేటు దగ్గర నించుని బండి దిగి వెళ్ళేవాళ్ళనందర్నీ పరికించేడు. జయలక్ష్మి రాలేదు. ఆఫీసుకి వెళ్ళి పదకొండు గంటలకొకసారి ఫోను చేసేడు. ఆమె అవాళ ఆఫీసుకి రాలేదని తెల్సింది. రామారావు కంగారెక్కువైంది. మరుండబట్టలేక సగం రోజుకి శలవు తీసుకుని రెండు గంటలకి బస్సెక్కాడు కొత్తవలసకు.

(ఇంకా ఉంది)




### వై. వి. టి.–విజయవాడ

ఏ తల్లికైనా కన్న కొడుకు మీదున్న ప్రేమ, మమ-కారం పరాయి కొడుకుమీద ఉంటుందా?

★ కన్న కొడుకు మీదలా కాదు. కాని అభిమానం ఎందుకుండదు? ఎందుకుండకూడదు?

### పి.ఆర్.బి. – తెప్పలపహాడ్

నాస్తికులు దేవుడు లేడని, అస్తికులు దేవు-డున్నాడని కొట్టుకు ఛస్తున్నారు. వీరిద్దరి మధ్య మేము ఏ మార్గం అవలంభించాలి?

★ మధ్యే మార్గం రమేష్.. అవసరం అయి-నప్పుడున్నాడనీ అవసరం లేనప్పుడు లేడనీ– హాయిగా వుండండి.

మంత్ర తంత్ర వేదోచ్చారణ వలన మనిషి ఆయురారోగ్యం వృద్ధి చెందుతుందా?

అదేమోగాని, ముందు– పలుకు స్వచ్ఛత పెరుగుతుంది. క్షుణ్ణంగా మాట్లాడ్డం వస్తుంది.

### బి. ఎస్. డి.–అమలాపురం

నేను మోడల్ గర్ల్గా పని చేయాలనుకొంటు-న్నాను. ఎవరిని సంప్రదించాలి?

★ పెద్ద పెద్ద ఎడ్వర్టైజింగ్ ఏజెన్సీల వారితో సంప్రదించాలి.

### ఎమ్. కె. ఎమ్. ఆర్.–విశాఖపట్నం

అక్కా, రచనలు చేయాలని బుద్ధి పుడుతుంది. కాని ఎలా రాయాలో తెలియదు.....

★ వెరీ సింపుల్. ఈ ఉత్తరం రాసినట్టే–నీ వూహలూ రాయడమే!

### బి. ఎల్. వి. పి.–పాలకొల్లు

నేడు మన సమాజంలో ఒక మనిషి పెద్ద మనిషిగా చెలామణి కావడానికి మూలాధారం?

★ డబ్బు, అధికారం.

### ఆర్. జె. ఎస్.–హైదరాబాదు

నేనొక అమ్మాయిని పెళ్ళాడాలనుకొనేవాడిని. కాని ఆ అమ్మాయికి చెప్పలేదు. పెద్దలు ఒప్పుకోరని పెద్దలకీ చెప్పలేదు. మాకు వేరే వేరే సంబంధాలు అయ్యాయి. సమస్య–వచ్చింది యిప్పుడు–ఆ అమ్మాయి రోజూ కంపెనీలో కనబడుతోంది. ఆమె మాట్లాడినప్పుడు నాకు షాక్. ఆందోళన. ఏం చెయ్యాలి?

★ మీ కోరికే తెలియని ఆమె హాయిగా వుంటే–మీ కెందు కింత యిది?! లేదా యిప్పుడు చెప్పాలను-కుంటున్నారా?!

### జి. ఎన్. ఎల్. ఎస్. బొంబాయి

అక్కయ్యగారూ, నేటి రాజకీయ "బెబ్బులి" ఎన్. టి. ఆర్.పై మీ అభిప్రాయం?

★ మంచి మనిషి.

### సి. హెచ్. ఎన్. ఆర్.–సత్తెనపల్లి

సినిమాలలో, నవలలలో చూపించే సమాజం కన్న మన సమాజం యింకా చాలా పతనమైనదంటాను.

★ నిజమే. కనీసం వాటిలో–చివరికేనా–చెడు ఓడిపోవడం కన్పిస్తుంది.

ఆత్మహత్యలు చేసుకోపోయి కొందరు విఫలులు అవుతారు. వారిని ప్రభుత్వం శిక్షిస్తుంది. ఎందుకు?

★ చావడానికి ప్రయత్నించినందుకు!

కె. రామలక్ష్మిగారూ ప్లీజ్! విమానయానం చేయ కండి. ఎందుకో తెలుసా?

★ ఫరవాలేదయ్యా చీమకుట్టీ! ఈమధ్య కాస్త బరువు తగ్గానంటున్నారు!!

స్వచ్ఛంద సేవా సంస్థలపై మీ అభిప్రాయం?

★ సేవా కార్యక్రమాలు పూర్తిగా రాజకీయాలలో పడిపోకుండా వున్నాయంటే–దానికి కారణమ్– స్వచ్ఛంద సేవా సంస్థలు. ఏవో కొన్ని 'స్వయం సేవా' సంస్థలయ్యాయని–అన్నిటినీ తోసి రాజనకూడదు.

### టి. జె. ఆర్. విజయవాడ.

అక్కయ్యా మీ పిల్లవాడికి కట్నం తీసుకుంటావా లేక పిల్లకు యిస్తావా

★ ఎందుకు? పిల్లని తెచ్చుకోడం, పిల్లని యివ్వడం – మన సంతోషంకోసం చేసేవి. కొనేవి కావు.

### కె. ఎ. మచిలీపట్నం

నిజంకంటే చాలా గొప్పది కథ. కాదా?

★ అవును.... ఆదర్శం, ఆశయం జోడిస్తుంది కదా!

మీరు చిన్న చిన్న జవాబులు యిస్తారు. మీ చేత పెద్ద జవాబు చెప్పించుకొనే ప్రశ్న వేయాలని ఉంది.

★ ప్చ్! లాభం లేదు. నాలుగు లైన్లు రాసి అలిసిపోతాన్నేను!

### వెంకట్; ఉరవకొండ

ఈనాడు సమాజం రేప్ సమాజంగా మారకుండా ఉండాలంటే మీరు సూచించే మార్గాలేమిటి?

★ 1. సినిమాలలో రేప్‌ని గ్లోరిఫై చేయనీయ-కుండా తీసి పారేయడం 2. రేప్ కేసులు 'రహస్య' విచారణ చేయడం, 3. రేపిస్టుకి (రేప్ అయిన అభాగినికి కాదు) పబ్లిసిటీ యివ్వడం కొన్ని మార్గాలు.

భార్య ఆశించేది అనురాగం అయితే వెలయాలు?

★ అర్థ సంపద.

గడచిన రోజుల కంటే గడవబోయే రోజులు తియ్యగా వుంటాయని అందరూ అనుకోడానికి కారణం?

★ ....ఇంకా అనుభవంలోకి రానివి- ఆశాజనకంగా తియ్యగా అనిపించడం మానవ సహజం.

ఆడదానికి ప్రాణం కంటే శీలం ముఖ్యం అనే వాళ్ళలో మీరూ ఒకరని నా అభిప్రాయం.

★ ఆడదానికీ – మగవాడికీ కూడా – శీలం ముఖ్యమేనని – నేననుకుంటాను. అడ్డమైన తిరు-గుళ్ళు తిరిగేవాడు శీలవతి అయిన దానికోసం ఆశపడ్డంలో అర్థం వుందా? □



# ప్రతిభావంతమైన లివర్ మార్పిడి




శస్త్ర చికిత్స చేయటానికి తెలివి, సామర్థ్యంతో పాటు ఎంతో నైపుణ్యం కావాలి. అందులోనూ గుండె, మూత్రపిండం, లివర్ వంటి అంగాలను మార్పిడీ చేసే శస్త్ర చికిత్సల విషయంలో ఎంతో నేర్పు, సహనం ఉండాలి. లివర్ మార్పిడి ఎంతో కష్టమైనది. 3, 4 గంటలలో గుండెను కాని, మూత్రపిండాన్ని కాని మార్చవచ్చు. లివర్ మార్చాలంటే కనీసం 10 గంటల వ్యవధి కావాలి. అరవై ఘంది వరకు కూడుకొన్న చురుకైన డాక్టర్లు, నర్సులు, సాకేంతిక నిపుణులు అనుక్షణం అందుబాటులో ఉండాలి. అవసరమైతే ఒక రాత్రి, ఒక పగలు కంటిమీద కునుకు లేకుండా పని చేయవలసి వస్తుంది.

లివర్ మార్పిడి ఎందుకంత కష్టమని ఎవరైనా ప్రశ్నించవచ్చు. గుండెను మార్చగా లేనిది, మూత్రపిండాన్ని మార్చగా లేనిది – లివర్‌ను మార్చితేనే ఎందుకు ఇబ్బంది వస్తుందనే అనుమానం కలుగడం ఎవరికైనా సహజమే. ఎంతగా శీతల ఉష్ణోగ్రత వద్ద ఉంచి జాగ్రత్త పడినా లివర్‌ను బయట ఉంచితే 7 గంటలలోగా తన శక్తిని కోల్పోయి నిర్జీవమవుతుంది. ఇదొక ప్రధాన సాంకేతిక సమస్య. అయితే ఇట్లాంటి సమస్య గుండెకు, మూత్రపిండానికి కూడ ఉంది. పోతే లివర్ పని చేస్తోందా లేదా అని రోగికి నిర్ధారించేలోపే పరిస్థితి చెయ్యి దాటిపోయే అవకాశం మెండుగా ఉన్నట్లు పిట్స్‌బర్గ్‌కు చెందిన లివర్ మార్పిడి నిపుణులు తెలియ జేస్తున్నారు. అదీగాక లివర్ కొన్ని వందల కార్యకలాపాలను నిర్వహిస్తూ ఉంటుంది. గుండెలాగ, మూత్రపిండంలాగ దీని విధులు పరిమితంకావు. దేహంలోని అన్ని వ్యవస్థలపై లివర్ ప్రభావం ఉంటుంది. అంతేకాక లివర్ అనేక రకాల రక్తనాళాలతో సంబంధాన్ని కలిగి ఉంది ఉరఃపంజరం క్రింది భాగంలో ఎంతో భద్రంగా, దిట్టంగా అమరి ఉంటుంది. దాన్ని తొలగించడమన్నా ప్రవేశ పెట్టడ మన్నా తలనొప్పితో కూడుకొన్న వ్యవహారమే! లివర్‌ను తొలగిస్తే రక్తస్రావం విపరీతం కావచ్చు. ఇది అపాయకరమైన అంశమని చెప్పనక్కరలేదు. అతి ముఖ్యమైన ధమనులు – పోర్టల్ ధమని, వీనా కేవాలు – లివర్ నుంచి విడివడడంవల్ల రక్తపోటులో మార్పు వస్తుంది. ఇది కూడ ప్రమాదకరమైన విషయమే. పైగా క్రొత్త లివర్‌ను ఈ ధమనులు యథాలాపంగా స్వాగతించలేవు. పైగా దాని అజమాయిషీని తిరస్కరిస్తాయి. ఇన్ని కారణాలు ఉండడంవల్లే లివర్ మార్పిడి చాల క్లిష్టమైందిగా చాలమంది భావిస్తున్న తరుణంలో పిట్స్‌బర్గ్ విశ్వ విద్యాలయానికి చెందిన వైద్య నిపుణులు – గుండె మార్పిడి, లివర్ మార్పిడి – ఆరేళ్ల స్టార్మీ జోనెస్ అనే బాలికలో వెంట వెంటనే చేసి రికార్డు సృష్టించారు. ఈ సంఘటన ఫిబ్రవరి నెలలో

పిట్స్‌బర్గ్‌లోని పిల్లల ఆసుపత్రిలో జరిగింది ఇది అద్భుతంగా చెప్పుకొంటున్నారు! పిట్స్‌బర్గ్ సర్జన్ డాక్టర్ బయర్స్ షా దీన్ని క్రొత్త మలుపని అంటున్నారు.

లివర్ మార్పిడి ప్రయోగాలు క్రీ. శ 1963 నుంచె మొదలైనా క్రీ. శ 1967 నాటికి కాని విజయవంతం కాలేకపోయింది. కొలరాడో విశ్వ విద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ థామస్ స్టార్‌జల్, డెన్‌వర్‌కు చెందిన 18 నెలల పసిపాపకు క్రీ శ. 1967 చివరలో లివర్ మార్పిడి విజయవంతంగా చేసారు అయితే ఆ పాప ఆ తరువాత 13 నెలలకే చచ్చిపోయింది




అప్పటినుంచి నేటివరకు స్టార్‌జల్ 400 పైచిలుకు లివర్ మార్పిడి శస్త్ర చికిత్సలు కొనసాగించారు దీనికంతా కారణం 'సైక్లోస్పొరైన్' అనే మందని ఆయన అంటారు.

భూమి పొరల్లో లక్ష్యమయ్యే బూజునుంచి 'సైక్లోస్పొరైన్' మందును తయారు చేస్తారు. మొదట్లో దీన్ని ఆంటీ బయాటిక్ అని అనుకొన్నా అది వాస్తవం కాదని తరువాత తేలింది. అంతేకాదు వ్యాధులు రాకుండా ఈ 'సైక్లోస్పొరైన్' ఏ మాత్రము తోడు-పడదని స్పష్టంగా తెలిసింది పైగా రోగ నిరోధక శక్తిని బాగా తగ్గించసాగింది ఈ గుణం లివర్ మార్పిడికి సహకరించిందని చెప్పాలి. ఈ మందును ఉపయోగించి క్రొత్త లివర్‌ను ప్రవేశపెడితే రోగిలో తిరస్కారభావం బాగా తగ్గింది. అంటే పరాయిదని భావించబడే శరీరాంగాన్ని మిగతా అవయవాలు ఈ మందు ప్రభావంచేత తమలో ఒకటిగా తల-బోస్తున్నాయని అనుకోవచ్చు అది వాస్తవం కూడ! స్టార్‌జల్ లివర్ మార్పిడి పథకాలకు తాళం తీసింది 'సైక్లోస్పొరైన్' అని అన్నారు 'సైక్లోస్పొరైన్'పై మరింత లోతుగా పరిశోధన జరుపవలసి ఉందని పిట్స్‌బర్గ్‌కు చెందిన లివర్ నిపుణుడు డాక్టర్ కార్ల్ గార్ట్‌నర్ చెప్పారు బహుశా లివర్ మార్పిడి ప్రాముఖ్యాన్ని గుర్తించి కాబోలు అమెరికా అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్ లివర్‌లను దానం చేయ-వలసిందిగా దేశ ప్రజల నుద్దేశించి రేడియోలోను, టెలివిజన్‌లోనూ ఒక ప్రకటన చేసారు

నీరసంగా ఉన్నప్పుడు తాజాగా శక్తినందిస్తుంది లివర్ ప్రొటీన్లను తయారు చేస్తుంది విష పదా-ర్థాలతో పోరాడి వాటి ప్రభావాన్ని పడగొడుతుంది రక్తం గడ్డ కట్టకుండా చూస్తుంది. హార్మోన్ల మోతాదును సరితూచుతుంది. ఖనిజ లవణాలను, విటమిన్‌లను నిలువ ఉంచుతుంది క్రొవ్వు పదార్థాల విశ్లేషణలో తోడు పడుతుంది రోగ నిరోధక శక్తిని పెంచే ఎన్నో కారకాలను కలిగి ఉంటుంది ఇదంతా లివర్ చేసే పనులలో కొన్ని మాత్రమే! ఇన్ని విధులను నిర్వహించే లివర్ చెడిపోతే ఎంత నష్టమో చెప్పనక్కరలేదు. కాబట్టి లివర్ మార్పిడి ఆపరేషన్‌లు ఎంతో సజావుగా, సులువుగా కొనసాగేటట్లు పరిశోధనలు చేయవలసి ఉంది లివర్ మార్పిడి శస్త్ర చికిత్సకు రెండు లక్షల



(!) లివర్‌ను వెలికితీయడం, క్షేమంగా భద్రపరచడం, పకడ్బందీగా దేహంలో అమర్చడం ఎంతో కష్టంతో కూడు కొన్న పని !

డాలర్‌లను ఖర్చు పెట్టవలసి వస్తోంది! ఇది సామా-న్యుడు భరించగలడా? అందరికీ అందుబాటులో ఈ సౌకర్యం ఉండేలా శ్రమించవలసిన అవసరం శాస్త్ర-వేత్తలకు ఉంది.

**—డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు**

## గమనిక

డాక్టర్ సలహాలు, ప్రశ్నావళి శీర్షికలకి ప్రశ్నలు పంపేవారు ఆ శీర్షిక పేర, ఆంధ్రసచిత్ర-వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి. రాసిన వారి పేరు, పూర్తి చిరునామా ఇవ్వడం ఎంతైనా అవసరం అని గమనించగోరుతున్నాము. సం.

# సబ్బు బిళ్ళ

ఉదయం ఆరు

డాబా మెట్లమీద కూర్చున్న బుజ్జిమనసు పుస్తకం మీద నిలవటంలేదు. రాత్రి జరిగిన సంగతులు గుర్తు కొస్తుంటే దుఃఖం పొంగు కొస్తోంది-తండ్రిపై చెప్పలేనంత ఉక్రోషమూ, కోపమూ కలిగాయి

నాగార్జునాసాగర్ డామ్ చూడాలని తన కెప్పట్నించో కోరిక. పాఠాల్లో చదువుకున్నప్పుడే అక్కడి దృశ్యాన్నంతా మనసులోనే చూసి నిజంగా చూసినట్టు అనుభూతి చెంది ఆనందించాడు అటువంటిది... యీ సంవత్సరం బడిపిల్లల విహారయాత్ర అక్కడికి వేయడం తన కెంత ఆనందాన్నిచ్చిందో! ఎంచక్కా బడిపిల్లలతోనూ మాష్టర్లతోనూ హాయిగా వెళ్ళి అన్నీ చూడొచ్చనుకున్నాడు. అప్పటికప్పుడే చాలమంది పేర్లిచ్చేశారు కానీ తన విషయంలో జరిగిందేమిటి? తనలోని ఉత్సాహాన్నంతా చల్లార్చేశాడు నాన్న

'యాభై రూపాయలంటే మాటలా ఇప్పుడింటి పరిస్థితి కూడా చాల యిబ్బందిగా వుంది - మరోమారు వెళ్ళొచ్చుగానిలే, అన్నాడు రాత్రి తను అడగ్గానే

'మరోమాటంటే ఎప్పుడు? తమ యింట్లో డబ్బు యిబ్బందిలేని దెప్పుడు?' కోపం, ఉక్రోషం, దుఃఖం అన్నీ ఒక్కమారు ముంచుకొచ్చాయి రాత్రంతా అమ్మ పక్కలో పడుకుని ఏడ్చాడు

అమ్మ ఏవేవో చెప్పింది 'పెద్దవాడవౌతున్నావు గదా నువ్వు యింటి పరిస్థితులు ఆలోచించాలి మరి. నాలుగువేళ్ళూ నోట్లో కెళ్ళడమే కష్టమైపోతున్న రోజులివి - 'ఇటువంటివన్నీ మనలాంటి వాళ్ళకు కాదమ్మా' అంది. అమ్మ మాటలేవీ తను వినదల్చుకోలేదు - నాన్న చాలీచాలని జీతం; పెరిగి-



పోతున్న యింటి ఖర్చులూ, [illegible] యిబ్బందులూ.... యివన్నీ చెప్పి తనకు నచ్చజెప్పాలని చూసింది అమ్మ -

ఏమైతేనేం తనతోటి పిల్లల్లో వున్న సంతోషం తనలో లేకుండా చేశారు. తమకు డబ్బులేకపోవడం నాన్న అసమర్ధతకు నిదర్శనం కాదా అన్పిస్తుంది-

బుజ్జి చేతిలోని పుస్తకంలోని కాగితాలు గాలికి రెపరెపలాడాయి. ఎంత ప్రయత్నించినా దృష్టి లెక్కల మీదికి మళ్లటం లేదు.

రోడ్డు మీదేదో స్కూటర్ వెళ్ళిన శబ్దమైతే మెడలు రిక్కించి చూశాడు - స్కూటర్‌మీద రాజేష్‌గాడూ వాళ్ళనాన్నా అప్పుడే ట్రిమ్‌గా తయారైపోయి వాళ్ల-నాన్న వెనకాల కూర్చొని ప్రైవేటుకి కాబోలు వెళ్ళి-పోతున్నాడు

వెళ్ళిపోతున్న వాడల్లా బుజ్జిని చూసి చెయ్యి-వూపి టాటా కూడ చెప్పేడు బుజ్జికి రాజేష్‌ని చూస్తే నిజంగానే యీర్ష్య కలిగింది - వెధవ ఆ స్కూల్ డ్రస్‌లో ఎంత బావుంటాడనీ! లేత నీలం చొక్కా, నేవీ





- ఆదూరి వెంకట సీతారామమూర్తి

బ్లూ నిక్కరూ, చారల టై, బూట్లూ.... అచ్చం దొరబాబులా వుంటాడు. దానికి తోడు రెండు భుజాలకీ తగిలించుకునే పుస్తకాల సంచి, అందమైన వాటర్ బాటిలూ –

రాజేష్‌తో పోల్చుకుని తనకుతానే జాలిపడ్డాడు బుజ్జి. తనకున్నవి మూడు జతల బట్టలు. అంతే. చెప్పులు కొనుక్కుని ఎన్నాళ్ళయిందో గుర్తేలేదు కాస్త గట్టిగా పాదం మోపితే పుటుక్కున తెగి వూరుకుంటుంది. దానికొసం ఎప్పుడూ మొలతాడుకి పిన్నీసు రడీగా వుండాల్సిందే! ఇక పుస్తకాలు చూస్తే ఒకటుంటే ఒకటుండదు-

'ఒరే బుజ్జీ. ఎక్కడున్నావురా. ఆ లెక్కలేవో చేయడం అయితే రా. స్నానం చేద్దూగాని' లోపల్నించి అమ్మ కేక విన్పించింది. అయినా సరె సమాధాన మివ్వకుండా అలాగే కూర్చున్నాడు బుజ్జి.

'ఇక్కడే వుండి మాట్లాడవేం? అమ్మ పిలుస్తోందిరా స్నానంచేసి వస్తే చద్దన్నంపెడుతుందిట వెళ్ళు' అంటూ వచ్చింది చిన్నక్క.

చన్నీళ్ల స్నానం; చద్దన్నం అన్ని కాలాల్లోనూ అదే! ఆరోగ్యంట.... ఆరోగ్యం! రాజేష్ ఎప్పుడూ వేన్నీళ్ల స్నానమే చేస్తాడట. లేవగానే బోర్నవిటానో బూస్టో తాగి, బడికెళ్లే ముందు టిఫిన్ చేస్తాడట –

'ఎన్నిసార్లు పిలవాలిరా బాబూ. కదలవేం? అవతల పొద్దెక్కిపోతోంది. మడి కట్టుకోవద్దూ' లోపల్నించి అమ్మే వచ్చింది.

'[illegible] వర్క్ యింకా వుండిపోయిందే' విసుగ్గానే అన్నాడు.

'తర్వాత చేసుకుందూగాని లేరా.

అయిష్టంగానే కదిలాడు బుజ్జి. వెళ్లి, టాపులేని బాత్రూంలోకి దూరి దడేల్మని తలుపేసుకున్నాడు – నీళ్లగోలెంలో చెయ్యిపెడితే చలిగా వున్నట్లనిపించింది. ముక్కాలిపీటమీద కూర్చొని ఆకాశంవంక చూశాడు- ఆకాశం నీలంగా ఎంత బావుందో. లేత ఎండలో హాయిగా స్వేచ్ఛగా దూది మబ్బుల మధ్య ఎగురుతున్నాయి రెండు పక్షులు, బుజ్జి ఆలోచనలు ఎక్కడెక్కడికో పోయాయి.

'ఏం చేస్తున్నావురా లోపల... అయిందా స్నానం' మళ్లీ అమ్మ కేక-

లేచి, బద్ధకంగా వొళ్ళు విరుచుకుని, కళ్ళు మూసుకుని మొదటి చెంబు నెత్తిమీద దిమ్మరించుకున్నాడు. చలి అన్పించినా ఆ వెంట వెంటనే మరి నాలుగు చెంబులు పోసుకుని సబ్బుకోసం గూట్లోకి చెయ్యి చాపేడు. ఆరోజే కాగితం వుడదీసి పెట్టిన సబ్బే అయినా దాన్ని చూసి నీరుగారిపోయాడు. తమ దరిద్రమంతా ఆ సబ్బులోనే కన్పించింది బుజ్జికి.

రాజేష్ యింట్లో ఎప్పుడూ సాండిల్ సబ్బులూ, విదేశీ సబ్బులూ వాడతారట.

విదేశీ కాదుగదా స్వదేశీ సబ్బుల్లోనే మంచివి కొనరు తమ ఇంట్లో ఎప్పుడూ ఆ ఎర్ర సబ్బే – అదే ఆరోగ్యంట – నలుగురున్న యింట ఆటొస్తాయి అంటుంది అమ్మ. సామాన్లు తనే తెస్తాడు. ఏం లాభం? ఎప్పుడూ కొననివ్వరు – ఈ మారు ఏదోలా ఓ మంచి సబ్బు. తన కిష్టమైన సబ్బు కొనెయ్యాలి అనుకున్నాడు బుజ్జి – ఎందుకో అన్ని విషయాల్లోనూ తను సర్దుకోవడమే అవుతోంది

స్నానం చేసొచ్చేక, కొంకీకున్న చొక్కాలాగును చూస్తే డోకొచ్చింది. నలిగి, మాసిపోయి వున్నాయవి – రాజేష్‌గాడి ఇస్త్రీ టెరికాటన్ బట్టలతో పోల్చుకున్నాడు – అంతే! వాటి నక్కడే గిరవాటు పెట్టి నెమ్మదిగా బట్టల పెట్టె మూత తెరిచాడు – గలేబులూ, తువ్వాళ్ళూ, చిన్నక్క బట్టలూ, తనబట్టలూ ... అన్నీ అందులోనే. . చిందర వందరగా వున్నాయి




ఉన్న వాటిల్లో కాస్త కొత్త జత తీసివేసుకున్నాడు – అవి ఆర్నెల్ల క్రితం పుట్టినరోజుకి కుట్టించుకున్నవి.

'ఒరే ఒరే బుజ్జీ కొట్టుకెళ్లి ఓ అరకేజీ వంకాయలూ ఓ పావుకేజీ చింతపండూ తీసుకురావురా' అంటూ గదిలో కొచ్చింది అమ్మ – ఆ వెనకే నాన్న.

"అదేంటి అవి వేసుకున్నావ్. స్కూలికి ఆ బట్టలెందుకూ' అన్నాడు నాన్న 'స్కూలుకి ఎప్పుడూ శుభ్రమైన బట్టలే వేసుకోవాలిగాని, షోకైనవి వేసుకోకూడదు – తెల్సా – ఎక్కడికేనా వెళ్లేప్పుడు నీ యిష్టం వచ్చినవి వేస్కోవచ్చు.! అన్నాడు. తిరిగి –

'పోన్లెస్తురూ – ఎన్నాళ్ళు దాస్తాడూ. పొట్టి అయిపూరుకుంటాయి – యిప్పుడా నియమా లెవరు పాటిస్తున్నారూ' అంది అమ్మ

'బావుందే – నువ్వూ వాడికిలాగే మప్పు –' అన్నాడు నాన్న.

'పోనీ.... వేసేసుకున్నాడుగా యీసారికి కానీండి' అంది అమ్మ ఏ కళనున్నాడో నాన్న వూరుకున్నాడు – లేకుంటే విప్పించిపెట్లో పెట్టించే వాడే!

అమ్మ యిచ్చిన డబ్బులూ సంచీ తీసుకుని బయల్దేరేడు బుజ్జి 'వంకాయలు మంచివి తీసుకు రారా' హెచ్చరించింది అమ్మ మూతి మూడొంకర్లు తిప్పేడు బుజ్జి. 'ఒరేయ్. అందులోనే ఓ బ్లేడు కూడ తీసుకురా' పురమాయించేడు నాన్న –

ఇలాంటి బజారు చేయడమంటేనే చిరాకు బుజ్జికి ఎప్పుడు ఏది అయిపోతే అప్పుడే బజారు అత్యవసర వస్తువులు కూడ నాలుగైదు రోజులకు సరిపడా తెచ్చుకొడానికి వీలుండదు ఎంచేతో.

చిరాగ్గానే గుమ్మందాటేడు బుజ్జి –

దారి పొడుగునా ఆలోచనలే. తన యీడు పిల్లలందరికంటే తను ఏదో విధంగా తక్కువగానే వున్నాడనిపించింది – కారణాలేమైనా అది మాత్రం సహించలేకుండా వున్నాడు బుజ్జి ముఖ్యంగా కనీస కోర్కెలు కూడ తీరకుండా వుంటే బాధకాదూ?

చిన్నప్పుడు కష్టాలుపడి, చదువుకుని గొప్పవారైన దేశ నాయకుల, సైంటిస్టుల జీవిత కథలు నాన్న చెప్పినవి గుర్తొచ్చి, రేపొద్దున్న తను గొప్పవాడైతే తనలాంటి పిల్ల లందరిలో వున్న అసంతృప్తిని పోగొట్టాలనుకున్నాడు – కానీ అదెలా సంభవమో వూహించలేక పోయాడు

తల్లికి కూరల సంచీ అందించి, చద్దన్నం తిని మళ్లీ లెక్కల పుస్తకం తిసుకుని బయటకొచ్చాడు మెడమెట్ల మీద ఎండ పడుతోంది మెట్లక్రింద నీడలో గచ్చుమీద కూర్చుని పుస్తకం విప్పేడు మళ్లీ మనసు విహారయాత్ర మీదికే పోయింది-

ఏదో వింత పిట్ట అరచినట్టై తలెత్తి పారిజాతం చెట్టు వంక చూశాడు బుజ్జి – చెట్టు నిండా విరబూసిన పూలు! గాలికి కదిలి ఒకటీ ఒకటీ నేలమీదికి రాలిపోతున్నాయి. క్రిందంతా నేల కనబడకుండా పరచినట్లు పూలు! ఆ పారిజాతం చెట్టు చిన్నకొమ్మల మీద ఎగురుతూ అరుస్తున్నాయి రెండు చిన్న పిట్టలు – పిచ్చుకలాగే వున్నా అంతకంటే చిన్నవీ, రంగు రూపంలో కాస్త విభిన్నమైనవీ- వాటిని చూస్తే ఎంతో సంతోషమనిపించింది బుజ్జికి. హాయిగా స్వేచ్ఛగా; బాధల్లేకుండా వున్నాయి. 'పక్షి బ్రతుకే బ్రతుకు' అనుకున్నాడు.

ఇంతలో వీధి గేటు దగ్గర ఎవరో తచ్చాడుతున్నట్లయి అటు చూశాడు బుజ్జి ఎదురింటి వాళ్లకి పాలుపోసే కుర్రాడు – నవ్వుతూ కన్పించాడు! 'బాబూ ఓ రెండు గులాప్పువ్వు లివ్వరా' – అడిగాడు – బుజ్జి గులాబి మొక్క వంక చూశాడు ఆరేడు పువ్వులున్నాయి. అయితే మాత్రం 'మేం మొక్కలు పెంచుకొంటున్నది నీకు పువ్వునివ్వడానిక్కాదు వెళ్ళు' అన్నాడు కోపంగానే – మొక్కకున్న పువ్వుల్ని తెంపితే ఎందుకో సహించలేడు తను.

'అమ్మగార్పతగండి బాబూ' అంటున్నాడు వాడు –

'ఎవర్నీ అడక్కర్లేదు. యివ్వం వెళ్ళు' గసిరేశాడు.

వాడనుకొన్నది నిజమే – ఇంట్లో ఎవర్నడిగినా లేదనకుండా ఏదో వువ్వులిచ్చి వంపుతారు.

'ఎవరి మీదరా ఆ కేకలూ' అంటూ వచ్చింది చిన్నక్క

'రంగడు – పిల్లల సినిమా ఏదో వచ్చిందట – రమ్మంటున్నాడు' కావాలనే అబద్ధమాడేడు

'వన్నేదు వెధవకి తన్ని వంపలేకపోయావ్' లోపలికి వెళ్ళిపోతున్న చిన్నక్కవైపు చూసి వెక్కిరింపుగా వళ్ళికిలించాడు

బుజ్జికి ఎందుకో చెప్పలేనంత విసుగ్గా వుంది. కోపంగానూ, వుక్రోషంగానూ వుంది

తొమ్మిదివగానే లేచి పుస్తకాలు సర్దుకుని సంచీని భుజానికి తగుల్చుకున్నాడు గుమ్మందాటుతూంటే అమ్మ కేకేసింది "బడికేనట్రా చెప్పకుండా వెళ్ళిపోతావేం? కేరేజీ తీస్కెళ్ళవ్?"

నిజానికి తీసుకెళ్ళాలని లేదు కానీ నాన్న వింటే రాద్ధాంతం చేస్తాడు అయిష్టంగానే కేరేజీ తీసుకుని బయల్దేరేడు కాస్త దూరం వెళ్ళేడో లేదో వేవీ కాన్వెంట్ పిల్లలందరూ ఎంచక్కా ముచ్చట గొలిపే స్కూల్ డ్రస్‌లో కన్పించారు నవ్వుతూ, తుళ్ళుతూ ఏవేవో మాట్లాడుకుంటూ – రోజూ వాళ్ళ స్కూలు ముందు నించే వెళతాడు తను బడికి అందమైన స్కూలు భవనం, పెద్ద ఆటస్థలం పూలతోట – ఎందుకో ఆ పిల్లల్ని చూస్తే ఈర్ష్య కలిగింది బుజ్జికి. తనకు అటువంటి యింగ్లీషు మీడియం స్కూళ్ళలో చదువు చెప్పించనందుకు నాన్నమీద కోపమొచ్చింది ఎప్పుడూ ఏమడిగినా 'డబ్బులుండొద్దూ?' అంటుంది అమ్మ. అందరికీ వున్న డబ్బు తమ కెందుకుండదో అర్థంకాదు

తను హైస్కూలు హోంవర్కు కూడా చేయలేదన్న సంగతి చటుక్కున్న గుర్తుకొచ్చింది బుజ్జికి దానికి శిక్షేమిటో తనకు బాగా తెల్సు – ఆ ఆలోచన రాగానే బడికి వెళ్ళాలనిపించలేదు బుజ్జికి బళ్ళో పాఠాలు చెప్పే సమయంకంటే చెప్పని సమయమే ఎక్కువ నడుస్తున్న బుజ్జి కాళ్ళు మరోమార్గం పట్టాయి

ఎక్కడెక్కడ తిరిగాడో! పన్నెండయ్యేసరికి బాగా అలసిపోయాడు – తీక్షణమైన ఎండలో తిరిగేడేమో ఒళ్ళంతా వేడెక్కింది. కొద్దిగా తలనొప్పి మొదలయ్యింది ఏమైతే అయిందని యింటిదారి పట్టాడు బుజ్జి –

గుమ్మంలోనే అమ్మ ఎదురైంది బుజ్జిని చూడగానే ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగాయామెకు. 'వచ్చావా రా రా ఎవరొచ్చారో చూడు' అంది ఇంకెవరూ? పెద్దక్క పిల్లలు యింట్లో బిల బిల్లాడుతూ తిరుగుతున్నారు – గుండెల్లో రాయి పడింది బుజ్జికి యీమారు పండక్కయినా పట్టుబట్టి మంచి బట్టలూ; బూటూ కొనిపించుకోవాలనుకున్నాడు – ఇక అయినట్టే తనడిగితే డబ్బులేదని కొనని నాన్న అక్కయా, పిల్లలూ వస్తే వాళ్ళు

# సబ్బు బిళ్ళ

వెళ్ళేటప్పుడు అందరికీ బట్టలిస్తా డు – పాపం అక్కయ్య వచ్చనే అంటుంది

అక్కయ్య పెద్ద కొడుకు అప్పుడే తన పుస్తకాల గూడు సర్దేసి, స్టాంపులూ, స్టిక్కర్లూ తీసేసుకున్నాడు అక్కయ్య మాత్రం తనను చూడగానే 'అదేంరా అలా వున్నావ్' అంటూ తల నిమిరింది. తలనెప్పని తెల్సుకున్నాక అమృతాంజనం రాసి కాస్సేపు పడుకోమంది గొడవ చెయ్యకండని పిల్లల్ని మరో గదిలోకి పంపేసింది

అలసట మీదున్నాడేమో వెంటనే నిద్రపట్టేసింది బుజ్జికి

మెలకువ వచ్చేసరికి – మూడు దాటింది కడుపులో ఆకలి కరకరలాడ్డం మొదలెట్టింది లేచి, పెరట్లో కెళ్ళి ముఖం కడుక్కుని వచ్చేడు తలనొప్పి కాస్త తగ్గింది వంటింట్లో అమ్మేదో టిఫిన్ చేస్తోంది

'లేచావా ఎలా వుంది తలనొప్పి?' అంటూ, వచ్చింది అక్కయ్య

'పోయిందిలే' నిర్లక్ష్యంగా అన్నాడు

'టిఫిన్ తిందూగాని రా' లోపలికి తీసుకు వెళ్ళింది.

అక్కయ్యను తనెప్పుడూ ద్వేషిస్తూనే ఉంటాడు. కానీ తనంటే అక్కయ్యకు అభిమానమే.

'మీ బావగారు నీ కోసం ఏదో పంపించారు చూడూ' టిఫిన్ చేశాక అందించిం దక్కయ్య –

పొట్లం విప్పి చూశాడు తనెన్నాళ్ళ నుండో కావాలని కోరుకుంటున్న కాలర్ బనీను – మంచి రంగులో ఎంత బాగుందో! గుండీలుండాల్సిన చోట జిప్ కూడా వుంది.

బుజ్జి కళ్ళు ఆనందంతో మెరిశాయి

'బావుంది మరి'

తలూపేడు సంతోషంగానే –

దాన్ని అప్పుడే వేసుకోవాలనిపించింది బుజ్జికి నాన్న వస్తే ఒప్పుకోడు. 'ఇప్పుడెందుకురా ఏ పండక్కో వేసుకుందూలే' అంటాడు. కానీ అంత వరకూ ఆగాలనిలేదు. 'వేసుకోనా మరి' అడిగాడు అక్కయ్యని బతిమాలే ధోరణిలో.

వేసుకోమన్నట్లు తలూపింది అక్కయ్య

ఉదయంనించీ ఉన్న అశాంతంతా పోయి కొత్త వుత్సాహ మొచ్చింది బుజ్జికి. ఉన్న వాటిల్లో మంచి నిక్కరు వేసుకొని దానిమీద కొత్త బనీనూ వేసుకున్నాడు నాన్న ఇంటి కొచ్చేలోగా రాజేష్ గాడికి

అంతే–అనుకున్నదే తడవుగా అమ్మతో చెప్పి బయల్దేరాడు

ఎంత త్వరగా ఆశగా వెళ్ళాడో అంత నిరాశ ఎదురైంది రాజేష్‌గాడింటికి తాళం వేసి వుంది బుజ్జికి చాలా నిరాశ కలిగింది. ఇంకెవరికి చూపడం? ఆ చుట్టు పక్కల తన స్కూలు పిల్లలే లేరు–అంతా కాన్వెంటు పిల్లలే–ఎలాగో ఒక్క రాజేష్ గాడిని మాత్రం స్నేహం చేసుకున్నాడు–

ఇంటికి పోబుద్ధి కాలేదు బుజ్జికి–నెమ్మదిగా అడుగు లేసుకుంటూ కాన్వెంటు గ్రౌండ్ వైపు నడిచాడు–అక్కడ కొందరు పిల్లలు క్రికెట్ మరి కొందరు హాకీ ఆడుకుంటున్నారు–బుజ్జికి వాళ్ళని చూస్తే ముచ్చటేసింది. ఇంచుమించు తన యీడు వాళ్ళే వాళ్ళూను

తనకే వుంది స్కూలు–ఎందుకూ ఓ ఆట స్థలమూ వుండదు–ఆటలూ నేర్పరు తను చదివే స్కూలు మీద విపరీతమైన ఏహ్యాభావం కలిగింది బుజ్జికి

సరిగ్గా ఆ సమయంలోనే కన్పించాడు రాజేష్ వీపుమీద పుస్తకాల్మూట–చేతిలో కేరేజీ వాటర్ బాటిలూ

వాటిని చూడ్డంతోనే వాడి దృష్టిలో తన కొత్త బనీను పడాలని కాలరు సర్దుకొని బనీను కిందికి లాక్కున్నాడు అయినా రాజేష్ అదేం గమనించలేదు.

'ఏరా రాజేష్–ఇంకా యింటికి వెళ్ళలేదూ మీ యింటి కెళ్ళొస్తున్నా' అన్నాడు

'అప్పుడే వెళ్ళనుగా–ఎవరన్నా వచ్చారా ఇంటికి' అడిగేడు వాడు ఆత్రంగా

'లేదు–తాళం వుంది' అని, అప్పటికే వాడు తనలోని 'కొత్త'ను గుర్తించకపోడంతో

'కొత్త బనీనురా చూశావా మా అక్కయ్య తెచ్చింది బావగారు కలకత్తా నుంచి పంపేరు' అన్నాడు గొప్పగా

అప్పుడు చూశాడు రాజేష్ దానివంక పరీక్షగా

'బావుంది' అని కూడా అన్నాడు

బుజ్జి కెంతో సంతోషం కలిగింది వాడన్న ఆ ముక్కకే

'నీకూ వుంది కదూ యిలాంటిదీ'

'ఉందిలే'

'మీ అక్కయ్యే తెచ్చిందా'

'నాకు అక్కయ్యలూ లేరు ఎవరూ లేరు నేనే పెద్ద కదా– మా యింటికి చుట్టాలు కూడా ఎవరూ రారు' అన్నాడు రాజేష్ నిరాశగా

'ఎవరూ లేకుండా ఎలా'

'అలాగే–'

బుజ్జికి యింకేం అడగాలో బోధపడలేదు–– బట్టలూ, బూట్లూ, బెల్టూ... అన్నీ మంచివే ఖరీదైనవే వున్నా రాజేష్ అంత నిరాశగా ఎందుకన్నాడో అర్థం కాలేదు.

'మరి. సాయంకాలం స్కూలు అవంగానే యింటి కెళ్ళవా'

ఎలా వెళ్తాను–ఎవరూ వుండరుగా

'అదేం?'

"మా మమ్మీ ఆఫీసు నుండి ఆరు గంటలకు గాని రాదు–డాడీ ఎనిమిదింటికి వస్తారు. అంతవరకూ గ్రౌండ్‌లో నే వుండాలి"

రాజేష్‌లోని నిరాశకు కారణం వూహించగలిగేడు బుజ్జి–

'మరి సాయంకాలం ఏం తినవా'

తిననట్లు తలూపి; డబ్బు లిస్తారు డాడీ–కానీ ఏ మూంటాయిక్కడ 'బుజ్జికి నిజంగా జాలి కలిగింది రాజేష్‌గాడి మీద ఒక్క రోజు ఎప్పుడైనా తను

స్కూలు నుండి యింటి కొచ్చే వేళకి అమ్మ టిఫిన్ చెయ్యక పోయినా, 'పక్కింటి పిన్నిగారితో ఏ పేరంటానికో వెళ్ళినా, చికాకు కలుగుతుంది దుఃఖ మొస్తుంది–అటువంటిది రాజేష్‌గాడు రోజూ ఎలా వుంటున్నాడో.

'ఒరే రాజేష్–నీకు చక్కిలాలంటే యిష్టమేనా'

'ఓ–నీకెలా తెల్సు'

రాజేష్ ముఖం పౌర్ణమినాటి చందమామంత అవడం బుజ్జి చూశాడు

'అయితే నువ్వు మీ ఇంటికి నడస్తూ వుండు నేనిప్పుడే వస్తా' అంటూ ఒక్క పరుగు తీశాడు బుజ్జి–

ఏం చేశాడో.. ఎవరికి ఏం చెప్పాడో పది నిముషాల్లో ఓ పొట్లంతో రాజేష్ ఇంటి ముందు వాలేడు. "ఇదిగో తిను–నీ కోసం తెచ్చాను–మా అమ్మ చేసిందివాళే' అన్నాడు అలుపు తీర్చుకుంటూ–

రాజేష్ కాస్త సందేహించాడు త్వరగా తీసుకున్నాడు రాజేష్ తింటున్నంతసేపూ ఆత్రంగానూ ఆనందంగాను చూస్తూనే వున్నాడు బుజ్జి–అప్పుడు బుజ్జిలో ఎన్నో ఆలోచనలు! పొద్దున్నుంచీ ఉన్న నిరాశ, అసంతృప్తి లేవు–

'మరి చీకటి పడుతోందిగా నువ్వెళ్ళరా. నేను పక్క వాళ్ళింట్లో హోం వర్కు చేసుకుంటాను మా అమ్మ ఒచ్చేవరకూ' అన్నాడు రాజేష్

బొమ్మల్లే లేచి వచ్చేశాడు బుజ్జి

వచ్చేసరికి నాన్న ఆరుబయట వాలు కుర్చీలో కూర్చొని న్నాడు.

'మా బుజ్జిలేడబ్బాయ్ ఎటో వెళ్ళాడు' అన్నాడు బుజ్జిని చూసి. బుజ్జి నవ్వేడు నాన్న ఎప్పుడేనా అలా అంటూండడం బుజ్జికి అలవాటే.. నవ్వుతూ దగ్గర కొచ్చి బుజ్జిని చూసి

'ఒర్నువ్వట్రా! ఎవరో దొరల కుర్రాడనుకొన్నాను' అన్నాడు నవ్వుతూ–

'బావుందా మరి. అక్కయ్య తెచ్చింది. బావగారు కొన్నారుట!'

'బావుంది బావుంది'

బుజ్జికి చాలా సంతోషమేసింది. ఆక్షణమే బుజ్జి కళ్ళు చెరిగి పాతబడిపోయిన నాన్న పంచె మీద పడ్డాయి-నాన్న మీ దెప్పుడూ కోపం కలుగలేదు బుజ్జికి. జాలేసింది- అంతకంటె ఎక్కువ గౌరవం కలిగింది

'కాళ్ళూ చేతులూ కడుక్కొని చదువుకోవట్రా!' వంటిట్లోంచి అమ్మ కేకేసింది

'పోనీలేవే .. ఈ ఒక్క రోజుకీ చదువుకోపోతే యేం' అంటోంది అక్క.

బనీను విప్పి వంకెనకు తగిలించి బాత్రూంలోకి దూరేడు బుజ్జి. ముఖాన్ని చల్లని నీళ్ళతో కడుక్కొంటూ గూట్లోని సబ్బు వంక చూశాడు. ఉదయం తీసిన సబ్బు–అప్పుడే కొంత అరిగి పాత బడి పోయింది. తను అరిగిపోతూ యితరులలోని కళ్ళను కలిగేయగల దాన్ని చూస్తే బుజ్జి కెందుకో నాన్న గుర్తుకొచ్చేడు.

ప్రేమగా దాన్ని చేతులోకి తీసుకొన్నాడు బుజ్జి. □

# మార్గదర్శి ధర్మపథం




ప్రత్యేక వ్యక్తి చేయలేని పనిని, పదిమందీ చేరితే సులభంగా చెయ్యగలుగు తారు. కాని. అది సక్రమంగా జరగ డానికి తగిన మార్గదర్శి ఒకడు ఉండాలి. అతడే ఆ గుంపునకు నాయకుడని పేరు తెచ్చుకుంటాడు. తాము తలపెట్టిన పని యొక్క మంచి చెడ్డలను నిర్ణయించవలసిన బాధ్యత ఆ నాయకునిదే ! అతడు తెలివి తేటలు కలవాడైన యెడల, సంఘంలోని వారు అంత తెలివిగలవారు కాకపోయినా ప్రయోజనం ఉంటుంది. వాళ్ళు తెలివయిన వారయినా, నాయకుడు సక్రమంగా ప్రవర్తించకపోతే ప్రయోజనం ఉండదు సరిగదా, తమ కోరికకు విరుద్ధంగా కూడా జరుగవచ్చు.

నాయికుడు అనాలోచితంగా తమ నిర్ణయాన్ని తీసుకుంటే – ఆ సంఘంలోని సభ్యులందరూ గొర్రెదాటువలె ఆ నిర్ణయాన్ని అనుసరించి ప్రవర్తిస్తే కష్టాలకు గురికాక తప్పదు. ఇలాటి సందర్భంలో యజమానుడు అనుచరులను వారి అదృష్టానికి విడిచి పెట్టి తప్పుకోవడం కూడా కొన్ని సంఘటనలలో కానవస్తుంది. స్వార్ధపరులైన నాయకులు సంఘం మంచిచెడ్డలను లెక్కచెయ్యకుండా తనకు లాభించే పద్ధతిని చూచుకొవడం కూడా కానవస్తుంది.

సత్యసంధుడూ, స్వార్ధరహితుడూ, సంఘంకోసం నిరంతర కృషిచేసేవాడూ, పలుకుబడి ఉన్నవాడూ అయిన నాయికుణ్ణే సమాజ సభ్యులు ఎన్నుకోవాలి. అతని పట్ల వారికి గట్టి నమ్మకం ఉండాలి. అలాగే బాధ్యతలను నిర్వహించగల శక్తి సామర్థ్యాలు ఉన్నవాడే నాయకత్వం వహించవలసి ఉంటుంది. కొన్ని కార్మిక సంస్థలు మూతపడుటకూ, కార్మికులు మిక్కిలి కష్టపడుతూ ఉండడానికీ సంఘ నాయికుల భాధ్యత లేకపోలేదు.

ఒక్క కార్మిక సంఘాలేకాదు. ఏ సాంస్కృతిక సంస్థ అయినా, సారస్వత సంస్థ అయినా సరే, బాగుగా పని చెయ్యాలంటే వాటిని నడిపే కార్యవర్గం ఉత్సాహంతో పనిచేసి, సభ్యులకు మార్గదర్శకంగా ఉండాలి. కార్యవర్గం ఉత్సాహంతో పని చేస్తే సంఘ సభ్యులకున్నూ ఉత్సాహం కలుగు తుంది. వారి సహకారం ఎంతగానో లభిస్తుంది. సంఘం తలపెట్టిన కార్యాలు సక్రమంగా జరుగుతాయి. ఆ సంఘం అందరి ప్రశంసలనూ అందుకోగలుగుతుంది.

అందువల్ల సంఘాభివృద్ధి సంఘ నాయకుల పైనే ఆధారపడి ఉంటుందనీ, వారేతగిన మార్గం చూసి; సంఘాన్ని నడిపించాలనీ తెలుసుకోవలసి ఉన్నది. వారికి సంఘంలోని వారి తోడ్పాటు కూడా ఎంతో అవసరం.

–బులుసు వేంకటరమణయ్య. □



### అధికారి అరెస్టు!

రంగారెడ్డి జిల్లాకు చెందిన ఇబ్రహీం పట్నం తాలూకా ఆఫీసులో ఆఫీసరుగా పని చేస్తున్న మహమ్మద్ అమీనుద్దీన్ కె. వీరప్రశాంతరెడ్డి అనే అతని వద్ద వో మూడొందల రూపాయలు లంచం తీసుకుంటుండగా అవినీతి నిరోధక చట్టం వారొచ్చి ఠక్కున ఆయన్ని పట్టేశారట.

### అతి సారానికి టీకామందు!

పసి పిల్లలు ప్రపంచంలో ఏటికి విరేచనాల వల్ల 45 లక్షల వరకూ చనిపోతున్నారట ఈ రోగం కేవలం రోటా వైరస్ అనే వ్యాధి వల్ల పుడుతోందని, యీ వ్యాధి నిర్మూలించడానికి ఒక రకం టీకా కనిపెట్టామని ప్రపంచ ఆరోగ్య నిపుణుల సంఘానికి చెందిన డాక్టర్ థిమా వెసికారి అన్నారట. ఈ టీకా మందుతో యింకా కొన్ని ప్రయోగాలు చేసి, ఆనక వాడుకలోకి వదులుతామని ఆయనన్నారట

### పదేళ్ళ బాలికపై అత్యాచారం!

డోన్‌కుచెందిన గుండ్వాల గ్రామంలో గొల్ల దేవమ్మ అనే పదేళ్ళ బాలకను అదే వూరికి చెందిన 18 ఏళ్ళ గురువులు అనే అతను బలాత్కరించి తన కామ పశు వాంఛ తీర్చుకున్నాడట అతను పరారీలోనూ, ఆమె కర్నూలు ఆసుపత్రిలోనూ వున్నారట.

### జన్మహక్కు!

పశ్చిమ జర్మనీకి చెందిన హసా అనే వో నగరంలో ఒహాయన తన పెరట్లో వో కొలను కట్టే అందులో కప్పలు స్థావరాన్ని ఏర్పరచుకున్నాయట. ఈ కప్పల బెక బెకల గీతాలు వినలేక ఆయన పక్కింటి ఆయన కోర్టుకు ఎక్కితే న్యాయమూర్తిగారు విచారించి, ఆ ధనికుడు తన పెరట్లో కొలను కట్టుకోడం తప్పు కాదని, అందులో కప్పలుండడంగానీ, అవి అర వడంగానీ తప్పు కానే కాదనీ చట్టం అరవద్దని ఆంక్ష విధించినా అవి కోర్టు ఆజ్ఞను లక్ష్య పెట్టవనీ, పశుపక్ష్యాదుల స్వాతంత్ర్యానికి మన కోర్టులు అడ్డు పెట్టవని తీర్పు యిచ్చారట.

### వయసులో ప్రేమ — వృద్ధాప్యంలోపెళ్ళి!

బ్రిటను పార్లమెంటు మెంబరు 52 ఏళ్ళ పాల్ హాకిన్స్ అనే ఆయన తాను వయస్సులో వున్నప్పుడు టీనా డానియల్స్ అనే అమ్మాయిని ప్రేమించి ప్రేమింపబడ్డాడట కారణాంతరాల వల్ల వీరిద్దరి వివాహమూ జరుగక యిద్దరూ చెరొకర్ని పెళ్ళి చేసుకుని బోల్డు పిల్లలు కన్నారట కాలచక్రంలో కాలం తిరిగి పాల్‌హాకిన్స్ భార్యా, టీనాడానియల్స్ భర్తా చనిపోయారట ఒక చర్చిలో కలిసిన వీరు యిది భగవత్ సంకల్పమేనని ఎంచక్కా ఆ వయస్సులో వివాహం చేసుకుని, తమ తమ పిల్లల ఆశీస్సులు పొందారట-

### స్టౌ ప్రమాదంలో గృహిణి మృతి!

చిత్తూరు బాలాజీ నగరు కాలనీలో శ్రీనివాస ఆచారి భార్య 25 ఏళ్ళ రేవతి తన భర్తకు కాఫీ కాచివ్వాలనే తొందరలో ముందు స్టౌ వెలిగించి, ఆనక దాని మీద పెట్టే గిన్ని కోసం లేచి అలమరా వెతుకు తూండగా ఖాళీగా వున్న స్టౌలోని మంట ఆమె చీరను చుట్టి, చూస్తూండగానే భగ్గున చీరను కబళించి ఆమెను తనలో చేర్చేసుకుందట•

### గాలిపటాల ఆంతర్యం!

కొరియా దేశపు ప్రజలు సంక్రాంతికి ముందు (లేక వెనుక) వచ్చే పున్నమినాడు గాలి పటాలు ఎగుర వేస్తారట వాటి మీద మా శనీ! వదిలిపో! మా దురదృష్టమా! తొలగిపో! అని రాసి, వాటిని బాగా ఎత్తుకు ఎగురవేసి, ఆనక దాటిని తెంపేస్తారట తాడు తెగిన గాలిపటం ఎక్కడో తెలీని చోట పడిపోయినట్టు తమ దురదృష్టం కూడా దాంతోనే ఎక్కడికో కొట్టుకుపోయిందని, యిహ మిగి లినదంతా అదృష్టమేననీ వీరు భావిస్తారట అంతే గాక తమకు సన్నిహితులు, బంధువులు, తమవారూ చనిపోతే వారి ప్రేతాత్మలు కూడా ఆ గాలి పటంతో బాటు కొట్టుకుపోతాయని కూడా నమ్ముతారట- అందుకే నమ్మకానికి మించిన మందు, అనుమానానికి మించిన రోగం లేదు అన్నారు

### న్యాయవాదిహత్య!

కరీంనగర్‌కు చెందిన 37 ఏళ్ళ గోపు రజన్న అనే వో న్యాయవాది 12వ తేదీ సినిమా చూసి, భార్యా పిల్లలతో స్కూటరు మీద యిల్లు జేరి, స్కూటరు ఆపి ఇంట్లోకి వెళ్తుండగా ఎవరో గుర్తు తెలియని వ్యక్తులు ఆయన్ని తుపాకితో కాల్చారట. వీపులోను ఎడం భుజంలోనూ గాయాలు తగిలి, అదే రాత్రి 9 30కు చనిపోయారట ఈయన సి పి ఐ. యం. యల్. గ్రూపుకు చెందినవారట. పీపుల్స్ వార్ (ప్రజాయుద్ధం)కు చెందిన కోర్టు కేసులను చేప ట్టేవారట

### బట్టతలపై జుట్టు!

బట్టతల మీద పుంఖాను పుంఖాలుగా జుట్టు రావడానికి సంబంధించిన పరిశోధలను వాషింగ్టన్‌కు చెందిన విజ్ఞానులు జరిపి కొంత సాధించారట. "మినోక్సిడిల్" అనే వో మందు కనిపెట్టారుట ఈ మందు కొంత మంది బట్టతలల మీద ప్రయోగిస్తే నూటికి డెబ్బయిశాతం ఫలితాలనిచ్చిందని డాక్టర్ థామస్‌నిగ్రా అన్నారట ఇది ఇంకొంచెం పరిశోధన తరువాత విశ్వవ్యాప్తంగా విడుదల చేస్తామన్నారటా డాక్టరుగారు □








# ప్రగతిపథంలో రెండేళ్లు



ముఖ్యమంత్రి శ్రీ యన్.టి. రామారావుగారి సారథ్యంలో ప్రగతిపథంలో ఆంధ్రప్రదేశ్ జనవరి 9, 1985న రెండు సంవత్సరాలు పూర్తి చేసుకుంటున్నది. పేద ప్రజల బ్రతుకులు పండించడానికి, రాష్ట్రం మరింతగా పురోగమించడానికి, ఉజ్వల భవిష్యత్తుకు దారులు వేస్తున్నది.

### రూ. 2 లకే కిలో బియ్యం

★ 96.54 లక్షల బీద కుటుంబాలకు లాభం.

### బలహీనవర్గాలకు పక్కా ఇళ్లు

★ 1.85 లక్షల పక్కా ఇళ్ల నిర్మాణం.

★ 7.18 లక్షల ఇళ్ల స్థలాల పంపిణీ

### బడుగు వర్గాల సంక్షేమం

★ 13.54 లక్షల మంది షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులు, వెనుకబడిన వర్గాల కుటుంబాలకు లాభం.

★ 4.3 లక్షల మంది విద్యార్థులకు ఉపకార వేతనాలు.

### త్రాగడానికి మంచి నీరు

★ 28,180 మంచినీటి వనరుల ఏర్పాటు.

★ 4,000 సమస్యాత్మక గ్రామాలలో మంచినీటి సౌకర్యం.

### రైతులకు సహాయం

★ 58,000 టన్నుల మేలురకం విత్తనాల పంపిణీ.

★ 14.5 లక్షల టన్నుల రసాయనిక ఎరువుల సరఫరా.

### గ్రామీణ పరిశ్రమలు

★ 24,000 గ్రామీణ, లఘు పరిశ్రమల స్థాపన.

★ 21,000 మందికి పైగా 'గ్రామోదయ' విముక్తి పథకాల క్రింద లాభం.

### భూములు లేని వ్యవసాయ కూలీలకు వృద్ధాప్యపు పింఛను

★ నెలకు తలా రూ. 30 ల చొప్పున 5 లక్షల మంది వ్యవసాయ కూలీలకు లాభం.

★ ఈ పథకంకోసం రూ. 6 కోట్లు కేటాయింపు.

### సొంత రిక్షా పథకం

★ రిక్షా నడిపే వారికి సొంత రిక్షాలు ఉండడం కోసం 20 శాతం సబ్సిడీ.

★ ఇందుకు ఒక కోటి రూపాయల కేటాయింపు.

### సగం ధరకే చీరలు, ధోవతులు

★ పచ్చ రేషన్ కార్డు గలవారికి సగం ధరకే చీరలు, ధోవతులు సరఫరా.

### మహిళా సంక్షేమం

★ తిరుపతిలో మహిళా విశ్వవిద్యాలయం ఏర్పాటు,

★ ఆస్తిపంపకంలో స్త్రీలకు సమాన హక్కుల కల్పనకై శాసనం.

### వితంతువులకు పింఛను

★ 38,000 మంది వితంతువులకు నెలకు ఒక్కొక్కరికి రూ. 50 ల చొప్పున పింఛను.

### మధ్యాహ్న భోజన పథకం

★ 34.32 లక్షల మంది బడి పిల్లలకు లాభం.

**ఇది ప్రజా ప్రభుత్వం * పేదలకే అంకితం**

DIPR No. 1/Advt II/C4/85 సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.

# హైదరాబాద్ నోట్‌బుక్

## గవర్నర్ సూచన:—

వ్యవసాయ శాస్త్రజ్ఞులు తమ పరిశోధనలతో **ఆహారోత్పత్తిని** ఇనుమడింప జేయడానికి కృషి చేయాలని గవర్నర్ డాక్టర్ శంకర్‌దయాళ్‌శర్మ జనవరి 4 న భారతీయ వ్యవసాయ విశ్వ విద్యాలయ సంఘం 13వ వార్షికోత్సవాన్ని ప్రారంభిస్తూ సలహా యిచ్చారు. ఈ వార్షికోత్సవం రాజేంద్ర నగర్‌లోని వ్యవసాయ విశ్వ విద్యాలయం ఆవరణలో రెండు రోజులపాటు జరిగింది ఆకలి సమస్య ప్రపంచ వ్యాప్తమైంది. వ్యవసాయ శాస్త్రజ్ఞులు ఆహార విషయంలో స్వయం పోషకత్వం సాధించడానికి భారత దేశంలోనే కాక కోటాను కోట్లు ఆకలితో మాడుతున్న తృతీయ ప్రపంచ దేశాలకూ తోడ్పడాలి. మన లక్ష్యం వసుధైక కుటుంబం గనుక తృతీయ ప్రపంచ దేశాలు మన మార్గదర్శకత్వాన్ని ఎదురు చూస్తున్నాయి.— అని ఆయన అన్నారు. దేశంలోని వివిధ వ్యవసాయ విశ్వవిద్యాలయాలు శాస్త్రజ్ఞులను పరస్పరం బదిలీ చేసుకోవడంవల్ల పరిశోధన మరింత విస్తరించగలదని ఆయన అన్నారు. భారతీయ వ్యవసాయ విశ్వ విద్యాలయాల సంఘం అధ్యక్షుడు, మహారాష్ట్రలోని కొంకణ్ కృషి విద్యాపీఠ్ వైస్ చాన్సలర్ డాక్టర్ పి. వి. సాల్వి ఈ వార్షికోత్సవానికి అధ్యక్షత వహించారు. వీటిని పూర్తిగా వినియోగించుకోవాలని, మురుగు నీటి సమస్యను పరిష్కరించుకోవాలని ఆయన అధ్యక్షోప న్యాసంలో అన్నారు. వ్యవసాయ విశ్వ విద్యాలయాలకు ఇంకా ఆర్థిక సదుపాయం ఉండా లని, అది లేనందున పరిశోధన చాల కుంటు పడుతున్నదని ఆయన విచారం ప్రకటించారు రాజేంద్రనగర్ వ్యవసాయ విశ్వ విద్యాలయం వైస్ చాన్సలర్ శ్రీ బి. ప్రతాపరెడ్డి ప్రారంభంలో స్వాగతం చెబుతూ, పెక్కు దేశాలకు వ్యవసాయోత్పత్తులను ఎగుమతి చేసుకొనే శక్తిని సంపాదించుకొనేదే భారతదేశం గ్రామీణ ప్రజల జీవన ప్రమాణాన్ని అభివృద్ధి చేసుకోడం సాధ్యం కాదని అన్నారు.

## 386 వ గీతా యజ్ఞం:—

స్వామి చిన్మయానంద మిషన్ 386వ గీతా గాన యజ్ఞాన్ని జనవరి 3న మహబూబ్ కాలేజిలో గవర్నర్ డాక్టర్ శంకర్‌దయాళ్‌శర్మ ప్రారంభిస్తూ, భగవద్గీత 9వ అధ్యాయాన్ని పారాయణం చేయడానికి ఏడు నిమిషాలే పట్టినా, అర్థం చేసుకోడానికి 15 ఏళ్ళు పడుతుందని అన్నారు. స్వామి చిన్మయానంద ప్రసంగిస్తూ, మానవునిలోగాని, సంఘంలోగాని, రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాంకేతిక రీతితో కలిగే విప్లవాత్మకమైన మార్పులు తాత్కాలికమైనవేనని మానవజాతి చరిత్రలో రుజువయిందన్నారు. మనం శీలంలోను, దృక్పథంలోనూ సంపూర్ణమైన మార్పు రావడానికి మనం ప్రయత్నించాలి. ఈ పునరుద్ధరణ కోసమే ఈ సంపూర్ణమైన మార్పు కోసమే ఋషులు, మహాత్ములు కృషి చేసినట్టు చరిత్ర చెబుతున్నది. ఈ మార్పును తీసుకు రావడానికి సంబంధించిన కిటుకులు భగవద్గీత 9వ అధ్యాయంలో ఉన్నాయి. స్వామి చిన్మయానంద జనవరి 10 వరకు ఉదయం, సాయంకాలం భగవద్గీతపై ప్రసంగించారు పుస్తక ప్రదర్శనం కూడ ఏర్పాటు చేయబడింది

## శ్రీ బెడ్‌జోయి సలహా:—

జాతిని తనానికి, వలసలకు, యుద్ధాలకు మూల కారణం ప్రపంచ సహజ సంపద సమానంగా పంపిణీ కాక పోవడం, ఈ సమస్యా పరిష్కారానికి సమన్విత, ప్రపంచ వ్యాప్త అభివృద్ధి జరగాలి— అని హేగ్‌లోని అంతర్జాతీయ న్యాయ స్థానం న్యాయాధిశులు శ్రీ మొహమ్మద్ బెడ్‌జోయి అన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆయనను జనవరి 3వ తేదీన టాగూర్ ఆడిటోరియంలో ప్రత్యేక స్నాతకోత్సవంలో గౌరవ డాక్టర్ ఆఫ్ లాస్ బిరుదంతో సత్కరించింది. అభివృద్ధి కావడానికి గల హక్కు మానవజాతి ఉమ్మడి వారసత్వమని ఆయన అన్నారు. కాని ఈ హక్కు చట్టానికి కట్టుబడి వుండాలని ఆయన అన్నారు మానవుల కందరికీ కావలసిన ఆహార సంపద మానవజాతికి అంతటికీ సంబంధించిందనీ, అంతర్జాతీయ సంబంధాలకు ప్రమాదం కలుగకుండా ఈ సంపదను ఉమ్మడి సొమ్ముగా ప్రకటించాలని ఆయన సూచించారు. గౌరవ బిరుదాన్ని గవర్నర్ డాక్టర్ శంకర్‌దయాళ్‌శర్మ డాక్టర్ బెడ్‌జోయికి అంద జేశారు

## విదేశాలలో భారత పత్రికల ప్రతిష్ఠ:—

సత్యా, న్యాయాల పరిరక్షణలో భారతదేశ వార్తా పత్రికల పాత్రను విదేశీయులు బహుధా కీర్తిస్తున్నారని టాంజానియా రేడియో అధికారి బెన్‌కికో జనవరి 2 న ప్రెస్ క్లబ్‌లో జర్నలిస్ట్ యూనియన్ ఏర్పాటు చేసిన సమావేశంలో తెలిపారు. ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా ఏర్పాటు చేసిన అలీన దేశాల వర్కింగ్ జర్నలిస్ట్ శిక్షణ తరగతులలో శ్రీ బెన్‌కికో మరి 25 మంది ప్రత్యేక శిక్షణ పొందుతున్నారు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి. రామారావు 1984 ఆగస్టులో ప్రజాస్వామ్యం కోసం జరిపిన పోరాటాన్ని భారతీయ పత్రికలు సమర్థించడాన్ని ఆయన ప్రశంసించారు. ఈ అలీనదేశ పత్రికా రచయితల బృందం హైదరాబాద్, మద్రాసు, బెంగుళూరు, బొంబాయిలలో పర్యటిస్తుంది. ఢిల్లీ పత్రికా రచయిత శ్రీ దాసుకృష్ణమూర్తి అలీన దేశాల పత్రికా రచయితలను పరిచయం చేశారు.

## ఉపశ్రుతి:—

ఏంసార్, ఏ పార్టీ ఫిరాయించినా ఫలితం దక్కలేదే?— అనడిగాను ఓడిపోయిన ఒక అభ్యర్థిని. ఆయన ఏమీ చెప్పలేక నీళ్ళు నమిలారు పాపం! పూర్వం మూడు రంగులకు బలం ఉండేది రాష్ట్రంలో, ప్రస్తుతం పసుపు రంగుకు బలం గనుక ఆ రంగు చూడండి— అన్నాను. అదీ మనకు ప్రయోజనకరం కాకపోతే చివరకు గట్టిరంగు కాషాయ రంగే- అన్నాడు ఆయన పరాజయాన్ని సరసతతో గ్రహించేవాడు గనుక.

—తిరుమల రామచంద్ర

## ఢిల్లీలో పట్టాభిరామ్ ఇంద్రజాలం!

ఢిల్లీలోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ "ఢిల్లీ తెలుగు సంఘం" వారు ఇటీవల ప్రొఫెసర్ బి. వి. పట్టాభిరామ్ ఇంద్రజాల ప్రదర్శనని ఏర్పాటు చేసి ఢిల్లీలోని తెలుగు వారందరికీ కనువిందు చేసారు మూడు గంటల పాటు ప్రొఫెసర్ పట్టాభిరామ్ అత్యంత ఆశ్చర్యకరమైన, ఒళ్ళు గగుర్పొడిచే అంశాలు ప్రదర్శించారు. మేజిక్‌తో పాటు, హిప్నాటిజం, వైజ్ఞానిక ప్రదర్శనను కూడా ప్రదర్శించి, [illegible] ప్రశంసలు అందుకుని ఢిల్లీలో హిప్నాటిజం ప్రదర్శన ఇచ్చిన మొట్ట మొదటి దక్షిణ భారతీయునిగా గుర్తింపబడ్డారు.

ఇన్‌కమ్‌టాక్స్ ట్రిబ్యునల్ సీనియర్ వైస్ ప్రెసిడెంటు శ్రీ సి. [illegible]మూర్తి, ప్రొఫెసర్ పట్టాభిరామ్‌కు మెమెంటో బహూకరించారు. సంఘం కార్యదర్శి శ్రీ రామలింగేశ్వరరావు వందన సమర్పణ చేశారు

## అవీ ఇవీ అన్నీ

### తెలుగు కళాజ్యోతి కథల పోటీ

1985, ఉగాది సందర్భముగా 'తెలుగు కళాజ్యోతి' న్యూఢిల్లీవారు కథల పోటీ నిర్వహిస్తున్నారు. కథలు సమకాలీన, సామాజిక జీవితాన్ని ప్రతిబింబించేవిగా ఉండాలి. ఎంపిక చేసిన కథలు 'తెలుగు కళా జ్యోతి' ఉగాది సంచికలో ప్రచురింపబడతాయి. విజేతలకు నగదు బహుమతులు. కలవు కథలు 5 మార్చి, 1985లోగా పంపాలి. పోటీ వివరాలకు ఎడిటర్, తెలుగు కళాజ్యోతి, 151, పోలీస్ కాలనీ, హవుజ్‌ఖాస్, న్యూఢిల్లీ-110 016కి రాయవచ్చు.

### రాష్ట్రస్థాయి చిత్ర కళ పోటీలు

బాపట్ల లలిత కళా కేంద్రం ఆధ్వర్యంలో 14వ రాష్ట్రస్థాయి వార్షిక చిత్రకళ, శిల్ప కళ పోటీలు జరుగుతాయి. ఈ పోటీలకు సాంప్రదాయ, ఆధునిక కళా రీతుల్లోని చిత్రాలను, గ్రాఫిక్, బాతిక్ చిత్రాలను పంపవచ్చు. జనవరి, 1983 తర్వాత చిత్రించిన చిత్రాలు మాత్రమే అంగీకరించబడతాయి. పోటీకి చిత్రాలను 1-3-1985లోపుగా పంపాలి.

ఇతర వివరాలకి కార్యదర్శి, లలిత్ కళా కేంద్రం, 7-4-32, భీమావారిపాలెం, బాపట్ల-522 101కి రాయవచ్చు. □



*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna, Phones : P. B. X. : 61247, 61248 & 75667.*

# రెక్కల కష్టాన్ని కాకులకు పెట్టకండి!



కష్టపడి సంపాదించిన దాన్ని పొదుపు చేయండి.
మీరు చేసే పొదుపు మీకు సౌభాగ్యం-దేశానికి సంక్షేమం!

- రా[illegible]వన్ను రాయతీలలో పి.పి.ఎ ఫ్ పథకం- అందరూ చేరవచ్చు
- ఇస్యూ ప్రతి 6 నెలలకు ఆదాయం 12-00 శాతం వడ్డీ
- 10 సం॰ సి.టి.డి. నెలసరి అదా చేయండి పన్నులలో రాయతీలు
- 11.0 శాతం వడ్డీ మరియు ప్రణాళికా రక్షణ
- ఎన్. ఎస్. సి. 11 ఇస్యూ రాబడి పన్ను, సంపద పన్నులో రాయతీలు
- 5 సంవత్సరముల టైమ్ డిపాజిట్ 11.5 శాతం వడ్డీ
- 3 సం॰ల టైమ్ డిపాజిట్ సం॰కు 10.5 శాతం వడ్డీ
- 2 సం. టైమ్ డిపాజిట్ సం॰కు 9.75 శాతం వడ్డీ
- ఎస్. ఎన్. సి. VI ఇస్యూ 6 సం॰లు మీ డబ్బు రెండింతలకు పైగా పెరుగుతుంది.
- ఏడాది టైమ్ డిపాజిట్ సం॰కు 9 శాతం వడ్డీ
- పోస్టల్ సేవింగ్ బ్యాంక్ అకౌంట్ రు. 200తో 5.5. శాతము వడ్డీ + సంవత్సరానికి రెండుసార్లు తీసే డ్రాలో ఆకర్షణీయమైన బహుమతులు



వివరాలకు
**కమీషనర
స్మాల సేవింగ్స
ఆంధ్రప్రదేశ ప్రభుత్వం
(ఫైనాన్స విభాగం)
హైదరాబాదు - 500002**

**పొదుపు చేస్తే పండుగ - ఖర్చు చేస్తే దండుగ**

SRUJANA/APSS/1/85/TEL